Bharathi, 7th May 1954. Regd. No. 1856

“లక్స్ టా   లెట్ సబ్బు
ఎంతో తెల్లనైనది, ఎంతో శుద్ధమైనది—మరియు దాని
నురగ ఎంతో మెత్తగాను, సువాసనగాను నుంటుంది

అని నిమ్మి చెప్పుచున్నది




ఇండియాలో
తయారు
చేయబడినది



లక్స్ టాయ్‌లెట్ సబ్బుయొక్క తెల్లదనమంటె అందరు మెచ్చుకుంటారు. మిక్కిలి శుద్ధమైన నూనెలనుండి తయారైన సబ్బు మాత్రమే ఇంత తెల్లగా నుంటుంది. నిమ్మి ఇలాగున చెప్పుచున్నది. “లక్స్ టాయ్‌లెట్ సబ్బుతో మిక్కిలి మనోహరముగా నుండుట చాల సులభము. సువాసనగా నున్నటివంటియు, మెత్తగానున్నటువంటియునైన దాని నురగను చర్మ రంధ్రముల లోనికి బాగా పోయేటట్లు మాత్రము చేయండి—అది అంత లోపలనున్న మలినమునుగూడ పోగొట్టి శుభ్రము చేయును. మీ శరీరమునకు అది ఇచ్చు అద్భుతమైన ప్రకాశత్వమును చూచి మీరు ఆశ్చర్యమును పొందుతారు!”

“...అందుచేతనే నా యౌవ్వన చర్మ సౌందర్యమునకు లక్స్ టాయ్‌లెట్ సబ్బును ఎన్నుకొంటాను.”

శరీరమంతా సౌందర్యముగా నుండుటకు

క్రొత్త
పెద్దసైజు సబ్బు
ఇప్పుడు దొరకుచున్నది
ఈవేళే దానిని కొనండి

LTS. 415-X52 TL

# భారతి

సాహిత్య

మాస పత్రిక

సంపాదకుడు :

శివలెంక శంభుప్రసాద్

జూన్ 1954

సంపుటము 31 సంచిక 6

విడిపత్రిక వెల ఒక రూపాయి

# రెండు మహానగరాలు

మూలం : చార్లెస్ డికెన్స్

అనువాదకులు :

## శ్రీ తెన్నేటి సూరి

అది ఒక వైభవోజ్వల మహాయుగం—వల్లకాటి అధ్వాన్నశకం; వెల్లివిరిసిన విజ్ఞానం—బ్రహ్మ జెముడులా అజ్ఞానం; ఆశాకుసుమాలు పుష్పించిన ఆమధురవసంతం-- నైరాశ్యపు చలి గుబుళ్లు యీచుకున్న శిశిరాస్యం; సర్వసంపత్సమృద్ధి—సర్వతోముఖ క్షామం; సూక్ష్మంగా చెప్పాలంటే—నేటి పరిస్థితికి నకలుగా వుందినాటి పరిస్థితి

అలాంటి కల్లోలదినాలలో లండన్ పారిస్ నగరాలను రెంటినీ పెనవేసుకుని సాగిన ప్రణయబలిదాన గాథ! ఆంగ్ల నవలా ప్రపంచ నిర్మాత చార్లెస్ డికెన్సు ప్రతిభా సంపత్తులు వెల్లివిరిసిపోయిన "టేల్ ఆఫ్ టూ సిటీస్" అనే 'కాసికల్' నవలకు అనువాదం.

**ఆంధ్ర గ్రంథమాల, మదరాసు-1.**

---

## కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

(రెండు భాగములు)

(మూలం : అలెగ్జాండర్ డ్యూమా)

ఒక్కొక్క భాగం వెల **3-8-0**

అనువాదం : సూరంపూడి సీతారామ్

## ఆత్మకథ

(రెండు భాగములు)

మహాత్మాగాంధీ

ఒక్కొక్క భాగం **5-0-0**

## రాజూ - పేద

(మూలం : మార్క్ ట్వేన్)

అనువాదం . నండూరి రామమోహనరావు

వెల **2-0-0**

**ఆంధ్రగ్రంథమాల**

---

# విషయానుక్రమణిక

-: o :-

## జూన్ 1954

# భారతి ముప్పదియొకటవ సంపుటము

## [1954 జనవరి - జూన్]

---

# అకారాది విషయసూచిక







# లైఫ్ బాయ్ సబ్బు

ప్రతిదిన మలినములోని క్రిములనుండి
మిమ్ములను కాపాడును







ఇండియాలో తయారుచేయబడినది

L. 248-X52 TL



పునరాగమనము

చిత్రకారుడు: శ్రీ రణవీర్ సాక్సేనా



జయ
జ్యేష్ఠము

# భారతి

సంపుటము 31
సంచిక 6

## ఏ షణ శరణాగతి

శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య

సంద్రముదాటి వచ్చితిన? - సంచలితావిలనక్రచక్ర ని
స్తంద్రము నీదివచ్చితిన? - స్వామి! దయామయ! ఏ యలౌకికా
తీంద్రియశక్తినిచ్చి తరియింపగజేసితి వీ మహాంధతా
సాంద్రపయోధి - ఈ దురవసానభవోదధి - తామసావధిన్.

సత్వగుణప్రభావితము సత్యపరాక్రమ మార్ష సంహితా
తాత్విక శాంతి దాంతి సమతా మహిమోన్నతమైన ఈ మను
ష్యత్వపు మాతృమందిరమునం దనురాగమనంబునైచి భ్రా
తృత్వమొసంగుమా! భరతదేశమ! పుణ్యజనాధి వాసమా!

ఏ తలమందుపుట్టి ప్రవహించుచు నీ మహనీయభారతో
ర్వీతల మొక్క స్వర్గ మొనరించెడి విష్ణుపదీప్రవాహమే
నాతలమందు మున్కలిడి అందునడిందియు పాపపంకిల
స్థితము నచ్చటే కడిగివేసెద నాదగు రాక్షసత్వమున్.

ఏపద పంకజమ్ములు త్రయీమయమూర్తి హిరణ్మయప్రభా
నైపుణిమీఱి గైరిక మహశ్శిలకంటెను హీనమైన భూ
మై పడియున్న మాని జవరాలి నిరాళి తరింపజేసె నే
నాపదధూళి నాశిరమునందు ధరించి తరించిపోయెదన్.

నల్లనివాఁడు నిల్వు తిరునామమువాఁడు ప్రఫుల్ల పుండరీ
కోల్ల'సితాయతాక్షముల నొప్పెడువాఁడు వెడందదైన పే
రుల్లమువాఁ డుదగ్రభుజయుగ్మమువాఁడు ధనుశ్శరాది సం
పల్లలితోపశోభితశుభప్రదమూర్తి ప్రసన్నుఁడయ్యెడున్.

శరణంబంచును నేను మ్రొక్కినది యుష్మల్లోక విక్రాంతమా
చరణద్వంద్వమటే! మదీయనతమస్తన్యస్తమైనట్టి దు
ద్ధరణత్రాణలసద్విరాడభయ హస్తంబట్టె! ఈపాటినే
పరిరంభం బొనరించుకొన్నదది విశ్వవ్యాప్త రూపంబటే!

నన్ను క్షమించువాఁడు రఘునాయకుఁ డొక్కఁడెయంచు నమ్మి నీ
సన్నిధికేగుదెంచితిని స్వామి! అపారకృపాసముద్ర! ఆ
పన్నభయార్తిభంజన! భవత్సముఖమ్మున గాఢగద్గదా
పన్నగళమ్ముతో నెదియు వాకొననేరను పాపకర్ముడన్.

# ప్రవాసము - ఊర్వశి

## శ్రీ వేదాల తిరువేంగళాచార్యులు

"ప్రవాసము-ఊర్వశి" రెండు ఖండకావ్యాలు. రచించింది శ్రీ కృష్ణశాస్త్రిగారు. భావకవులు. "అర్థమ్ముకాని భావగీతమ్ములివి" అనడం వల్ల వీరి కవిత్వం భావకవిత్వమని, వీరు భావకవులని స్పష్టం.

ఏ కవిత్వానికైనా అక్షర రమ్యత—అంటే శయ్య, ప్రసన్న కథా కలితార్థయుక్తి—అంటే పాకం—ఇవి రెండూ ప్రాణం. భాషా, భావాల సామంజస్యం కవితకు జీవం అన్నమాట. ఆ సామంజస్యం కథా కలితం అవడం యుక్తం. ఈ సాహితీ తత్త్వం సాహిత్యశాస్త్ర మార్మికుడు కాని తెలుపలేడు. అందుకే నన్నయభట్టారకుడు భువనోపజీవ్యుడు. మన ఆదిమ సాహిత్య విధాత అయిన ఆ మహానుభావుడు "విశ్వశ్రేయః కావ్యమ్" అని ప్రయోజన దృష్టితోను, "సావాగ్యా రసవృత్తిః" అని అనుభవదృష్టితోను లక్షణం చెప్పాడు. 'కావ్యం యశసే' (కావ్యము యశస్సుకొరకు) అనే పరిమిత బుద్ధి కాని, ఆమాత్రపు మాపే కాని లేదాయనకు. కావ్యాత్మకమైన వాక్యం రసవృత్తి కావడానికి రెండు ఉపాయాలను లక్ష్యంలో ఆయన చూపాడు. ఒకటి—అక్షర రమ్యత; రెండు—ప్రసన్న కథా కలితార్థయుక్తి.

భావకవిత్వంలో కూడా కథ ఉంటుందా అని సంశయింప బనిలేదు. దీనిలో కవి ఆత్మకథ ఉంటుంది.

"ఏను తొలుత నే గూడేని లేని పులుగు
రాయడ—వహించినాడ నా బ్రదుకు బాట
...............................
తెరువె లేని, తీరమె లేని దివ్యసీమ!"

ఇక్కడి అధ్యవసానం కవి చరిత్రాన్ని వ్యక్తం చేస్తుంది. పులుగుల రాయడుగా—అనగా, వేదాత్ముడు గరుత్మంతుడుగా—అధ్యవసితుడైన ఈ కవి తొలుత వైదిక సంప్రదాయమువాడని, అవధుల నెరుగని అనులినమైన ఉన్నతస్థాయిలో జీవితం నడిపాడని తెలుస్తుంది.

"అంత నే మారిపోతి సంధ్యా మనోజ్ఞ
చిత్ర సిందూర రేఖగా............
.........హాయి హాయిగా మెలగినాను
పైడి వన్నియతో నీలి నీడతోడ."

'సంధ్యా' పదము పాశ్చాత్య విద్యాప్రభావం వలన ఈ కవిజీవితంలో ఎట్టి విచిత్రపరిణామం కలిగినదో 'మనోజ్ఞ చిత్ర సిందూరరేఖ' లో వ్యక్తం చేసింది. అనురాగం గల మిత్రులతో హాయిగా కాలక్షేపంకూడా దీనిలో వ్యక్తమవుతున్నది.

"నేను మెలమెల్ల రిక్కనైనాను కాని,
ఆ విశాలవినీల సౌధాంతికమున
ఉండగలనా ప్రవాసినై యుడుసఖాళి
పల్కరింపక – ఒక రెప్ప పాటువేళ?"

ప్రాచ్య, పాశ్చాత్య సాహిత్యాల సమన్వయం వల్ల ఏకైక విజ్ఞానం కలవారికన్న మిన్నై తారాపథమందుకొన్నాడు. ఆదివరలోని మిత్రులను వీడి ఒంటరియై, ఆ ఒంటరితనమును భరింపలేక, అక్కడివారితో నేస్తం కలిపాడు. అనగా—ఇదివరకే తారాపథంలో ఉన్నవారితో ఇష్టాగోష్ఠి చేస్తాడట! కనుక—వారి వారి సంప్రదాయాలు తనలోకూడా కనుపడక పోవని ధ్వని. ఈ తీరుగా మహాకవులు తమ కావ్యాలలో స్వీయజీవిత విశేషాలను వ్యక్తంచేయడంకద్దు. శాకుంతలములో "కౌశిక ఇతికృత గోత్ర నామధేయో మహర్షిః" అనే మాటవల్ల కాళిదాసు కౌశికగోత్రంవాడని స్ఫురించడంలేదా? "ఆవర్త బుద్బుద తరంగమయాన్ వికారాన్ అంభో యథా సలిలమేవహి తత్ సమస్తం" అన్న శ్లోకార్థము భవభూతిని భర్తృప్రపంచుని మతం వానినిగా వ్యక్తపరచడంలేదా?

తాదాత్మ్యంవల్ల భావముల కథ స్ఫురిస్తుంది. మొదట — పులుగురాయడు అనంతాకాశంలో రెక్కలువిప్పి విహరించినట్లుగా నిర్బంధములేక అమలినాలైన నానావిధభావాలు విస్తరించి, అవధిలేని ఉదాత్తతలో ఉండేవని వ్యంగ్యం.

రెండోపద్యంలో భావాల మార్పు వ్యంగ్యం. స్వచ్ఛంగాఉన్న ఈ భావకుమారుడికి రాగరంజనం కలిగి, నిర్లిప్తత పోయింది. సంపర్కమాధుర్యంతో పాటు అవధివైచిత్ర్యం అబ్బింది. సంధ్యా మనోజ్ఞ చిత్ర సిందూరరేఖగా రూపొందాడు. పైడి వన్నెయతో — సుఖంతో, నీలినీడతో — దుఃఖంతో కూడా సమావేశం కల్గింది.

ఈ కవి "భావాలె పరువులై బ్రతుకును" గనుక, "స్వాగతాశ్లేషముల విడజాలు నెదల నల్లత్రావెను నిండు దోసిళ్లకొలది" అపుడు ఇతడుకూడ 'పసిడి వేకువ పెండ్లిండ్లబడిన వాడె!' కాని, ఇప్పుడు — 'జరఠాంధకార మృతికి' పాల్పడ్డాడు. ఒకనాడు వర్షర్తువులో —

"దారు లన్నియు మాపె
 దశదిశలు ముంచెత్తె
నీరంధ్ర భయదాంధ
 కార జీమూతాళి"

అప ప్రేయసి ఎలనో ఎటకో వెడలి పోయినది. "ప్రేయసీ! ప్రేయసీ! వెడలిపోయితి వేల, ఆ యగమ్య
కథయే మిగిలిన దితనికి. "ముగియబోని, ఏ యర్థమ్ము తెలుగరాని, వేసటలేని వెట్టి యన్వేషణమ్ము" మొదలైనది. ఆ అన్వేషణలో — "ప్రియురాలి కడియాల రవళులే ప్రేలెత్తి చూపి" నడిపించినవి. "ఎగ్గెత్తి పిలిచినవి." "అంతమే లేని యాత్రాపథాన పయనమై పోవు తదీయార్ద్ర హృదయమ్ములో పడియున్న వెన్నెన్నొ అడుగుజాడలు నిశికడుపులో తారలై, నిశ్శబ్దవాటిలో చిరుపాటలై." ఇక ఏమియు తోచక — విభావరీ వేలా శాలల నామె మృదు వసనాంచలముల గుసగుసలలో. మసలు చరణ మంజీరముల కొసరు జాలి పలుకరింపుల వెంబడి బడి పయనమై పోయి పోయి, 'గంధర్వలోకమధుర సుషమా సుధాగాన మంజువాటికలో తొలుత విడిశాడు. ఇప్పుడిరువురికిని ప్రవాసమే! ప్రేయసీ స్మరణ మొదలైనది.

"ప్రేయసీ! ప్రేయసీ!
ఓ యమావాస్యా తమస్వినీ!
 గగన సీమంతినీ!
నా సఖి! నీ దీర్ఘ ధమ్మిల్ల
 నీలవల్లీచ్ఛాయ
పొడిచికొని, పొడిచికొని
 నిదుర చెరవిడచి
పూవులు నేడు మరగు
 హృదయాల నాకొరకు
తళతళ పాడు...సురభి
 శ్వాహ్వానముల్ పరపి,
నన్గలచి వెర్రిని జేయు..."

అని తపించాడు. ప్రయాణమా — నీల విభావరుల్లో, కుహూ కుహరవాటిలో, అనంతయాత్రాపథాన జరుగుతూంది. ధ్యానం కొంత అచలయోగంలో నే నడుస్తున్నది కాని, అమనస్కయోగం లభ్యం కాలేదు. త్రోవలో "ఇరుదెసల శిరమెత్తు ప్రతికుజము, ప్రతి సుమము, ప్రతి విహంగమ రుతము" కూడా ఏకాంతాస్వాదాని కభ్యంతరాలైనవి. అప్పుడు ఆమె "మనోజ్ఞ కాంచన కాంచీమణి ఘుంటా శతములు ఏకాంతము కరుగ మ్రోయగా, విన నరచే బ్రతుకు దాల్చి నొసవ మ్రోత" కెంత ఏడ్చెనో ఇతడు! హృదయంలో — "సంజీయ కావి నశియించునా? ఆ బ్రతుకు సుంతైన సహియించునా?" అని భయపడ్డాడు. ప్రియురాలి అనురాగమూర్తే 'సంజీయకావి.' సహియించునా? — అనగా 'రుచించునా?' అని అర్థము.

తిరిగి అన్వేషణ ప్రారంభమైంది. కాదు కాదు — ప్రారబ్ధమైంది. ఈ విరహభావ కిశోరము వియోగ గీతికా రూపంతో 'నిదుర వెన్నెలల దారిని ఒక రేయి వెడలినాడు. 'నిదుర వెన్నెలల దారి' అంటే ప్రియురాలిని కనుగొనుటకు వేరుదారి అగుపడక, నైషధంలో చెప్పినట్లుగా 'నిదుర' — అంటే కలలే — చల్లని వెన్నెలవేళ పయనించు దారిగా భావించాడు.

ఆ వెడలటం కూడా — "ఒక విపంచీ విరహ కంఠ మొరసి, ఎగసి" పోయినాడు. ఇప్పు డతనికి — "ఒక వియోగశాలినీ హృదయరాగ వేదనా రేఖ"గా

రూప పరివర్తనం కలిగింది. "విరహపు టాకలి వేసనామె యంగుళీ కిసలయ చంచలాంచలముల [illegible] యనంత విశ్వాస" పద్దాడు. అది మొదలుగా—

> "అప్సరోంగ నాను
> రాగ వీథుల, కిన్నరీ రమ్య కంఠ
> సీమలో, శ్రావణాంబుదాశ్లేషపాళి
> తారకాలోక పంక్తుల, మారుతోరు
> పక్షముల............పవలు, రేలు
> కన్ను మోడుపు, మెయివాల్పు గాని
> లేక—"

తిరుగుచున్నాడు. ఈ తిరుగాడటంలో తన ప్రణయిని నిట్లు స్మరించాడు: "ఓ నితాంత వియోగినీ! ఓ నిశీథినీ! కఠోర ప్రణయశాలినీ! క్షమింపు." ఆమె ప్రణయం ఇట్లా అనుభవమైంది కవికి:

> "చాలునా సఖీ! నీ ప్రేమశాప? మీయ
> పూర్వనారక యాతనా ఖర్వతాపము?"

ప్రణయిని నిశీథిని కనుక తాను మెలమెల్ల రిక్కలైనాడు. అప్పటికీ స్థైర్యం చిక్కలేదు. అందుకే—"ఆ వినీల సౌధాంగణమున ఉండగలనా ప్రవాసినై?" అంటాడు. ఆమె నితాంత వియోగినే కనుక, ఈ వియోగాన్ని నితాంతంగా కవి భావిస్తున్నాడు. భవభూతి—"కటు స్తూష్ణీం సహ్యో నిరవధి రయం తు ప్రవిరహః" అన్నాడు. ఆ విరహం కటువు; తూష్ణీం సహ్యము. కాని, ఈ విరహం మాత్రం అట్టిది కాదు; మధురము, మృదు కవితాలాప సహ్యము. అయితే—ఈ విభేదం ఎందుకు వచ్చింది? ఆ విరహం వాస్తవికం; దేవీదేవులది; హృదయతల స్పర్శి. ఇది కాల్పనికం; మానవీ మానవులది; హృదయస్పర్శ ఏమీ లేనిది. అది కరుణ ప్రణయం—ఇది కఠోర ప్రణయం. ఆ తల్లి సీతాదేవి 'కరుణస్య మూర్తిః'. ఊర్వశి ఈ కఠోర ప్రణయిని.

అసలు ఈ 'ప్రవాసం' అంతా కూడా అనుకరణ మాత్రంగానే స్ఫురిస్తుంది కాని, ఉపజ్ఞతో వ్యక్తం కాదు. కవి భావనలో వాస్తవంగా భావితం అయినప్పుడే మూసలో కరిగిన బంగారంవలె స్వతంత్ర వ్యక్తిత్వంతో స్ఫురిస్తుంది. భావనలో ఎంత వాస్తవికంగా పాటవ వైదగ్ధ్యాలుంటే, అంత ఎక్కువ త్వరగా శ్రోతల మనస్సులలో అవి తగుల్కొంటవి. కవి భావన ఉన్న చోటు చూడండి:

> "ఎన్ని ఎన్ని నిశ్శ్వాసము లెగసినవియొ!
> ఈ బ్రదుకె రూపు మాసిపోయినది కాని,
> ఇంత నిశ్వాసమ్ములో జాలినంత నీడ
> ఒదవగా లేద యొక్క నిట్టూర్పునకును."

ఈ భావన అయినా మన హృదయాలకు ద్యుతిని కలిగిస్తున్నదే కాని, వికాస విస్తరతలను కలిగించటం లేదు.

ఎక్కడైనా ఒకపాత్రకు భావతన్మయత కలిగినప్పుడు ఆ పాత్రయే వక్త కావడం ఉచితం కాదు. "యత్ర త్వస్య సర్వ మాత్మైవాభూత్, తత్ కేనకం పశ్యేత్? కేనకం విజానీయాత్?" అని ఉపనిషత్తు.

> "నాటినుండియు నేను ప్రతినిశీథ తమంపు
> కాటుకలచాటు నోరులే రరసులేని తతి
> చూచుకొని, చూచుకొని శూన్యహృద
> యములోని
> కోచెలీ! యని క్రుంగి క్రుంగి ఏడ్తును
> సుమా!"

వియోగ దుఃఖైకమగ్నత్వంలో, అఖాతంపు ఏకాంతంలో నాయకుడికి ద్వైతప్రసక్తిలేని శూన్యమనోవీథిలో 'చెలీ!' అనే స్మరణం ఏర్పడి, క్రుంగి కృశించడంతో భావతన్మయత్వం నాయకుడిలో లీలామాత్రంగా చెదరి చెదరిపోతూ వ్యక్తమౌతుంది. ఈ దశలో స్తంభాదు లుచితం కాని, వాఙ్నిస్సరణం కాదు. "అంతర్బాష్ప శ్చిరమనుచరో రాజరాజస్య దధ్యౌ"—అన్నాడు మహాకవి కాళిదాసు.

కనుక—తన్మయత కలిగించే భావాల విషయంలో నాయకుడికీ, నాయికకూ, మనకూ కూడా ప్రవాసమే! అంకితం పొందిన రామమూర్తికి లోకాంతర ప్రవాసం కనుక, ఆ దృష్టిలోను కవి ఈ ఖండ కావ్యమున కుంచిన ప్రవాసాఖ్య సార్థకమే! దీనిలో—"పవలు రేలు కన్ను మోడుపు, మెయివాల్పు గాని లేక"—అని ఈ మోస్తరు తెనుగు నుడికారం స్వల్పంగా ఉన్నా, శయ్యా సౌభాగ్యం చాలా తక్కువ. నిజానికి—ఈ ప్రవాసంలో, ఈ వియోగంలో శయ్యా సౌభాగ్యం ఎట్లా ఉంటుంది? ఉండకపోవడమే

ఉచితం. పాత్ర, ప్రకరణాల అనుగుణ్యంకదా ముఖ్యం! అంతేకాక—ఇక్కడ కవినాయకుడే తన మరణశయ్య పరచుకొన్నాడుగదా! అది కాష్ఠ కఠినం గాక, సుమ సుభగంగా ఉంటుందా మరి?

అయితే—నా

"నేనె నాకు వీడ్కోలుపు విన్పించినాను
... ... ... ... ...
నేనె నాపయి వాలినా నేనె జాలి
నెదనెద* గదించినాను, రోదించినాను"

అన్నా,

"కరుణ పట్టనకే బిచ్చగాని చేయి
చాచుకొనినాడ మృత్యుఘోషమ్మె మఱచి"

అని చేయి చాచుకొన్నా, "ఎత్తినది ఎత్తిన్నట్లే కృశించిన కరం" గనినా కూడా కనికర మెవ్వరికీ కల్గలేదు.

"పడములే ఆర్పగా నొక్క బాష్పమేని"

అని కవి కూడా మన మాటే ఒప్పుకుంటున్నాడు. కాకపోతే మాత్రం కరం కనినంతమాత్రాన తల్లక్రిందులుగా కనికరం ఎవరికి కలుగుతుంది? కనుక—పాకం సంగతి కూడా తేలిపోయినట్లే!

అయితే—ఈ శయ్యా సాభాగ్యం ఊర్వశి కుంది. ఆమె మోహినీ హాసమల్లీ ప్రఫుల్లరుచి; దివ్య మందార సుమరు. ఈ లోకోత్తర సుకుమారికి ఈ సుకుమారమైన శయ్య "ఎదలోపలి యెదలో, నెమ్మదిలో, జీవనరహస్య మార్గాలలో" ఉంది. "మృదూని కుసుమాదపి, లోకోత్తరాణాం చేతాంసి!" అక్కడ నెమ్మదిగా శయనించి, 'వచలని కోరికై', బ్రదుకు బరువులెల్ల పాట పాడిస్తుంది.

"ఆమె యాజ్ఞ కూడెనా...హాయిగా యుగ యుగంబుల కలల్ పాడ" నౌతుంది. ఎందువల్ల?

"ఆమె కన్నులలో అనంతాంబరంపు
నీలి నీడలు కలవు... ... ...
ఆమె తేనియ గొంతెత్తు నేని...
ఎందులకో† పాడినట్లుండు...ఆమె
నేత్రములలోన...ఎదియొ అపూర్వమధుర
రక్తి స్ఫురియించు"ను గనుక.

అయితే అవి "అర్థమ్ముకాని భావగీతమ్ములు."

అసలు ఇంతకుమూలం ఆ ఊర్వశి ఎవరు? ఆమె కవి ప్రేమించిన ఒక రమణి అధ్యవసానం; నిర్దేశం; సాంకేతికం. ఇంకొకటికూడా: బ్రహ్మసృష్టి కన్న కవిసృష్టి విలక్షణమూ, సుందరమూను. అటువంటిదే అయిన ఈ ఊర్వశి పేరులో తన కవిత అతిలోక రమణీయమూ, అత్యంత విలక్షణమూ అని కూడా కవి ఊహ అయి ఉండవచ్చును. అథవా—

"నావలెనె యాత డున్మత్త భావశాలి
ఆగికోలేడు రేగు నూహాల నొకింత."

అనడంలో ఆ ఊర్వశిని గూర్చి తాను పురూరవుడనైనానని.

ఇంకొక విశం—అప్సరసలు అనేక మూలాల నుండి పుట్టారని కాదంబరిలో ఉంది. ఈ యప్సరస కౌముది కళికనుండి పుట్టినదో! లేదా—హరజటా పారిజాత లతాంత మధువో! కాదా—ఒక్క దివ్య మందారసుమం కావచ్చు. ఏమంటే—అదీ పాలసముద్రంలో నుండే కదా పుట్టినది! "హాలాహలానలమె, అమృతశీతలరసమె తోడబుట్టులు నాకు" అంటుందీమె. 'సంయోగ వియోగాలు, సుఖదుఃఖాలు నన్ను విడవు' అని భావం. ఏది ఎట్లాగైనా ఈ ఊర్వశి వేదాల లోది కాని, కాళిదాసుదికాని కాదని స్పష్టంగా చెప్పవచ్చు. ఇక—రవీంద్రుడి ఊర్వశికీ దీనికీ కూడా ఎట్టి పోలికా లేదు.

కాని, ఇందులో శబ్దార్థ రామణీయకం అధికమే! గుణసౌందర్యం స్ఫురించే తీరును చూడవచ్చును. "మాతవడలేని ముక్కోటి దేవతల కనుతారకలు కోరకములై సుమములయ్యె; దిశలంటు పీకటులు; నిశయే దివసముయ్యె" అనడంలో 'రెప్ప వేయక చూచిమాచి కనులు కాయలుకాచి, పూలు పూసినవి' అనే సామెత సమాధిలో చిత్రింపబడ్డది. సౌందర్య దర్శనంలో దేవతల చూపులుకూడ సపరిశీలనముగా చూచి విస్మయోత్ఫుల్లము లైనవి అనే అర్థం తాదాత్మ్యంలో స్ఫురిస్తున్నది. 'నిశయే దివస

* "ఎదయెద గదించి" అనడమే చాలా ఉచితం.

† "ఎందులకో"—ఇది తప్పు. 'ఎచ్చటికో' అను అర్థ మిచ్చుట పొసగదు. 'ఎందుకో' అని యుండవలెను.

మయ్యో' అనే చరణం 'అహ్నోః ప్రభాత మాసీత్' అన్న కాళిదాసును స్మరింపజేస్తున్నది. భావసంపద కూడా ఆస్వాద్యంగా ఉంది:

"మరియు నేవేవో కలలు ముంగురుల జారి
వాలి కనుబొమ్మ నునుగొమ్మ వంపులందు,
దూరి చూపుల, చెక్కిళ్ల జేరి, మంద
మందహాసంపు మసకలో మాయమగును."

స్వప్నదృశ్యంలో దర్శన క్రమాన అనుభవం అవుతూఉన్న శారీరక సౌందర్యంతోపాటు మంద హాసపు టను రాగభావం ఇక్కడ ఆస్వాద్యం!

"మరుగు హృదయమ్ములో మందుజీవిత
ములో
మాత్రమా సమయాన మసకగా మసకగా
మొయిలు కాటుకనీడ ముసరుకొనెనో
పాపము!"

అనేచోట వాక్యగతమైన అన్వయవసానం సమాధితో గలసి (లక్షణ అసమర్థమైనా), మూర్ఛా భ్రాంతి భావావరణ ద్యోతకమై, "భ్రమిమరతి మలస హృదయతాం మూర్ఛాం తమశ్శరీర సాదం మరణంచ జలద భుజగజం ప్రసహ్య కురుతే విషం వియోగినీనామ్" అనే శ్లోకం సొగసులో పాలు పంచుకొంటున్నది.

అయితే—ఈ కావ్యంలో ఒక విశేషముంది. నాయిక నత్యంత ఉత్కృష్టంగాను, తన నత్యంత నికృష్టంగాను కవి చెబుతాడు.

"...............ఇది సువర్ణ
మంగళాక్షతాశీర్వర్ష మగునొ...
ఇది విభాత మహోత్సవమ్మెమొ, ఇదియు
నూత్న కల్యాణ తూర్య మనోజ్ఞగాన
నృత్య కోలాహలమ్మొకో!"

అంతతో ఆగక, ఇంకా పైకి తీసికొనిపోతాడు. "మఘవ మస్తక మకుట మాణిక్య రాజ్ఞి" యట ఆమె! "త్రిజగతీ పతి కోటీర దివ్యరత్న రాజి నేలు వజ్రాల తురాయి" యట ఆమె! ఇది ఆమె యగ్గింపు. ఇక—తన తగ్గింపు:

"ఏను పాతాళలోకంపు టిరుకు సందు,
లందు దిగ్భ్రాంక వెరచు గాఢాంధకార
రేఖను"

"ప్రేయసీ! సుఖస్వప్న దరిద్రమైన
బ్రదుకునాది - నిద్దురపోవు వల్లకాదు"

ఇట్లా అంతరం నిరూపించడమే కాక, ఆమెకును తనకును సమ్మేళనంకూడా దుర్ఘటమంటాడు:

"తారకా పూర్ణచంద్ర మార్తాండ బింబ
మండితమ్ము మహాకాశ మండపమ్ము
నందె కాదె పాణిగ్రహణమ్ము దొరకు?
పతిత వెట్లాదు? నే నెట్లు పక్షినౌదు?"

ఆమె క్రిందికి వచ్చే దెట్లా? తాను పైకెగిరే దెట్లా? కనుక సమావేశం కుదరదు. ఇక్కడ తనకు పాణిగ్రహణము- -సమ్మేళనము—జరిగిన ట్లైతే, ఆమె పతిత—పాపపంకిల—అవుతుం దనిన్నీ తాను, తన వారినందరినీ విడచి పక్షి—ఒంటరి—నౌతాననిన్నీ అర్థం వ్యంగ్యం కాకపోతే 'పతిత' పదమూ, 'పక్షి' పదమూ కూడా అనౌచిత్యదూషితాలవుతవి.

అత్యంత వియోగమే కనుక "తొలి వియోగిని నేనే" అనడం బాగా ఉంది.

"కలకాల మలయకే నిలువునా తెరచుకొని
ఎదురరయు నీవలపుటింటి ప్రాంగణములో
తొలి ప్రేయసిని నేనె!"

అనడంలో సంయోగ వియోగాలు రెంటనూ గూడా ఈ భావుకుడికి ఊర్వశే నిత్యసహచరినీ, 'ఆనాటి కీనాటి కేను నీదాననే' అనీ వ్యక్తంచేసింది.

ఈ రెండు ఖండకావ్యాల్లోను నవీన భావాలు కొద్దిగా ఉన్నా, శబ్దార్థ చిత్రణమే చాలా అధికం. ప్రాచీన భావాలు సరిక్రొత్త రచనల్లో కన్పడతవి. ప్రాత సారాయి—క్రొత్త సీసాలు.

కుమార సంభవంలోని—

"త్రిభాగశేషాసు నిశాసు సాక్షణం
నిమీల్య నేత్రే సహసావ్యబుధ్యత

క్ష్వేలకంఠ! ప్రజనీత్య లక్ష్యా వా
గసత్య కంఠార్పితి బాహుబంధనా॥"

అను అయిదవ సర్గలోని శ్లోకమునే ఈ కవి—

"కల యేదో విరిసికొని పరతెంచును...
కరము లల్లే చాతునో! - నా ముందు
కనుల నల్లే తెరతునో!
అంతలో నింతలో నడుగు జాడయు లేక
వింత కల కరగి చనును"

అని మలచినాడు. ఇంకొకటి:

"తాం కస్యాంచి ద్భవన వలభౌ సుప్త
పారావతాయాం
రాత్రిం నీత్వా చిరవిలసనా ద్భిన్న
విద్యుత్కళత్రః"

"నిరీక్ష్య విద్యున్నయనైః పయోదో
ముఖం నిశాయాం..."

ఈ రెంటిలోని భావాల ఏకీకరణమే.

"నాటి నిశీధనీల గగ
నమ్ము పయిం గనుమోడ్చు మేఘువుం
గాటుక కౌగిలింతల బె
నంగి సుకమ్ముగ నిద్రవోవు నీ
వేటికో యొత్తిగిల్లితర
ళేక్షణ! నూత్న వియోగశోకపుం
జాటున స్రుక్కు నన్ను గని
నా వనురాగము మోసులెత్తగన్!"

అనే పద్యంగా రూపుదాల్చింది.

"ఎంత తపంబుచేసి జని
యించిన వారొకో మర్త్యభామినుల్
కాంతుఁడవజ్ఞ చేసినను
గాయము వాయుదురే నమర్త్యనై
చింతల వంతలకు జివికి
సిగ్గరితిన్........"

అన్న ఆంధ్రకవితా పితామహుని భావమే:

"వనరు చేద్వగలేను, చచ్చి చావగలేను
కనలేని వెలుగు కొఱకై"

అని రూపసంకోచం చెందింది.

శ్రీ రాయప్రోలు సుబ్బారావు 'వసంతం'లో—

"ఎవ్వరే నను బల్కరించేరు ఇచట
మురళి వాయిస్తునే పోవుచుండగను."

అన్నాడు. ఈ కవి ప్రవాసంలో—

"ఎవరోహో! ఈ నిశీధి
నీడవోలె నిలచి పిలుతు రెవరోహో!"

అని కూర్చారు.

ప్రవాసం, ఊర్వశి—అనే ఈ రెండు ఖండ కావ్యాలూ తెలుగు సాహిత్యంలో క్రొత్త త్రోవ త్రొక్కిన వన్న వాడుకలో నిజం లేకపోలేదు. కొంత గేయంగాను, కొంత పద్యంగాను నడచిన ఈ ఖండ కావ్యాల్లో, శబ్దార్థ చిత్రణంలో నవీనత ఉన్నది. లలితం, పర్యాయోక్తం మొదలైన భంగీ భణితి వైచిత్ర్యం, వృత్త్యనుప్రాసలు కూడా ఉన్నవి.

ఈ కావ్యాల చివరఉన్న నటరాజస్తోత్రం కవికి నిగర్వంతో పాటు దేవదర్శనాభిలాష లేశాన్ని కూడా వ్యక్తం చేస్తున్నది:

"ఆట పాటలతో నేర్పినట్లు దేవ!
ఏను*గూడ నీవలె నటియింపనిమ్ము
ఎడతెగని యాత్ర నెట్లొ సాగించువరకు
ఎట్లొ నీదర్శనమ్ము సాధించువరకు."

* ఈ వాక్యం సరికాదు. "నన్నుగూడ నీవలె నటియింప నిమ్ము" అని ఉండవలెను. కాని, అలా మార్చినచో యతి పోతుంది.

కథానిక

# సమయం మించిపోయింది

శ్రీవాసమూరి

అతనామెను పెళ్ళిచేసుకోవలసింది కాదు. అయినా పెళ్ళిచేసుకున్నాడు. పెళ్ళి చేసుకున్నాడంటే తనంతట తనే ఎంచి, చూసి చేసుకున్నాడని కాదు. అటువంటిది ఈ సమాజంలో అసాధారణమైన విషయం. సంబంధం నిశ్చయించడం, ముహూర్తాలు వేయించడం తల్లిదండ్రులపని. తల్లిదండ్రులు చెప్పినట్లు ఒప్పుకొని, చేసినదానికి సంతోషించడమే సుపుత్రుల పని. అలాగే ఆమెను చేసుకొని సుపుత్రుణ్ణనిపించుకున్నాడు రావు.

ఆమె అందకత్తె అని చెప్పి ఊరుకుంటే అపచారమే కాగలదు—గులాబి ఒక పూవు అని చెప్పి ఊరుకున్నట్టు. ఆమె పేరుచెప్పి, ఆ పేరుకు అర్థం చెపితే చాలు తక్కినది పాఠకులే ఊహించుకోగలుగుతారు. ఆమె పేరు హేమలత. అంటే బంగారు తీగ అని. నిజంగా బంగారమే కాచి పోతపోశారా అన్నట్లుండే శరీరమామెది. అయినా ముట్టుకుంటే కందిపోతుందేమో నన్నంత సుకుమారి కూడా. ఆమె రూపవతీ, విద్యావతీ మాత్రమే కాకుండా ఒక జమీందారు గారాబు బిడ్డ కూడాను.

అతను అంత వికృతాకారి కాడుకాని, అందగాళ్ళ కుండవలసిన తీర్చిదిద్దిన రూపురేఖలేమీ లేవతనికి. నాలుగుసార్లు చూసినా జ్ఞాపకం రానంతటి సామాన్యమైన ముఖ మాతనిది. పైపెచ్చు కొద్దినలుపు కూడాను. అటువంటివాడు, అంతటి రూపవతినీ, జమీందారు బిడ్డనీ వివాహమాడడం ఎలా తటస్థించిందా అన్న ప్రశ్న రావచ్చు. అతని అందచందాలు చూచికాదు జమీందారు తన పిల్లనిచ్చినది ఆనాడు రావుతండ్రి నగరంలోకెల్లా పెద్ద ధనవంతుడు. అందువల్లే ఆయన జమీందారుతో వియ్యమందగలిగాడు. వధూవరులకు పరస్పరం అందచందాలు ఎంచుకోవడానికి గానీ, తమ భావిజీవితం గురించి ఆలోచించుకోవడానికి గానీ అవకాశంలేని చిన్నతనపు రోజులవి. పెళ్ళి అంటే బాజాలు వస్తాయి; చుట్టాలు వస్తారు; పల్లకీ ఎక్కి ఊరేగవచ్చు, కొత్తబట్టలు కట్టుకోవచ్చు; బహుమతులు పొందవచ్చుననే తప్ప మరొకటి తెలియదప్పుడు.

నిర్ణయాలు చేసేది ఒకరూ, ఆ నిర్ణయాల ఫలితాలు అనుభవించేది ఇంకొకరూ. పోనీ ఆ నిర్ణయాలు చేసేవారు తమ నిర్ణయాలు సరియైనవే అనేటట్లు చేయగలిగితే బాగానే ఉంటుంది. కాని అటువంటి బాధ్యత వహించడానికి అవకాశమే లేకుండాపోవడం చాలా దురదృష్టకరం. అటువంటిదే జరిగింది రావు విషయంలో. అతని భార్య ఇక కొన్నాళ్ళకు కాపురానికి వస్తుందనగా ఒకరోజున అతని తండ్రి గదిలో చచ్చిపడిఉన్నాడు. అకస్మాత్తుగా గుండె ఆగి చనిపోయాడేమో ననుకున్నారందరూ. కాని విచారించగా తెలిసింది విషం త్రాగి చనిపోయాడని. నగరంలోకెల్లా పెద్ద ధనవంతుడు విషం త్రాగి చనిపోవడమే! వెలుతురు వేగంతో వ్యాపించిందీవార్త ఊరంతా. రహస్యమంతా—బండారమంటే ఇంకా బాగుంటుందేమో!—బయటపడింది. బ్రహ్మాండం బ్రద్దలైనట్లయింది రావుకి. అతని తండ్రి మొదటినుంచీ ధనవంతుడు కాడు. తొలుదొల్త షావుకారు గుమాస్తాగా ప్రారంభించాడు జీవితం. చాలాకాలం గుమాస్తాగానే ఉన్నాడు. కాని కష్టించి ఎలాగో కొంత కూడబెట్టాడు. వ్యాపార రహస్యాలు తెలుసుకున్నాడు. సొంత వ్యాపారం పెట్టాడు. లక్ష్మి కటాక్షించింది. అంతే చరచరా పైకిపోయి ఆకాశమందుకున్నాడు. ఒక వెలుగు వెలగసాగాడు. అతనికీ ధనవంతులకందరికీ ఉండవలసిన లక్షణాలన్నీ సహజంగా వచ్చివేశాయి. ఎంతఉన్నా, ఉన్నదానితో తృప్తిపడక ఇంకా ఎక్కువ ధనం సంపాదించడానికే నిరంతరం ప్రయత్నించసాగాడు. కొన్ని ఆశల నాధారంచేసుకొని కొన్ని పథకాలు వేశాడు. కాని తీరా వేసింది పప్పులో కాలని తేలింది. ఆశలు నిరాశలై, పథకాలు నిష్ఫలమై, అప్పులు తలకు మించిపోగా, తనతోబాటు ఎందరినో ముంచుతూ, అతిసులభమైనపని—ఆత్మహత్య—చేసు

కున్నాడాయన. ఒక్కసారిగా తమనందరినీ మించి పోయి ఆకాశానికి ఎగిరిన తారాజువ్వ తిరిగి నేల కూలేసరికి ఇన్నాళ్ళూ ఈర్ష్యతో కుమిలిపోయిన హృదయాలన్నీ సంతోషంతో పొంగిపోయాయి. వేల నాలుకలు వేలవిధాలుగా చెప్పుకోసాగాయి. నడమంత్రపు సిరి నట్టేట ముంచక మరేమి చేస్తుం దన్నారు ప్రబుద్ధులు చాలామంది. రావు తండ్రి పోయినచోటికే పోయింది కొన్నాళ్ళకు తల్లికూడా. ఈ ప్రళయంనుంచి బయటపడేసరికి రావుకు మిగిలింది కట్టుబట్టలూ, ఊళ్ళో తండ్రినిగురించి లక్ష నిందలూ. కంగారుగా ఉద్యోగంకోసం ప్రయత్నించసాగాడు రావు. ఉద్యోగమెందుకు, మాయింటికివచ్చి ఉండ మన్నారు మామగారు. కాని రావు అందుకు అంగీక రించలేదు. తనకాళ్లమీదే తను నిలబడాలి అని నిశ్చ యించుకున్నాడు. పట్టుదలతో ఉద్యోగ ప్రయత్నం సాగించాడు. కాని ఉద్యోగంకోసం ఎలా ప్రయ త్నించాలో తెలియక కొంతకాలం బాధపడ్డాడు. ఎలా చేయాలో తెలిసి కొంతకాలం బాధపడ్డాడు. ఆఖరికి ఎలాగో అలాగ, మామగారి పలుకుబడిమీదా, తండ్రిపేరువల్ల ఒక ఉద్యోగం సంపాదించగలిగాడు. నెలకు నూటఏభైరూపాయిల జీతం. ఇప్పటి పరి స్థితుల్నిబట్టి అది కొత్తవాడికి పెద్దజీతమే!

సం అత్తవారింటికి వెళ్లాడు. మొదటి రాత్రే ప్రారంభమయింది సంఘర్షణ. సిగ్గేమో నను కున్నాడు మొదట. కాని రెండోరాత్రీ, మూడో రాత్రీకూడా ఎంత ప్రయత్నించినా, ఎన్నివిధాల ప్రాధేయపడినా ఆమె పెడమొగంగానే ఉండేసరికి రావు కళ్లు తెరిచాడు. అతనిగుండె దిగజారిపోయింది. ఇన్నాళ్ళూ ఆమె తనభార్య అనితప్ప ఆమెకూ కొన్ని భావాలుండవచ్చునని ఊహించలేకపోయాడు. ఆమె భావాలు తనభావాలకు వ్యతిరేకమేమోనని అనుమానించి దిగ్భ్రాంతుడై పోయాడు. ఏమీ తోచ లేదు. యువకుడూ, అనుభవశూన్యుడు. ఆ పరి స్థితిని ఎలా ఎదుర్కోవాలో, ఎలా తీర్చిదిద్దు కోవాలో అతనికి అర్థంకాలేదు.

అటు ఆమెలో సౌందర్యం వికసించడంతో బాటు తన కనుపమసౌందర్యముందనే జ్ఞానంకూడా వికసించింది. ఆమె సౌందర్యం ప్రతిసౌందర్యాన్ని కోరింది. అతనిలో ఆ సౌందర్యఛాయకూడా లేదు. అందువల్ల అతనికోసం ఆమె హృదయం వికసించలేక పోయింది. అదేకాక ఆమె శ్రీమంతులబిడ్డ. కొన్ని స్వేచ్ఛలకూ, ఒకవిధమైన జీవితానికీ అలవాటుపడి ఉంది. అటువంటిది తా నలవడ్డ జీవితానికి పూర్తిగా భిన్నమైన జీవితం గడపబోయే ఒక 'ఎకౌంటంటు' తనకు భర్త అని గ్రహించి ఆమె హృదయం మరీ ముకుళించుకుపోయింది. ఆమె మనశ్శరీరాలు రెండూ కూడా అతనికి ఎదురుతిరిగాయి. అతనిస్పర్శ ఆమెకు జెర్రులు ప్రాకినట్లుంటోంది.

ఆచారం ప్రకారం మూడురోజులైనతరువాత ఆమెను ఇంటికితీసుకువచ్చాడు రావు, ఎలాగో మెల్లగా అనునయించగలనే ఆశతో. భార్యను కష్టపెట్ట కుండా ఉండడానికి దాసీమనిషితోబాటు, తనతాహ తుకుమించినా ఒకవంటమనిషినికూడా పెట్టాడు. ఆ చిన్ననాలుగుగదుల భాగాన్నే ఎన్నోవిధాల అలంక రించాడు. అయినా ఆమెను ప్రసన్నురాలుగా చేసుకో లేకపోయాడు. సకల సౌకర్యాలతో అలరారే పెద్ద భవనాలలో స్వేచ్ఛగా సంచరించడానికి అలవాటైన ఆమె ఆ చిన్నభాగంలో పంజరంలోని పిట్టలా బాధ పడసాగింది. వీలైనప్పుడల్లా నగరంలో స్నేహితులూ, బంధువుల యిండ్లకూ పోయివస్తోంది. ఇంటదగ్గర ఉన్నంతకాలమూ కిటికీదగ్గర ఆకాశంకేసి చూస్తూ కూర్చుంటోంది. భర్త ఎదురుపడితే అసహ్యంతో ముడుచుకుపోయి ప్రక్కకు తప్పుకుంటోంది. ఆమె తప్పుకుతిరగడం చూచి రావు ఎంతో బాధపడుతు న్నాడు. ఎందువల్ల ఆమె తనపట్ల ప్రేమ చూపలేక పోతోంది? తా నందగాడు కాదనే? అవును, తా నందగాడు కాడు. తానె అందగాడై, ఆమెయే కురూపిణియైయుంటే తనూ ఆమె ఇప్పుడు ప్రవర్తిం చినట్లే ప్రవర్తించి ఉండేవాడేమో! ఆమె అంత అందంగా ఉంది కాబట్టే తనకీ ఆరాటం, ఈ బాధ. కాని ఆ అందం అనుభవించేదెలా? తనూ అందంగా ఉంటేనేనా ఆ అర్హత? కాని తన కందం ఎలా వస్తుంది. ఆడవాళ్లుపయోగించే సౌందర్యోపకరణాలు కూడా కొన్ని ఉపయోగించి తంటాలుపడినా లేని అందం తెచ్చుకోలేకపోతున్నాడు. ఎన్నోమార్లు నిలు వుటద్దం ముందు నిలబడి రకరకాలుగా 'పోజు'లు పెట్టి, కళ్లు తిప్పి, కనుబొమలాడించి చూసుకున్నా తా నందగాడనని సంతృప్తి పొందలేకపోతున్నాడు. హఠాత్తుగా ఏ సైంటిస్టో నల్లశరీరాన్ని తెల్లశరీరంగా మార్చే మందు కనుగొంటే ఎంత బాగుంటుంది! ఇండి యాలోకూడా 'ప్లాస్టిక్ సర్జన్లు' బయలుదేరి 'ప్లాస్టిక్ సర్జరీ' చౌక అయిపోతే ఎంత బాగుంటుంది! అవును, బాగుంటుంది. కాని జరగదు, అంతే! అందువల తా నిప్పటిలో అందగాడు కావడమనేది కల్ల. అంతేనా!

తానిలా ఉండిపోవలసిందేనా? లోకంలో ఎంతమంది అనాకారులకు అందమైన భార్యలు లేరూ. వాళ్ళు సుఖంగా జీవితాలు గడుపుతున్నారే. అందగాళ్ళైన భర్తలు కూడా కురూపిణులైన భార్యలతో సుఖంగానే సంసారయాత్ర సాగిస్తున్నారే. తన భార్య కూడా కురూపి అయిఉన్నా, భార్య కాబట్టి ఆమెతో జీవితం గడిపేవాడే.

ఆమె హృదయంలో స్థానం సంపాదించడ మెలా? రహస్యంగా ఎన్నో కామశాస్త్ర గ్రంథాలు తెప్పించుకొని స్త్రీలు ఏమి కోరేదీ, వారిని ఎలా సంతృప్తిపరచవలసిందీ, వారి నెలా వశపరచుకోవలసిందీ మొదలైన విషయాలు శ్రద్ధగా పెక్కుసార్లు చదివాడు. ప్రతిగ్రంథకర్తా ఏవో కొన్ని సలహాలు—ఒక్కొక్కప్పుడు పరస్పర విరుద్ధమైనవి కూడా—ఇస్తూనే ఉన్నాడు. ఆ సలహాలన్నిటి వెనక అశేషమైన అనుభవజ్ఞాన ముందని చెప్పబడుతోంది. అన్ని సలహాలు చదివి అందులో దేనిని అవలంబించాలో తెలియక, మళ్ళీ మొదటికే వచ్చాడు రావు. స్నేహితుల్ని అడగడానికి సిగ్గు. అయినా ఎలాగో సాహసించి, తనకు సంబంధించనట్లుగా ఒకరిద్దరు స్నేహితుల్ని అడిగి తెలుసుకున్నాడు వాళ్లూ రోజూ సాయంత్రం ఇంటికి వెళ్ళేటప్పుడు మల్లెపూలు వగైరాలు పట్టుకువెళ్ళాలనీ, అప్పుడప్పుడు మంచి మంచి చీరలూ, జాకెట్లూ కొని తీసుకువెళ్లాలనీ, సినిమాలకు కూడా బెట్టుకుపోవాలనీ సలహాలిచ్చారు. అలాగే మల్లెపూలూ, గులాబీపూలూ వగైరాలు కొని పట్టుకువెళ్తున్నాడు. కాని ఆమె ఎన్నడూ వాటిని పెట్టుకొన్న పాపాన పోలేదు. తన జీతంబట్టి కష్టమనిపించినా ఎలాగో ఎక్కువ ఖర్చుపెట్టి ఒక మంచి సిల్కుచీరకొని పాకెట్టుగా ఇంటికి తీసుకువచ్చాడు. పాకెట్టు పాకెట్టుగానే ఉండిపోయింది. తనే పాకెట్టువిప్పి చీర దండెంమీద వేశాడు, ఆమె దృష్టిని పడుతుందనే ఉద్దేశ్యంతో. ఆ చీర దండెంమీదే ఉండిపోయింది. ఆమె తనతో సినిమాకు రావడమనేది అసంభవం.

అది, కాదయ్యా, స్త్రీకి ప్రార్థించబడడమంటే, తన పొగడ్తలు వినడమంటే ఎంతో సరదా. కాబట్టి మనము మన హృదయం మామెకే అర్పించివేస్తున్నామని చెప్పి, ఆమె సౌందర్యాన్ని పొగడుతూ ఆమె కటాక్షించకపోతే నిరాశతో కృశించి నశించిపోతామని చెప్పినప్పుడే ఆమె గుండె కరగుతుంది, అని ఒకడు సలహాయిచ్చాడు. రావుకు ఈ సలహా చాలా నచ్చింది. ఎంతటి రాతిగుండెనైనా కరగించే ఎన్నో వాక్యాలు ఊహించి, సమకూర్చుకొని చిన్న ఉపన్యాసంగా మార్చుకొని పదేపదే వల్లెవేసి సమయం కోసం చూస్తున్నాడు. సాయంత్రం ఆమె యథావిధిగా కిటికీదగ్గరే కూర్చుని ఆకాశంవైపుకు చూస్తోంది, మెల్లగా చప్పుడుకాకుండా ఆమె దగ్గరకు చేరాడు. ఆమె అతనిరాక గమనించలేదు. అతను ఆమె పాదాల దగ్గర కూర్చున్నాడు. ఆ పాదాలు ఎంత తెల్లగా, ఎంత చిన్నవిగా, ఎంత సుకుమారంగా ఉన్నాయో! పూజచేయదగిన పాదాలవి! ఆ పాదాల మీదనుంచి పైకి సారించాడు దృష్టి. 'హేమా' అన్నాడు ఒక్కసారిగా ఆనందంలో తన్ను తాను మరచిపోయి ఆమె ఉలిక్కిపడింది. అతన్ని చూసింది. లేచి పోబోయింది. "హేమా, హేమా, నామీద నీకు జాలి కలగదా" అంటూ ఆమె కదలకుండా ఆమె కాళ్లకు చుట్ట వేసుకున్నాడు.

ఆ సమయంలో తానెంతగానో కష్టపడి సిద్ధంచేసుకున్న వాక్యాలేవీ అతని నోటివెంబడి రాలేదు. ఆవేగంతో మాటే పెగలడంలేదు. కన్నీటి ధారలామె పాదాలు తడుపుతున్నాయి. అయినా అటువంటి ధారలకు నానిపోయే పాదాలు కావవి. ఆమె కాళ్ళు వదిలించుకోవడానికి ప్రయత్నించ సాగింది. కాని అతను పట్టువిడవలేదు. ఆమె గింజుకుంటోంది. ఆ గింజుకోవడంలో ఆమె మోకాలు అతని చుబుకానికి గట్టిగా తగిలింది. ఆ దెబ్బతో అతని వాక్ప్రవాహం బయటకు పొర్లింది. ఎంతటి రాతి గుండెనైనా కరగించివేసే వాక్యాలు ఉద్రిక్తతతో భావోద్రేకంతో చెప్పుతున్నాడు. అయినా ఆమెలో కలిగిన భావాలల్లా విసుగు, ఏవగింపు మాత్రమే. ఎంత ప్రార్థించినా, దేవి గుండె కరగపోయేటప్పటికి లాభం లేక వదులుకున్నాడు రావు.

కాని అతనిలో బయలుదేరిన దాహం తీరే దారి లేక అతనినే దహించివేస్తోంది. కావలసిన వస్తువు దగ్గరలో ఉండికూడా ఆ వస్తువు అతనికి కాకుండా పోతోందంటే భరించలేక పోతున్నాడతను. ఆకలితో మలమల మాడుతున్న మనిషిని రెక్కలువిరిచి చెట్టుకు కట్టివేసి నోటికి అంగుళం ఎడంలో ద్రాక్షపళ్ళు గుత్తి వేళ్ళాడదీస్తే ఎలా ఉంటుందో అలా ఉంది అతనిపని. ఆమె దగ్గరలేకపోతే అంత బాధపడక పోవునేమో, దగ్గర ఉండికూడా దూరమై పోతూండడంవల్ల అతనికి పిచ్చెత్తినట్లుగా ఉంటోంది.

తనలాగే కురూపులుగానుండి అందమైన భార్యలు కలవాళ్లు ఊళ్ళో ఎందరున్నారో జ్ఞాపకం

తెచ్చుకోసాగాడు. చాలామందే ఉన్నారు. కాని వారిలో ఒకాయనతో రావుకు బాగా పరిచయముంది. ఆయన అచ్చు కొండముచ్చులా ఉంటాడు. ఆయన కొకభార్య ఉంది కాకి ముక్కున దొండపండులా. అయినా ఆ భార్యవల్ల సమస్త సుఖాలూ పొందుతున్నాడాయన. ఆయన దగ్గరకు చేరాడు రావు. ఆతృత కొద్దీ తెగించి, హృదయంలోని బాధనంతా సంకోచం లేకుండా ఆయనకు వెల్లడించాడు రావు. ఆయన అత్యంత శ్రద్ధతో విన్నాడు. తరువాత సంతృప్త జీవితం సూచించే చిరునవ్వు నవ్వుతూ ఆయన ఉపదేశం చేశాడు: నాయనా, స్త్రీలూ పురుషులూ సమానమనుకొని ఎన్నడూ భ్రమలో పడకు. స్త్రీ స్త్రీయే పురుషుడు పురుషుడే. పురుషత్వం చూపించితేనే పురుషు డనిపించుకు నేది స్త్రీ కోరేది పురుషునిలో పురుషత్వమే. పురుషత్వమంటే బలమే. పురుషుడైనవాడు తన బలం ప్రయోగించాలి. ఆ బలానికిలొంగడంలోనే స్త్రీకి ఆనందం.

ఈ సలహాలో చాలా నిజముం దనిపించింది రావుకి. పశుబలంద్వారా లొంగదీయటానికి ప్రయత్నించాడు. అప్పుడప్పుడు ఆమెను కొట్టడానికి కూడా వెనుదీయడం లేదు. కాని అటు ఆమెలో ఇప్పుడతనంటే నరనరాల్లో ద్వేషభావం రగులుకుంటోంది. ఇదివరకు అతని కురూపానికి అసహ్యించుకు నేది. ఇప్పుడు అతను తన నలా లొంగదీయడాని ప్రయత్నించటం చూసి అతనంటే పరమద్వేషభావం కలిగింది. ఏదో పురుగునుచూసినట్లు చూస్తోంది అయినా తాను చేస్తున్నది తప్పా, ఒప్పా అని ఆలోచించుకోలేకపోతున్నాడు రావు.

ఒకరోజు ఇంటికి తిరిగి వచ్చేసరికి ఆమె కనబడలేదు. వంటమనిషి నడిగాడు ఎక్కడికి వెళ్ళిందని. తండ్రిగారు వచ్చి తమ ఊరు తీసుకువెళ్ళిపోయారని చెప్పింది. నిర్ఘాంతపోయాడు. వెంటనే అత్తవారింటికి వెళ్ళాడు. భార్య కనుపించలేదు. మామగారే కనిపించారు. మామగారిని చూసేసరికి అక్కడికి తాను ఏ ఉద్దేశ్యంతో వచ్చానా అన్న సందేహం కలిగింది. మామగా రతనిని అడిగారు: "ఏమిటి నాయనా ఇదేనా నీవు ప్రవర్తించే విధానం! ఇదేనా నీ సభ్యత! ఇలా మారిపోయావా? నీవింకా కుర్రవాడివ నేదిగమనించి నిన్నేమీ అనలేను. కాని తొందరపడకూడదు రావు. ఎదటివాళ్ళ మన స్తత్వాలు కూడా అర్థం చేసుకొని నడవాలి." ఆ మాటలు వింటూంటే అక్కడి కక్కడమాయమైపోతే బాగుండుననిపించింది రావుకి. మామగారు మంచిసలహా ఇచ్చారు అనే భావంపోయి, ఆ సలహా ఇచ్చినందుకు ఆయనమీద ద్వేషం కలిగింది రావుకి. వెంటనే తిరిగి వచ్చేశాడు.

మళ్ళీ మథనలో పడింది వ్యవహారం. ఆమె తిరిగి తనదగ్గరకు వస్తుందా? తనను పూర్తిగా విడిచి పెట్టివేస్తుందేమో? అయోమయస్థితిలో పడి తన్నుకుంటున్నాడు.

అతను తిరిగివచ్చిన కొద్దిరోజులకే మామగారి దగ్గరనుంచి ఉత్తరంవచ్చింది తాను తండ్రి కాబోతానని వార్త! ఆనందం పట్టలేక గంతులు వేశాడు గది అంతా. అది, ఇక హేమ తనదే! పూర్తిగా తనదే! ఆమె కాదన్నా తనతో విడని సంబంధ మేర్పడిపోయింది. ఇక ఆమె విషయంలో ఆదుర్దా చెందనక్కరలేదు. ఇది ఆలోచించుకోగానే హేమమీద మమకారం, ప్రేమ పొంగుకొచ్చింది. ఇక ఎప్పుడూ పశుబలంతో ఆమెముందు ప్రవర్తించకూడదు. ఆమె సున్నితహృదయాన్ని గాయపరచకూడదు. ఎలాగైనా ఆమె తనదే. తనపట్ల అనురాగ మేర్పడక తప్పదు. కాబట్టి మెల్లగానే ఆమె హృదయం మారేటట్లు చేసుకోవాలి. ఆమె హృదయం తనదిగా చేసుకోవాలి! తమ హృదయాలను ఏకం చేయబోయే ఆశిశువు కొడుకో, కూతురో? తెల్లగా ఉంటుందో తనలాగే నల్లగా ఉంటుందో అన్న దానిమీదకు ఆలోచనలు పోసాగాయి. ఆ పుట్టబోయే బిడ్డకోసం అత్యుత్సాహంతో ఎదురుచూస్తున్నాడు. కాని ఆ ఉత్సాహం కొద్దిరోజులలోనే విరిగిపోవలసి వచ్చింది. ఆమెకు గర్భంపోయింది! అతని ఆశాసౌధాలన్నీ కూలి అతని మీదే పడ్డాయి. తనలో కొంతకాలం ఆశాకిరణాలు ప్రసరింపజేసిన ఆ పుట్టకముందే చచ్చినబిడ్డకోసం దీనంగా విలపించాడు.

ఆరోగ్యం బాగుపడగానే హేమను తీసుకొని జమీందారుగారు అతనిదగ్గరకు వచ్చారు. ఆ ఉన్న ఇల్లు చాలదనిచెప్పి ఊళ్ళో ఇంకొకచోట ప్రత్యేకంగాఉన్న ఒక భవనం ఏర్పాటుచేశాడు కూతురికీ అల్లుడికీ. ఒక కారుకూడా ఇచ్చారాయన. కూతురూ అల్లుడిమధ్య ఉండవలసినవిధంగా లేదని ఆయన గ్రహించాడు. ఆ పరిస్థితికి తనదికూడా కొంతబాధ్యత ఉంది. కాని రావుపరిస్థితి ఇలా అయిపోతుందని ఎన్నడూ ఊహించలేకపోయాడు. తన కూతురు అతనంటే అంత అసహ్యించుకుంటుందనికూడా అనుకో

లేదు. కాని ఇప్పుడు ఆయన చేయగలిగింది ఏముంది? ఉపన్యాసం ఇచ్చి బోధచేసి ఆమె హృదయంలో అతని మీద ప్రేమ కలిగేటట్లు చేయడం అసంభవం. అది హృదయంలోనుంచే రావాలి. ఆయన చేయగలిగిందల్లా పరిస్థితి మరింత దిగజారడానికి తోడ్పడే చర్యలు తీసుకోకపోవడమే. అందువల్లే ఆయన వాళ్ళ వ్యవహారంలో జోక్యం కలిగించుకోవడం లేదు.

మళ్ళీ అనునయధోరణే అవలంబించాడు రావు. ఏదో విధంగా ఆమెను పలకరించాలని ప్రయత్నం చేస్తున్నాడు. ఆమె ఏ పనైనా చేయబోతూంటే అడ్డుపడి తనే చేసిపెడుతున్నాడు. అయినా కృతజ్ఞతాభావం పొడసూపడం లేదామెలో. విదిలించుకొని వెళ్ళిపోతోంది ఆమె అతనిదగ్గరనుంచి. తానిదివరకు ఆమెనలా హింసించినందుకు ఆమె సున్నిత హృదయం గాయపడిందేమో ననుకున్నాడు. ఆ గాయం మానాలి. ఒకసారి క్షమార్పణ కోరుకోవాలి. తాను క్షమార్పణ కోరితే ఆమె కొంత మెత్తబడవచ్చు. కాని అతను క్షమార్పణ కోరుకోడానికి అవకాశమే కలగడం లేదు. ఆమె ఇదివరకులా లేదు. ఎంతో మార్పు వచ్చింది ఆమెలో. ఇంటిదగ్గరే ఉండడం లేదు. స్వేచ్ఛగా కారులో ఎక్కడకు పడితే అక్కడకు తిరిగివస్తోంది. పార్టీలకు పోతోంది. స్నేహితులతో కలసి సినిమాలకు పోయి ఆలస్యంగా వస్తోంది. సమాజంలో ప్రముఖ పాత్ర వహించసాగింది. ఆమె రూపం, తెలివితేటలూ చూసి ఎందరో యువకులూ, యువతులూ ఆమె చుట్టూ మూగసాగారు. ఆమె ఒకటి రెండు సంఘాలకు అధ్యక్షురాలయిందికూడా.

తన ఇంటికి రాకపోక లెక్కువయ్యాయి. ఇల్లు ఒక క్లబ్బుగా మారింది. ఎందరో ఆడవాళ్లూ, మగవాళ్ళూ వస్తున్నారు. కాఫీలు త్రాగుతున్నారు. కబుర్లూ కాలక్షేపాలూ జరిగిపోతున్నాయి. ఆ వచ్చే మగవాళ్లలో ముఖ్యంగా ఒక డాక్టరూ, ఇద్దరు లెక్చరర్లూ, ఒక పొడుగు వెండ్రుకల కళాకారుడూ, నలుగురు ప్లీడర్లూ తరుచూ వస్తున్నారు. వాళ్ళంతా ఎంత చక్కగా కబుర్లు చెప్పుకుంటున్నారు! ఎందుకో అంతగా నవ్వుకుంటున్నారు. వాళ్ల సంభాషణలకంతే లేనట్లుంది. అన్ని విషయాలు వాళ్లకెక్కడనుంచి వస్తాయో! వారిమధ్య తీవ్రమైన చర్చలు కూడా జరుగుతూ ఉంటాయి. తన భార్య కూడా వాళ్ళతో ఎంతో ఉల్లాసంగా మాట్లాడుతుందే! తన ఇంటిలో తానొక్కడే పరాయివాడయినట్లుగా ఉంది. వాళ్ళ నవ్వులు వింటూంటే అతని గుండెలు బ్రద్దలవుతున్నట్లనిపిస్తోంది. తానుమాత్రం వాళ్ళతో చేరి వాళ్లలా ఎందుకు కబుర్లు చెప్పకూడదు? వాళ్లలో ఎందుకు కలసి మెలసి ఉండకూడదు? తను కూడా వాళ్ళతో స్నేహం చేసి, సమాజంలో పాల్గొంటూ ఉండడంవల్ల తన భార్య స్నేహం సంపాదించవచ్చునను కున్నాడు. ఒకరోజున హాలులో అందరూ కూర్చొనిఉండగా రావు వెళ్ళి డాక్టరు ప్రక్కన కూర్చున్నాడు. నవ్వు లిగిరిపోయాయి. అంతా నిశ్శబ్దం అయిపోయింది. అందరి దృష్టి అతనిమీదే పడింది ఎవరో వింతపశువన్నట్లు తెల్లబోయి చూస్తున్నారంతా. తన భార్య గుంపులో అక్కడ తానుండడం అతిదుర్భరంగా ఉందనే భావం గ్రహించేసరికి అతని గుండె పట్టుతప్పిపోసాగింది. అయినా వాళ్ళను పలకరించి మాట్లాడేటట్లు చేస్తే పరిస్థితి చక్కబడవచ్చుననే ఉద్దేశ్యంతో ఒకరిద్దరి క్షేమాదు లడిగాడు. వాళ్లు సగం సగం సమాధానాలు, వినిపించీ వినిపించకుండా చెప్పి ఊరుకున్నారు. అతను రెండు చెణుకులు విసిరాడు. ఎవరూ నవ్వలేదు. జేబు రుమాళ్ళతో మొగాలు తుడుచుకొంటున్నారందరూ. ఆ వాతావరణం చూస్తే తానేదో అసభ్యంగా మాట్లాడినట్లూ, అది విని వాళ్ళ సభ్యహృదయాలు బాధపడ్డట్లూ ఉంది. ఆ స్తబ్ధ వాతావరణంలో మరి ఉండలేక బయటికి వచ్చివేశాడు.

మళ్ళీ అదే తృష్ణ. ఆమెను ఎలా స్వాధీనం చేసుకోవాలనే ఆవేదన. వస్తువు దూరమై పోతున్నకొలదీ ఆ దుర్లభవస్తువుకోసమే హృదయం మరింత ఆరాటపడుతోంది. అందకపోవడంలోనే ఉందేమో ఆకర్షణ. ఆమె తనమీద ఆధారపడేపరిస్థితి ఎలా వస్తుంది?—ఆమెకు జ్వరం రావాలి. జ్వరంతో కొంతకాలం ఆమె బలహీనమైపోయి కదలలేకుండా పోవాలి. తానామెదగ్గరే ఉంటూ, ఆమెను కంటికి రెప్పలాగా కాపాడుతూ, ఆమెకు పరిచర్య చేయాలి. దానితో ఆమెగుండె కడ్డంగానిలచిన ఇనుపతెరలన్నీ తొలగిపోతాయి. ఆమెగుండె మెల్లమెల్లగా కరగిపోతుంది. తనదైపోతుంది. ఆమెకు జ్వరం రావాలి, జ్వరం రావాలి అంటూ ధ్యానిస్తున్నాడు. ఆఖరికి వచ్చింది—తనకే—మశూచికం. అంతా అయిపోయిందనుకున్నాడు. కాని ప్రాణానికేమీ మోసం ఉండబోదని డాక్టరు తెలిపాడు. మళ్ళీ కొంచెం ధైర్యం కలిగింది అతనికి. తన దీనపరిస్థితి చూచేనా జాలితో ఆమెగుండె కదులుతుందేమోనని ఆశించాడు. కాని అతనికి నిరాశే అయింది. వార్త తెలియగానే హేమ

తండ్రి వచ్చి, అతనిని ఆసుపత్రిలో చేర్పించి, కూతురిని తనవెంట ఇంటికి తీసుకుపోయాడు.

పూర్తిగా నయమైన తర్వాత ఆసుపత్రినుంచి బయటపడ్డాడు ఒళ్లంతా చిన్నిచిన్ని గోతులతో. తనరూపం చూసుకొని తనే అసహ్యించుకొనే పరిస్థితి ఏర్పడింది. ఇప్పుడు అతనిలో తరగని ద్వేషమే విజృంభిస్తోంది. తనను పుట్టించి, తనకింత అన్యాయం చేసిన దేవునిపట్ల, సమాజంపట్ల, హేమపట్ల, ఆమె తల్లిదండ్రులపట్ల, చనిపోయిన తన తల్లిదండ్రులపట్ల, అందరిపట్ల మానవజాతిపట్లే అతనికి ద్వేషం పొంగిపోతోంది. అందరికీ తగిన ప్రతీకారం చేయాలనే తీవ్రకాంక్ష బయలుదేరింది అతని హృదయంలో.

కూతురిని పంపారు జమీందారుగారు. మళ్లా యథాప్రకారంగా జీవితం సాగుతోంది. కాని ఇప్పుడాతను ఆమె కటాక్షం సంపాదించడానికి ప్రయత్నం చేయడంలేదు. తనూ తప్పుకునే తిరుగుతున్నాడు. ఎవరిదారిన వారే నడుస్తున్నారు. రావు గుండెలో ప్రతీకారవాంఛే ప్రబలంగా విజృంభిస్తోంది. ఆమెను ఏడ్పేటట్లు, బాధపడేటట్లు చేయాలని కోరికగా ఉంది. తన సంసారం గురించే లోకంలో చెప్పుకుంటున్నట్లు తెలిసిందతనికి. తన వెన్ను వెనకాలే ఏవో చెప్పుకుంటున్నారు. అతను ఎదురు తిరిగితే ఏమీ ఎరగనట్లు నటిస్తున్నారు. ఏవో గుసగుసలు విన్నాడు. అతన్ని అనుమానం బాధించసాగింది. ఎవరు? వాళ్ళలో ఎవరై ఉంటాడు? ఇంగ్లీషు లెక్చరరా—పద్యాలు బాగా రాస్తాడు. భావగీతాలాలాపిస్తాడు. హిస్టరీ లెక్చరరా?—ధారాళంగా ఉపన్యాసాలిస్తాడు అతను. పొడుగు వెంట్రుకల కళాకారుడా?—అతను చిత్రించిన సీతా, దమయంతీ, నూర్జహాను మొదలైనవాళ్లంతా తన భార్య అవతారాలేనని తట్టింది రావుకు. అతను వేసిన ఒక నగ్న రూపం—మొగం తెలియడంలేదు కాని—తన భార్య రూపానికి పోలిక ఉందేమోనని బాధపడుతున్నాడు రావు. లేక డాక్టరా?—అందరిలోకీ అందగాడు కాని అంతగా మాట్లాడలేడు. చలనంలేని బొమ్మలా ఉంటాడు. లేక ప్లీడర్లలో ఎవరేనానా? వాడెవడో కనుక్కొని వాడిని నాశనం చేయాలనుకున్నాడు. కాని తెలిసేదెలా? దానితో అందరినీ సమానంగా బురదలో కీడ్చి వేయాలి—సమయంకోసం చూస్తున్నాడు.

ఆ వేళ మధ్యాహ్నం రావు ఆఫీసునుంచి త్వరగా ఇంటికి వచ్చాడు. ఇంట్లో హాలులో ఇంగ్లీషు లెక్చరరూ, తన భార్యా దగ్గర దగ్గరగా కుర్చీలలో కూర్చొని ఏదో చెప్పుకుంటూ నవ్వుకుంటున్నారు. రావు చరచరా లోపలికి వచ్చివేశాడు. అతనిని చూసి ఇద్దరూ ఉలిక్కిపడి, తెల్లబోతూ నిలుచున్నారు. రావు ఒక క్షణం అలాగే నిలబడిపోయాడు. మళ్ళీ తీక్షణంగా చూస్తూ ఇంగ్లీషు లెక్చరర్ వైపు నడిచాడు. ఇంగ్లీషు లెక్చరర్ భయంతో గజగజ వణికిపోతున్నాడు. "బయటికి పో" అని రంకవేశాడు రావు. లెక్చరర్‌కు బోధపడలేనట్లుంది. అలానే గుడ్లప్పగించి చూస్తూ ఉండిపోయాడు. "బయటికి పో" అని మళ్ళీ రంకవేశాడు రావు ఇంకా బిగ్గరగా. లెక్చరర్ సగం తెలుస్తున్నట్లుగా "ఆఁ!" అన్నాడు. "బయటికి నడుస్తావా, లేక మెడపట్టి గెంటివేయనా" అంటూ అడుగులు ముందుకు వేశాడు రావు. లెక్చరర్ రెండడుగులు వెనక్కి వేశాడు. ఇంతలో అప్పుడే వీధిలోనుంచి డాక్టరూ, ప్లీడర్లూ మిగిలినవాళ్లంతా లోపలికి వచ్చారు. హేమకు గొంతుక వచ్చింది. "ఏమిటీ పిచ్చికేకలు. ఆయన పోనక్కర్లేదు" అంది గట్టిగా. రావు ఆగిపోయాడు కాని క్షణంలోనే మళ్లీ కోపం ఉబికివచ్చింది. "పొమ్మంటున్నాను పోవలసిందే" అని అరిచాడు. "పోవడానికి వీలు లేదు" అంది దృఢంగా హేమ. రావు లెక్చరర్ దగ్గరకు వచ్చాడు. హేమ అడ్డు నిలుచుంది. "నేనే రమ్మన్నాను నా అతిథులకు మర్యాద జరిగితే నాకు జరిగినట్లే! నే నది సహించను. లెక్చరర్ గారూ కూర్చోండి" అంది హేమ. ప్లీడర్లలో పెద్దవాడు ముందుకువచ్చాడు. "ఏమిటి రావు ఈగోల. ఎందుకు పొమ్మంటున్నావు? ఏం చేశాడని?"

రావు వాళ్ళకేసి చూశాడు. ఆగిపోయాడు. అవును ఎందుకు పొమ్మంటున్నాడు? ఏం చేశాడని? తన కేదో అనుమానం తట్టిందనేగా. కాని ఆ అనుమానం ప్రకటించగలడా? వాళ్ళడిగినదానికి జవాబు చెప్పగలడా. ఇంగ్లీషు లెక్చరర్‌కు ధైర్యం వచ్చింది. "నేనయినా ఈ ఇంటికివచ్చి ఈయనచేతి తిట్లు పడడానికి నాకేమవసరం? రేపు మన సొసైటీలో జరపబోయే కార్యక్రమం గురించి చర్చిద్దాం రమ్మని హేమలతగారు పిలిస్తే వచ్చాను. అదే చర్చిస్తున్నాం. (అంతా అబద్ధమనుకున్నాడు రావు అందరికీ మాత్రం నిజమేననిపించింది. ఎదుట టీపాయ్‌మీద కార్యక్రమానికి సంబంధించే కాగితాలే ఉన్నాయి.) నేనూ మర్యాదస్థుడినే. నన్ను ఇలా 'ఇన్‌సల్టు' చేసినందుకు తగిన విధంగా చర్య తీసుకుంటాను" అన్నాడు లెక్చరర్

అందరూ జవాబీయ వేమి అన్నట్లు రావుకేసి చూస్తున్నారు. ఏమి జవాబీయగలడు? అందరి కళ్ళలోనూ తాను మూర్ఖులా ప్రవర్తించినట్లు తోచింది. అందరి ముందూ తన భార్య తన నెదిరించింది. తన కవమానం చేసింది. అక్కడ ఉండలేకపోయాడు. వాళ్లను తోసుకుంటూ చరచరా బయటికి వెళ్ళిపోయాడు. వెనకాల నవ్వులు వినిపించాయి. తిరిగి వచ్చి, అందర్నీ లోపల పెట్టి తాళంవేసి ఇంటికి నిప్పంటించాలనిపించింది రావుకి. కాని అటువంటి దేమీ చేయకముందుకు నడిచిపోయాడు.

అలా ఆ కోపంలో ఎక్కడకు పోతున్నాడో అనేదికూడా గమనించక ఊరిచుట్టూ మూడుసార్లు తిరిగాడు. అయినా కోపం తగ్గలేదు. ఎవడో కుర్రవాడు బంతిపూల గంప తీసుకొనివచ్చి "బాబూ ఒక సత్తి తీసుకోండి బాబూ, బేడ కైదు" అన్నాడు. రావు ఆగిపోయి ఆ పూలకేసి ఆ పూల కుర్రవాడి మొగంకేసి చూసి పావలా ఇచ్చి రెండు సత్తులు తీసుకొని పార్కులోకి పోయాడు. ఒక మారుమూల చోట కూర్చొని పువ్వులుతీసి చూశాడు. భార్య సౌందర్యం జ్ఞాపకం వచ్చింది. ఒక్కొక్క పువ్వే తీసి రేకలు రేకలుగా చీల్చి, ముక్కలుగా తుంపి వేళ్ళతో నలిపి, కాలిక్రింద పడవేసి అరికాలితో నేల రాచాడు. పూవులన్నీ నేలలో కలిసిపోయాయి. అతని మనోక తృప్తికలిగింది. కోపం కొంత శమించింది. ఇంటికి బయలుదేరాడు.

ఇంకా ఆలోచనలు పీడిస్తూనే ఉన్నాయి. ఒకటి రెండుసార్లు కార్లక్రింద పడిపోబోయాడు. దానితో జాగ్రత్తగా చూసుకుంటూ నడవసాగాడు. రోడ్డుమీద అతి వేగంగా వస్తోంది ఒక కారు. ఒక చిన్న కుర్రవాడు ఆ కారుత్రోవ కడ్డంగా వస్తున్నాడు. తటాలున రెక్కపట్టి లాగివేశాడు రావు ఆ కుర్రవాడిని. కారు రాసుకుంటూ ఆగి మళ్ళీ వెళ్ళిపోయింది. కుర్రవాడు కొద్ది గీరులతో బ్రతికిపోయాడు. రావు ఆ కుర్రవాడిని చూశాడు. ఆరేళ్ళుంటాయి, నల్లగా ఉన్నాడు. ఒక కాలు కుంటి. కుర్రవాడు భయంతో ఏడుస్తున్నాడు. కేకలు విని కుర్రవాడి తల్లిదండ్రులు పరుగెత్తుకు వచ్చారు. కుర్రవాడి ప్రాణం పోయేదే, కొద్దిలో దక్కాడు అని ఆనందంతో వాడిని గుండెల కద్దుకునే బదులు వాడిని చచ్చేటట్లు కొట్టసాగారు. "కుంటివెధవకి తోడు. ఊరంతా పెత్తనాలే. చావు వెధవని పట్టుకోలేక చస్తున్నాం. కారుక్రిందపడి చచ్చినా బాగుండేది. వదిలిపోయేది పీడ" అంటూ వెన్నుమీద చరుస్తున్నారు. ఆ కుర్రవాడు రావుకేసి దీనంగా చూస్తూ గోలపెడ్తున్నాడు. ఆ కుర్రవాడి బాధ రావు గుండెలోకి చొచ్చుకుపోయింది. వాడూ తనలాగే అనాకారి. నల్లగా ఉన్నాడు కుంటివాడు తన నెవరూ ప్రేమించనట్లుగానే వాడినీ ఈ లోకంలో ఎవరూ ప్రేమించరు — తల్లిదండ్రులు కూడా. వాడూ పెరిగి పెద్దవాడైతే తనలాగే బాధపడ్తాడు. తనూ వాడూ ఒకే పరిస్థితిలో ఉన్నారు అందువల్ల వాడిని కొట్టూంటే తనను కొడ్తున్నట్లే అనిపించింది రావుకి. "కొట్టకండి, కొట్టకండి" అంటూ ఒకరూపాయి తీసి ఆ కుర్రవాడి చేతిలో పెట్టి మిఠాయి కొని పెట్టమన్నాడు. వాళ్ళు ఆశ్చర్యంతో మాట్లాడలేకపోయారు. తనవెంట తీసుకు రమ్మన్నాడు గీరుకుపోయినచోట డాక్టరుచేత మందు వేయిస్తానని. వాళ్ళు ఆ కుర్రవాడిని ఎత్తుకొని అతని వెనకాలే డాక్టరు ఇంటికి నడిచారు. డాక్టరు చేత మందువేయించి వాళ్ళనింటికి పంపి ఒక కొత్త అనుభవంతో ఇంటికి మరలాడు రావు.

ఇప్పుడతని హృదయంలో కొత్తపొంగు వస్తోంది. చాలాసార్లు ఆ కుర్రవాడే జ్ఞాపకం వస్తున్నాడు. ఆ కుంటి కుర్రవాడూ, తనూ ఈ ఇద్దరే లోకంలో ఒక జాతికి చెందినవారనిపించింది రావుకి. ఇంకా ఎందరో తమలాంటివాళ్లు ఉంటే ఉండవచ్చు. కాని వాళ్ళ నెరగడు రావు. అతనికి ఆ కుంటికుర్రవాడొక్కడే సన్నిహితుడు. వాడంటే అదో ప్రేమ కలుగసాగింది. రోజూ అతను ఆఫీసుకు వెళ్లే వేళకు ఆ కుర్రవాడి బడి విడిచిపెడ్తారు. ఆ దారినే వస్తాడు వాడు. ఆ కుంటివాడిని చూసి మిగతా పిల్లలందరూ ఏడిపిస్తున్నారు. ఏడుస్తూ వస్తూ రావును చూడగానే అంత ఏడుపులోనూ చిరునవ్వు తెచ్చుకొని రావుదగ్గరకు పరుగెత్తుకు వచ్చి పలకరించి వెళ్తున్నాడు. సాయంత్రం రావు ఆఫీసు విడిచే వేళ, ఆ కుర్రవాడి బడి విడిచే వేళ ఒక్కటే కావడంవల్ల ఆ కుర్రవాడు రావుతోకూడా కొంతదూరం నడుస్తున్నాడు రావును చూసి మిగతా పిల్లలు ఆ కుంటివాడి జోలికి పోలేకపోతున్నారు. కుర్రవాడు ఏవేవో కబుర్లు చెప్తూ వస్తున్నాడు. అవి అత్యంత శ్రద్ధతో వింటున్నాడు రావు. ఆ అమాయకపు మాటలు వింటూంటే ఏదో అవ్యక్తానందంతో నిండిపోతోంది రావు హృదయం. జనానికి ఆ కుర్రవాడు కుంటివాడని మాత్రమే తెలుసు అందుకే వాళ్లు వాడిని ప్రేమించలేరు. అందుకే పిల్లలందరూ ఏడిపిస్తారు. కాని ఆ కుర్రవాడికి హృదయముందని తన కొక్కడికే తెలుసు. తనకు

హృదయముందని ఆ కుఱ్ఱవాడొక్కడికే తెలుసు. అందువల్లే ఇద్దరి మధ్యా ఈ స్నేహం. ఆ కుఱ్ఱవాడిని చూస్తూంటే వాడు తన కొడుకైయుంటే బాగుండు ననిపించింది రావుకి. ఆ అభిప్రాయం కలిగినప్పటి నుంచీ అతని గుండె తిరిగి ప్రేమతో నిండిపోసాగింది. ఇన్నాళ్లూ బయటికి పోవడానికి అవకాశంలేక నిలచిపోయిన ప్రేమంతా ఒక్కమారుగా ఆ కుఱ్ఱవాడి మీదకు మళ్ళింది. పూర్తిగా మళ్ళింది. ఆ కుఱ్ఱవాడిని తల్లికన్న ఎక్కువ ప్రేమతో చూడసాగాడు రావు. ఒక సాయంత్రం వాడిని వెంటబెట్టుకొని బజారుకు [illegible] వాడికి చొక్కాలకూ లాగులకూ గుడ్డలు చింపించి దర్జీకిచ్చి, బిస్కట్లు [illegible], బొమ్మలూ, పుస్తకాలూ కొని పార్కుకు బయలుదేరాడు. కుఱ్ఱవాడిని ఒకచోట కూర్చోమని తాను ప్రక్కనే కూర్చున్నాడు. ఆ కుఱ్ఱవాడు బొమ్మలతో ఆడుతూంటే తన్ను తాను మరచిపోయి, వాడితో సమానంగా ఆనందం పంచుకుంటున్నాడు. ఒకనాడు పెద్ద ఘనవంతుడుగా పేరుబడ్డ పెద్దమనిషి కొడుకు ఇలా పూరి గుడిసెల్లోని పిల్లవాడితో తిరుగుతున్నాడంటే లోకం విడ్డూరంగా చెప్పుకోసాగింది. చెప్పుకోనీ యనుకున్నాడు రావు. చెప్పుకుంటేనే బాగుంటుం దనుకున్నాడు. లోకం కూడదన్న పనే చేయాలనీ, లోకాన్ని ధిక్కరించాలనీ అతని మనస్సు తహతహలాడుతున్నది.

ఆ ఊరు సర్కసు వచ్చింది. జనం విరగబడి చూస్తున్నారు. రావుకుమాత్రం చూడాలనిపించలేదు. కాని కుఱ్ఱవాడు సర్కసులో ఏనుగులు పెద్ద పెద్దవిగా ఉంటాయిగదూ, పెద్దపుల్లు గాండ్రు గాండ్రుమంటాయి కాదూ అని పదేపదే అంటూంటే ఆవేళ సాయంత్రం కుఱ్ఱవాడిని తీసుకొని సర్కసుకు బయలుదేరాడు. ఫస్టు క్లాసుకు టికెట్లు తీసుకొనిపోయి కుఱ్ఱవాడి నొక కుర్చీలో కూర్చోబెట్టి పక్క కుర్చీలో తను కూర్చున్నాడు. వాళ్లను చూసి ప్రక్కవాళ్ళు కంగారుగా లేచి దూరంగా తప్పుకున్నారు. ఒకరిద్దరు అప్పుడే వచ్చినవాళ్ళు కుర్చీలు ఖాళీగా ఉన్నాయికదా అని అటు వచ్చి, వాళ్లను చూసి బెదరిపోయి వెనక్కి పరుగెత్తుతున్నారు. వాళ్ళ కంగారు చూసి రావు నవ్వుకున్నాడు. సర్కసు ప్రారంభమైంది. ఫీట్స్ చూస్తూ కుఱ్ఱవాడు ఆనందం పట్టలేక చప్పట్లు చరిచి కేరింతాలు కొట్టుతున్నాడు. వాడి కేరింతాలు చూచి రావు కూడా కుఱ్ఱవాడైపోతున్నాడు.

రావు హృదయంలో ఇప్పుడు హేమ అంటే ప్రేమ ఇగిరిపోయింది. కామం కూడా నశించింది. ఉన్నదల్లా ఒక్క ప్రతీకారవాంఛే. ఒకటే ద్వేషం. ప్రతీకారం ఎలా సాగించుకోగలనా, ఎప్పుడు అవకాశం లభిస్తుందా అని చూస్తున్నాడు. కాని అతని ప్రతీకారవాంఛలో మొదట ఉండిన పదును లేదు ఇప్పుడు. తాను తలపెట్టినది చేయాలంటే హృదయమంతా పూర్తిగా విషమయమైపోవాలి. రాయితో సమానమైపోవాలి కాని అతనిహృదయంలో హేమపట్ల విషంతో నిండినా, ఒకవైపు ఆ కుంటి కుఱ్ఱవాడంటే ప్రేమతో నిండిపోతోంది. అందువల్ల తాను తలపెట్టినది చేయడానికి కావలసిన రాతిగుండె లేదు. మరి వేరేవిధంగా ప్రతీకారం చేయాలని చూడసాగాడు.

కాలేజీలో చదువుతున్న రోజుల్లో రావు రాసిన రెండుకథలూ, ఒకటి రెండు వ్యాసాలూ పత్రికలలో పడ్డాయి బాగా రాశావన్నారు అందరూ. కాని అతను మళ్ళీ అటు కృషి చేయలేదు. ఇప్పుడు ఆ రచనాశక్తి నుపయోగించి హేమనూ, ఆమె సమాజాన్ని మట్టిలో కీడ్వాలని సంకల్పించుకున్నాడు. కాగితం, కలం తీసుకున్నాడు. ఎన్నో విషయాలు ఒక్కసారిగా అతని మనస్సులో నిండిపోయాయి. అన్నిటినీ తీర్చి పెట్టుకున్నాడు. ఎలా ఎంతఘాటుగా రాయాలో ఊహించుకున్నాడు. కలం కాగితంమీద పెట్టబోతున్నాడు. ఇంతలో పేపర్లకుఱ్ఱవాడువచ్చి ఆ ఊళ్లోనే వెలువడే ఒక పత్రిక అతనికిచ్చి వెళ్ళిపోయాడు. పత్రికవిప్పి చూశాడు. మొదటి పేజీలోనే పెద్దక్షరాలతో "నేటి సమాజం" అనే వ్యాసం మారుపేరు పెట్టుకున్న రచయిత రెవరిదో ప్రకటించబడింది. చాలా పెద్దవ్యాసమే. నాలుగు పేజీలు పూర్తిగా ఉంది. చదవసాగాడు రావు అరే! ఇదేమిటి, ఎవరు? తను రాయదలచుకున్నదే రాసివేశాడే! హేమను గురించీ, ఆమె స్నేహితులనుగురించీ తీవ్రమైన దూషణతో నిండిఉంది. త్వరత్వరగా చదివేశాడు రావు వ్యాసం; మళ్ళీ చదివాడు; మళ్ళీ చదివాడు; ఆ రచయిత ఎవడో కనిపిస్తే బాగుండును కౌగలించుకునేవాడే! సంతోషం పట్టలేక గదిలో అటూ ఇటూ తిరగసాగాడు. మళ్ళీ వ్యాసం తీసుకు చదివాడు. ఎవరు రాసిఉంటారు? అందులో హేమ మిత్రులందరి మీదా—ఒక్క కళాకారుడిమీద తప్పితే—ఆరోపణలున్నాయి. అదీ, ఆ కళాకారుడే రాసిఉంటాడు. అతనే! అనుమానంలేదు. అతను తరుచు వాడే రెండు

వాడు ఊతపదాలు వ్యాసంలో కూడా దొర్లాయి. కొన్ని రోజులనుంచి అతను తన భార్యదగ్గర కనబడటం లేదు కూడా. ఏదో వచ్చిందన్నమాట! ఏలా ఆశించి ఉంటాడు. ఆశ ఫలించకపోగా నిస్పృహతో ఎగురు తిరిగి ఇలా వ్రాసి ఉంటాడు. ఈ ఆలోచన తోచగానే రావుకు కళాకారుడిమీద అసహ్యం పుట్టుకు వచ్చింది. కళాకారుడు తన కొకనాడు శత్రువే తన భార్యనెంటబడ్డవాడే ఇప్పుడు అనుకున్నది కాక పోగా తను కోరినవారికే ద్రోహం తలపెట్టాడు నీచుడు. కళాకారుడి బండారం బయటపెట్టాలనీ, అతనికి తగినశాస్తి చేయాలనీ రావుకు గొప్ప ఉబలాటం కలగసాగింది. అలా కళాకారుడికి జవాబీయటంలో తన భార్యను సమర్థించవలసి వస్తుంది సమర్థించినా సరే. అసలు తనవస్తువును అది ఎంత నీచమైనవస్తువైనా, ఇంకొకడు అపఖ్యాతి పాలుచేస్తున్నాడంటే ఆ వస్తువును కాపాడాలనే బుద్ధిపుట్టం దతనికి. వెంటనే కలంతీసి కాగితంమీద తానిదివరకు ఏమిరాద్దామను కున్నాడో సరిగా దానికి వ్యతిరేకంగా కళాకారుడి మీద "పుల్లద్రాక్షపళ్లు" అనే పేరుతో వ్యాసం ప్రారంభించాడు. తన పేరు "సుందర్ కుమార్" అని పెట్టుకున్నాడు. కళాకారుణ్ణి ఖండించటానికిగాను భార్యను సమర్థించడంలో అనుకోకుండానే చాలా దూరం పోయాడు. అతనికే ఆశ్చర్యం వేసింది ఆమె నంతగా సమర్థించినందుకు. నవ్వుకున్నాడు. ఈ వ్యాసంచూసి భార్య ఎలా ప్రవర్తిస్తుందో గమనించాలన్న కుతూహలం బయలుదేరింది. వ్యాసం ఆ ఊళ్లో ఉన్న రెండో పత్రికకు తనపేరూ విలాసమూ తెలియకుండా పంపించాడు.

మొదటి పత్రికలోని 'నేటి సమాజం' అనే వ్యాసంతో ఊరంతా గగ్గోలుగా ఉంది. ఎక్కడ చూసినా దానిమీద చర్చ. హేమకు ప్రపంచమంతా తనమీదకే విరుచుకుపడ్డట్టనిపించింది. ధైర్యం చెడిపోయింది. ఎన్నడూ ఇటువంటిది జరుగుతుందని ఆమె ఊహించలేదు. ఆమె కేమీ తోచటంలేదు. ఎలా ఈ భయంకర పరిస్థితినుంచి బయటపడటమో ఆందోళన చెందిపోతోంది. మర్నాడు రెండవ పత్రికలో "పుల్లద్రాక్షపళ్లు" అనే వ్యాసం చూసింది. కొంత ధైర్యం తిరిగి వచ్చిందామెకు. జవాబు ఎవరు రాసి ఉంటారా అని ఆలోచించింది. "నేటి సమాజం" వ్యాసం మొదట్లో తన భర్తే రాశాడేమోనని అనుమాన పడింది కాని కళాకారుడే రాశాడని తెలుసుకోడానికి ఆట్టేసేపు పట్టలేదు. కళాకారుడు శత్రువై పోయాడు. ఇక మిగిలిన మిత్రబృందంలో ఇద్దరు లెక్చరర్లే ఏమైనా వ్రాయగలది. అందులో ఎవరు వ్రాసిఉంటారో నిర్ధారణ చేసుకోలేకపోయింది. అందువల్ల, పైకి కృతజ్ఞత స్పష్టంగా ప్రకటించలేకపోయినా, ఇద్దరినీ ఇదివరకటికన్న గౌరవంగా చూడ సాగింది. అయినా హేమ ఇదివరకులా స్వేచ్ఛగా తిరగలేకపోతోంది. పార్టీలు అవీ తగ్గించుకుంది. మిత్రులతో కూడా ఇదివరకటంతటి చనువుగా ఉండ లేకపోతోంది.

రావు ఎక్కువకాలం ఆ కుర్రవాడితోనే కాలక్షేపం చేస్తున్నాడు. మొదటవాడిని ముట్టుకోడానికి సంశయించినా ఇప్పుడు వాడిని అప్పుడప్పుడు ఎత్తుకొని కూడా తిరుగుతున్నాడు—లోకం బాగా చూడాలనే. కుర్రవాడిని ఎత్తుకునే ఇంటికి వచ్చాడు. హాలులో హేమా, స్నేహితురాండ్రూ, లెక్చరరూ, డాక్టరూ, ప్లీడర్లూ కూర్చొని ఉన్నారు. అతను లోపలికి పోయాడు. అతన్ని చూసి అందరూ నిశ్శబ్దంగా ఉండిపోయారు. కుర్రవాడితో ఇంటి లోపలి భాగానికి పోబోతున్నాడు రావు "ఎక్కడికి" అని అడిగింది హేమ. "ఇంట్లోకి" అన్నాడు మెల్లగా భీషణంగా. "తీసుకువెళ్ళడానికి వీలు లేదం"దామె. రావు కుర్రవాడిని ఒకకుర్చీలో కూర్చోబెట్టాడు. వాళ్ళ వైపుకు తిరిగాడు. పళ్ళు బిగించి, అతి మెల్లగానే "ముందు మీ రిక్కడనుంచి బయటికి నడవండి" అన్నాడు. వాళ్లు భయంతో నిలబడిపోయారు. "వెళ్ళరు" అంది హేమ ఎదిరించి. "నా యింట్లోనుంచి పోవలసిందే" అన్నాడు రావు గొంతుక ఏమాత్రం పెంచకుండానే. "మీ యిల్లు కాదు, మా నాన్న ఇల్లు" అంది హేమ. ఒక క్షణం ఆగిపోయాడు రావు. మళ్ళీ "అయినా సరే, నేనుండగా వీళ్ళిక్కడ ఉండడానికి వీలులేద"న్నాడు. వాళ్ల వైపుకు అడుగులు వేస్తూ "నేను జెయిలుకు పోవచ్చు కాని పోయే ముందు మీ శరీరాల్లో ఒక్క ఎముక కూడా సరిగా ఉండకుండా చూసి మరీ వెళ్తా"నన్నాడు. ఆ మెల్లగా అనడంలోనే భీషణత్వం కనిపిస్తోంది. వాళ్ళు కంగారుగా ఒకరినొకరు తోసుకుంటూ బయటకు పరుగెత్తి ఇళ్ళకు వెళ్ళిపోయారు." హేమ మాట్లాడలేక ఉండి పోయింది. ఆమెకు కూడా ఎందుకో ఈ వేళ రావును చూస్తే భయం కలిగింది. రావు కుర్రవాడిని తీసుకొని లోపలికి వెళ్లాడు. మరికొంతసేపటికి ఇవతలకువచ్చి ఒక బండిని కేకవేశాడు. బండివాడిని లోపలకు తీసుకువెళ్లి తన సామానులన్నీ తెప్పించి బండిలో పెట్టించాడు. కుర్రవాడిని బండిలో కూర్చోబెట్టి,

ప్రక్కన తను కూర్చొని బండిని పేదపేటలవైపుకు పోనిమ్మన్నాడు.

అతని కిప్పుడొక కొత్త సమస్య ఎదుర్కొంది. అతని ఉద్యోగం ఊడిపోయింది. తిండికే తిప్పలు పడే పరిస్థితి ఏర్పడింది. కూలిచేసుకునే జీవితం గడపాలని నిశ్చయించుకున్నాడు. ఒకనాటి ధనవంతుని కొడుకే కూలిచేసుకు బ్రతకడం. లోకం నవ్వుతుంది. దానిపని అంతే. తాను కూలిచేసుకునే బ్రతుకుతాడు కాని కూలిపని ఎక్కడ దొరుకుతుంది ఇంతలోనే కుర్రవాడికి జ్వరం రాసాగింది. గవర్నమెంటు ఆసుపత్రిలో ప్రవేశపెట్టించాడు. కుర్రవాడికి దగ్గూ, ఆయాసమూ కూడా రాసాగాయి. న్యుమోనియా అని తేలింది. కుర్రవాడికి ఊపిరందడం కష్టంగా ఉంది. నిస్సహాయంగా మాటలు లేక కళ్ళు విప్పుతూ బెదురుగా చూస్తున్నాడు వాడు. వాడిని చూస్తుంటే తనకే ఊపిరాడనట్లనిపించింది రావుకి కుర్రవాడి పరిస్థితి నానాటికి తీసికట్టుగా ఉంది. రావు ఊళ్ళోకి వెళ్ళి అప్పుడే వస్తున్నాడు. అప్పుడే కుర్రవాడు ఒకసారి కళ్ళు తెరచి తల్లితో అన్నాడు "అమ్మా నే వెళ్ళిపోతున్నాను. బాబయ్యను రమ్మను" అని కళ్ళుమూశాడు. రావు ఆ మాటలు విన్నాడు. లోపలికి వచ్చేసరికి ఆ పిల్లవాడి ప్రాణం పోనేపోయింది. రావు కొంతసేపు స్తబ్ధుడై కూర్చున్నాడు. కొంతసేపటికి లేచి తన గదికి వెళ్ళిపోయాడు. ఆ కంటి కుర్రవాణ్ణి బ్రతకకుండా చేసింది ప్రపంచం. అసలు దేవుడికే తామంటే ప్రేమలేదు. కుర్రవాడు చచ్చిపోయాడంటే అతని ప్రాణమే పోయినట్లనిపించింది రావుకు. ఉత్తశరీరమే అన్నట్లుంది. తనకీ లోకంలో స్థానం లేదు. చచ్చి దేవుడిని అడుగుతాడు తమ కెందుకింత అన్యాయం చేశాడో!

రావుకు అకస్మాత్తుగా హేమ గుర్తుకువచ్చింది. అతనిలోని ప్రతీకార వాంఛ ఒక్కసారిగా పెల్లుబికింది. ఆమెను శిక్షించి కాని తాను చావకూడదు. ఇప్పుడు హృదయం పూర్తిగా విషమయమై పోయింది. ఇక సంకోచం లేకుండా ఏపనైనా చేయగలడు. ఆమెను బాధించి, బాధించి చంపాలనే కోరిక బయలుదేరింది. రాత్రి ట్రంకులోనుంచి రెండు పిస్తోళ్ళు తీశాడు. గుండ్లతో నింపాడు. బాగా పొద్దుపోయిన తర్వాత హేమ ఇంటికి వెళ్ళాడు. గారేజీ తాళం తన దగ్గరనున్న చెవితో తీసి కారు బయటికి తీసుకువచ్చి గేటుదగ్గర పెట్టాడు. మెల్లిగా తలుపు తట్టాడు. హేమే తెరచింది. అతన్ని చూసి ఆశ్చర్యపోయింది అతను లోపలికి నడిచాడు దాసీది పక్కగదిలో ఉండటం చూసి ఇంకొక ప్రక్కకు నడిచి హేమను రమ్మన్నాడు. ఆమె రాలేదు. దగ్గరకు వచ్చి పిస్తోలు పైకితీసి ఆమె గుండెకు గురిచేశాడు. ఆమెకు భయంతో మాటకూడా పైకిరాలేదు అతను చటుక్కున చేయి ఆమెవీపునుంచి చుట్టవేసి నోరు నొక్కివేశాడు. జేబురుమాళ్ళు నోట్లో కుక్కాడు. చేతులూ, కాళ్ళూ కట్టివేశాడు తీసుకువెళ్ళి బయట జాగ్రత్తగా చూసి కారులో వెనకసీటుముందు క్రిందనే ఉంచాడు. ఒక గుడ్డ ఆమెమీద కప్పాడు. ఇంటికి బయట గొళ్ళెం పెట్టి, కారు పోనిచ్చాడు.

మొట్టమొదట డాక్టరింటికి పోయాడు. తలుపు తట్టాడు. ఏదో కేసేమోనని డాక్టరువచ్చి తలుపు తీశాడు. డొక్కలో పిస్తోలు గుచ్చుకుంది "అరవకు. అరిచావంటే చచ్చావన్నమాటే. నిన్నేమీ చేయను. ఒట్టు వేస్తున్నాను నాతోరా కొద్దిగా మాట్లాడవలసి వుంది మాట్లాడి మళ్ళీ తీసుకువచ్చి దిగబెడతాను. ఏమీ భయంలేదు కాని ఏమైనా అల్లరిచేశావో ప్రాణం పోయినట్లే!"

డాక్టరు అతను చెప్పినట్లే నడిచాడు. కారు ఫ్రంటు సీటులో కూర్చోబెట్టుకొని ఊరిబయటకు పోనిచ్చాడు రావు అక్కడ ఆపాడు. రావు డాక్టర్ని అడిగాడు.

"నీవు నా భార్యను ప్రేమిస్తున్నావు కదూ?"

డాక్టరు మాట్లాడలేకపోయాడు.

"నీవు ఎన్నడూ పెళ్ళి చేసుకోనని ఒట్టు వేయగలవా?"

డాక్టరుకు కొద్దిగా మాట వచ్చింది. "నేను పెళ్ళిచేసుకోకుండా ఉండలేను. మావాళ్ళంతా బలవంత పెట్టారు."

"అయితే నీ విప్పుడు నా భార్యతో ప్రవర్తించినట్లు నేను నీ భార్యతో ప్రవర్తించడానికి ఒప్పుకుంటావా?"

డాక్టరుకు ముచ్చెమటలు పోశాయి. "క్షమించండి రావుగారూ, నాకు బుద్ధివచ్చింది. ఇంక ఎన్నడూ ఇట్టి పనులు చేయను"

"నిన్ను చంపివేస్తే మాత్రం తప్పేమిటి?"

"రక్షించండి రావుగారూ! కాళ్లు పట్టుకుం

రావు నవ్వాడు. అతని చేత అప్పుడు జరిగిన కేదీ ఎవరికీ చెప్పనని ఒట్టు వేయించి, అతన్ని ఇంటికి తీసుకుపోయి దిగబెట్టాడు. తరువాత ఇంగ్లీషు లెక్చరర్ ఇంటికి పోయాడు. ఇంగ్లీషు లెక్చరర్ మొదటే బేజారైపోయి, అని అడగకుండానే అన్నీ ఒప్పుకొని, బతిమాలి ప్రాణాలు దక్కించుకున్నాడు హిస్టరీ లెక్చరర్ మొదట బెట్టు చూపబోయాడు కాని సాగక కాళ్లు పట్టుకున్నాడు. ప్రిన్సిపల్ దగ్గరకు పోలేదు రావు. హిస్టరీ లెక్చరర్‌ని విడిచిపెట్టి కారు తిన్నగా ఊరి బయటకు పోనిచ్చాడు.

ఆకాశమంతా కారుమబ్బులు క్రమ్మి మరీ అంధకారంగా ఉంది. పెనుగాలి వీస్తోంది భయంకరమైన మూలుగు ధ్వనితో పెనుభూతాల్లా తల ఊపుతున్నాయి చెట్లన్నీ. పది మైళ్లు పోయినతర్వాత కారు ఆపాడు. వెనక సీటుకు పోయి భార్గవను ఇవతలికి తీశాడు. కట్లు విప్పాడు. నోట్లో రుమాళ్ళు తీసి వేశాడు. ఆమె మూర్ఛపోయి ఉంది. కారులోని క్యాన్‌లో నీళ్ళు తెచ్చి చల్లాడు. ఆమెకు స్మృతి వచ్చింది రావు బాటరీలైటు తీసి, ఒక కాగితం కలం ఆమెముందు పడవేసి, లైటు కాగితంమీదకు ఫోకసు చేసి. "ఏమైనా ఎవరితోనైనా చెప్పవలసి ఉంటే ఆ కాగితంమీద వ్రాయి. ఇక నీకూ నాకూ ఆఖరి గడియ" అన్నాడు. ఆమె చేతిలో కాగితం గాలిలోకి ఎగిరిపోయింది ఆమె నోటినుంచి ఏడుపు బయలుదేరింది. అతి దీనంగా ఏడుస్తోంది. అప్పుడతనికి కనిపించిన రూపం చూసి అతనికి అసహ్యం కలిగింది. ఇప్పుడామె సౌందర్యమూర్తి కాదు పితికిపీనుగు. అలాంటిదాన్ని చంపడానికి అసహ్యం వేసింది. కారులోకి లాక్కుపోయాడు. కారు తిరుగుదారిని పట్టించాడు. కుంభవృష్టిగా వర్షం కురవసాగింది. గాలికి చెట్లు కూలుతున్నాయి. అలాగే సాగుతోంది కారు. హఠాత్తుగా, ఫెళఫెళారావంతో పెద్ద చెట్టు వాల్లి కారుకు ముందుగా పడింది. కారు ముందుభాగమంతా పిప్పి అయిపోయింది. రావు చటుక్కున బయటకు దూకివేశాడు ఆమెనూ బయటకు లాగాడు. ఆమెను అలానే విడిచిపెట్టబోయాడు. ఆమె భయంతో పరుగెత్తుకువచ్చి అతనిని చుట్టుకుంది. వదిలించుకొన్నాడు. మళ్ళీ పరుగెత్తుకువచ్చి పట్టుకుంది. గట్టిగా విదిలించుకొని వెనక్కి తోసేశాడు రావు. ఆమె చెట్టుమీద పడి అలాగే నేలకు ఒరిగిపోయింది. అతను గాలీవర్షంలో కొంచెం ముందుకు సాగాడు. ఒకమారు వెనక్కి చూశాడు. ఆమె అలా నేలమీద పడిఉండటం చూశాడు. వెనక్కి తిరిగివచ్చి ఆమెను ఎత్తుకొని భుజంమీద వేసుకున్నాడు. ముందుకు నడిచాడు. దారి కనబడటం లేదు. అలానే పడిపోయిన చెట్లను తప్పించుకుంటూ మెల్లగా కాళ్ళీడ్చుకుంటూ నడుస్తున్నాడు. ఇద్దరూ పూర్తిగా నానిపోతున్నారు. ఆమె గజగజ వణుకుతూ మూలుగుతోంది ఊరు మైలుదూరంలోకి వచ్చింది ఇక ఫరవా లేదనుకున్నాడు కాని కాళ్లు నీళ్లలో దిగుతున్నాయి. అంతకంతకు నీరు పైకి వస్తూంది, వాగు పొంగింది కాబోలు. అందటం లేదు. ప్రవాహం అతివేగంగా ఉంది. ఆమెను వెన్నుమీదకు మార్చుకున్నాడు కదలవద్దు అని చెప్పి ఈదసాగాడు. క్రిందికి కొట్టుకుపోతున్నాడు, పైన ఒరవు, ఈదటం కష్టమైపోతోంది ఇంతలో నేల తగిలింది. ఒడ్డుకు చేరాడు మళ్ళీ ఆమెను భుజంమీదకు మార్చుకున్నాడు ఊళ్లో ప్రవేశించాడు. ఊళ్లో ఎక్కడా లైట్లు వెలగడం లేదు కారుచీకటి. అలానే తడుముకుంటూ ఆమెను ఇంటికి తీసుకువెళ్లాడు. గొళ్లెంతీసి లోపలకు తీసుకుపోయి మంచంమీద దించాడు.

మెల్లగా వెనక్కి తిరిగాడు.

"ఎక్కడికి" అంది హేమ ఆదుర్దాగా.

"ఎక్కడికైతే నేం" అన్నాడు రావు నిర్లక్ష్యంగా.

"కాదు. పోకండి. నన్ను విడిచిపెట్టకండి. ఇప్పుడిప్పుడే తెలుసుకుంటున్నా"నంది ఆవేశంతో.

"లాభం లేదు—సమయం మించిపోయింది" అంటూ నిర్వికారంగా ఒకనవ్వు నవ్వి, బయటకు అలానే ఆ తుఫానులోకి వెళ్ళిపోయాడు. ఎక్కడికో! ఎందుకో!

# కాంచీపురము

శ్రీమతి వారణాసి యశోదాదేవి

సత్యవ్రతక్షేత్రమను నామాంతరముగల కంచి లేక కాంచీపురము మద్రాసు రాష్ట్రములో చెంగల్పట్టు జిల్లాలో మద్రాసుకు 46 మైళ్ల దూరమున గలదు. దాదాపు 6 మైళ్లు నిడివిగల్గి యీ పురము మధుర, తంజావూరు పట్నముల బోలియున్నది. పురముచుట్టు కందకముండి, దానిలోనికి మురికినీరంతయు చేరుటకు యేర్పాట్లు పురాతనకాలమున నున్నట్లు తెలియవచ్చును.[1] ఊరి నలుపక్కల భాగములలో యేనుగులను, గుఱ్ఱములను తర్ఫీదు చేయుటకు, సైనికులకు శిక్షణ నిచ్చుటకు విశాలమైన బయళ్లుండెడివి.[2]

పౌరాణికముగను చారిత్రకముగను కంచి యనాదిగ ప్రసిద్ధిగాంచి యున్నది. భరతఖండము లోని యేడు పవిత్రస్థలములలో కంచి యొకటి. దీనిని దక్షిణ కాశి యందురు. జైన బౌద్ధయుగము లలో కాంచీపురము ఆయా మతములకు ముఖ్యకేంద్రముగ నుండెను. హుయాన్ త్సాంగ్ యిచటి బౌద్ధమును వర్ణించి యున్నారు. పల్లవరాజధానిగ కంచి వైభవమనుభవించిన కాలంలో నచటను, సమీపమందలి తిరుక్కళుకున్రము, మామల్లపురములలో కళాలక్ష్మి వెల్లివిరిసినది. ఆనాటినుండి వైదిక విద్యా బోధనకు, బ్రాహ్మణమతములకు నాలవాలమైనది.[3] విద్యాపీఠముగుట, దూరస్థలములనుండి వచ్చి విద్యార్థులు, ఆరితేరిన యొజ్జల సమక్షమున వేద, వేదాంతములను నేర్చుకొనుచుండిరి. అనేక మతబోధకులు వచ్చి తమ తమ మతముల ప్రచారము చేయుచుండిరి. ప్రఖ్యాతుడైన యాదవప్రకాశుల కడ అద్వైత మతమును అభ్యసించిన విద్యార్థులలో తర్వాతి వైష్ణవ మతప్రవక్తయైన రామానుజాచార్యులు గూడ నుండెను.

పల్లవుల తదనంతరము కంచి సామంతరాజులకు రాజధానిగ, దక్షిణ సామ్రాజ్యమునకు రాష్ట్రరాజధానిగ నుండెను. 12, 13 శతాబ్దములలో కాకతీయులు కంచిపై దండయాత్రలు సల్పి తమ రాజప్రతినిధిని యిచట నిల్పిరి. తెల్గు పల్లవులకు కంచియే రాజధాని. ఈ పల్లవులలో వీరగండ గోపాలుడు (క్రీ. శ. 1243—1273), విజయగండ గోపాలుడు[4] (క్రీ. శ. 1250–1285) ముఖ్యులు. కంచి రాజధానిగ పాలించిన కొండవీటి రెడ్డిరాజులలో కొమరగిరి నామాంతరము గల మహారాజసింహుడు ప్రసిద్ధి గన్నరాజు 14, 15 శతాబ్దములలో రెడ్డిరాజులను[5] వెలమరాజులను కంచిని పాలించుటు వారి ప్రశస్తుల లోని కాంచీ కవాటచూరకార—యిత్యాది బిరుదుల వల్ల తెలియవచ్చును. గజపతి చక్రవర్తులు — కపిలేశ్వరుడు, పురుషోత్తముడు, ప్రతాపరుద్రుడు—తమ దక్షిణదండయాత్రలలో కంచికి వెళ్లి, దేవాలయముల దర్శించి విజయశాసనముల జెక్కించి యున్నారు. విజయనగర కృష్ణరాయలు కాంచీదండయాత్ర సల్పి యున్నారు. ఇతని శాసనములు వరదరాజస్వామి ఆలయములో గలవు అచ్యుతరాయలు,[6] కంచిలో తులాభారము ముత్యాలతో తూగెను.

తర్వాతి కాలంలో కంచి గోల్కొండ నవాబుల పాలనయందు, అటుపిమ్మట ఆర్కాటురాజుల చేతిలోనికివచ్చి, చివరకు ఫ్రెంచి ఆంగ్లేయుల చేతులు మారింది.

కాంచీపురము పెదకంచి - శివకంచి, జినకంచి, విష్ణుకంచి యను రెండుభాగములుగ నున్నది. ఇచటి దేవాలయములలో వైకుంఠ పెరుమాళ్, కైలాసనాథ ఆలయములు దేవాలయ వాస్తువునందు కట్టడములతెగకు జెందియున్నవి.[7] వాటికాలము క్రీ. 690 - 800 మధ్య కైలాసనాథాలయమును మహేంద్రవర్మ *III* పూర్తి చేసెను. ఇందు గోపురము,

1. పెరియపురాణము.

2. *C. P Venkatarama Iyyar; Town Planning in Ancient Dakkan P 76.*

3. *C. Virabhadra Rao: History of Andhras. V. P 275.*

4 *Dr. V. Yasoda devi: The History of Andhras Chapter XII.*

5. *V. Yasoda devi The Reddis (of Kondavidu & Rajahmandry)*

6. విజయనగర చక్రవర్తుల శాసనములు.

7. *V. A. Smith A history of Fine art in India & Ceylon pp 35 - 36.*

స్తంభములు గల మంటపము గలదు. ప్రాకారము చతురస్రముగనుండి అందు గూళ్లు గల్గియున్నది. ఇవి రెండు కూడ పల్లవులనాటి యిచటి మిగతా దేవాలయములలో ముక్తేశ్వరాలయము (క్రీ శ 700-750) 'డోమ్' ఆకారములో కప్పుగల్గియున్నది ఈ ఆలయము లన్నియు, రాజసింహుడు అతని కుమారుల కాలమున నిర్మింపబడినవి.

వైకుంఠ పెరుమాళ్ ఆలయము గర్భగుడిచుట్టు ఉన్నతమైన వరండా గలదు ఆ వసారా గోడల మీద రెండు వరుసలుగ చిత్రములు గలవు8 ఆ చిత్రముల క్రిందిభాగమున పేర్లు చెక్కుటకు చోటు వదలబడియున్నది శిల్పులయొక్క వివరముల తెలుగు కొన్నిచోట్ల గలవు; కాని యవి అంత ప్రాముఖ్యములు కావు ఇవన్నిటికి అగ్గా చిత్రములు వాని క్రింద వ్రాతలు పల్లవుల చరిత్రమును పురాణ గాథతో సహా వివరించుచున్నవని చెప్ప వచ్చును. ఆలయము పరమేశ్వరవర్మ I (క్రీ. శ 675) చే కట్టబడి నందివర్మ పల్లవమల్ల (క్రీ శ 742) చే పూర్తిచేయబడినది. పరమేశ్వరవర్మ II మరణాంతరము నందివర్మ రాజ్యాధిరోహణ ఘట్టము పైన పేర్కొనబడిన కుడ్య చిత్రములలో9 చిత్రితమై నటులున్నది.

కంచి దేవాయతనము లన్నింటిలో యేకామ్రనాథాలయము బహు పురాతనము; ఇచటి యిసుక లింగము దక్షిణదేశమునందలి ముఖ్యమైన పంచలింగములలో నొకటి ఈ దేవాలయమునకు సంబంధించిన పురాణగాథ10 యీ క్రింది విధముగా నున్నది- శివుడు సృష్టి, స్థితి, లయములను ముఖ్యమైన పనిలో లీనమైయుండ, పార్వతి వెనుకనుండి వచ్చి కళ్ళు మూయగా, ప్రపంచమంతట చీకటిగాపోయెను. శివుడు కోపించి పార్వతిని శపించి, కంపానదీ మున మామిడివృక్షము క్రింద తనను ప్రతిష్ఠించి తపస్సు చేయగా శాపాంతమగునని చెప్పెను. పార్వతి అటుల చేయగా ఆరు నెలల తర్వాత శివుడు పార్వతికి ప్రత్యక్షమై యామెను యథాస్థానములో నుంచెను. మరొక గాథ11 యేమనగా పార్వతి శివుని భర్తగా గోరి తపస్సు చేయుచుండగా, శివుడు పరీక్షార్థమై యొక మామిడిచెట్టును పాతి దాని క్రింద శివలింగమును ప్రతిష్ఠించి తపస్సు చేయుమనెను." పార్వతి యటులే చేయగా శివుడు ఆమెను పరిణయమాడెను. సహకార వృక్షమువలన ,అచటి దేవుడు యేకామ్రేశ్వరుడయ్యెను; శివుని కామమును మారిన నేత్రములు గలదగుట యిచటి దేవి కామాక్షి యాయెను.

ఏకామ్రేశ్వరుని యాలయములో గర్భగుడి వెనుక బ్రహ్మాండమైన ప్రమాణముగల మామిడిచెట్టు గలదు; బహు పురాతనమని చూచిన తెలియగలదు. అది నాలుగు విధముల మామిడి పండ్లను—పులుపు, తీపి, చేదు వగరు—కాయునట. కంపానదిని, పార్వతి తపస్సు చేసిన స్థలమును పూజారులు చూపెదరు. ఈ యేకామ్రనాథాలయ గోపురము దక్షిణదేశమందలి దేవాలయముల గోపురము లన్నిటికంటెను పెద్దది. దీని నిడివి 188 అడుగులు; పదిఅంతస్థులు గలవు శిఖరమున తొమ్మిది కలశములు గలవు. విశాలమైన దేవాలయపు ఆవరణలో అనేక పెద్ద మంటపములు గలవు. ఆవరణ చుట్టుగల వసారాలో 310 చక్కని శివలింగములు గలవు వీనిని పూర్వము భక్తులు—నాయనార్లు—పూజించిరని చెప్పదురు. ప్రాకారములోని చిన్న గుడిలో యేకామ్రనాథుని, కామాక్షి విగ్రహములు బహు చక్కగ చీని చీనాంబరములు, ఆభరణములతో నలంకృతములై యున్నవి. సన్నిధిలో రెండు పెద్ద అద్దములు ఉంచబడియున్నవి; వానిలో నేకామ్రనాథునివి, కామాక్షివి వెయ్యి ప్రతిమలు చూపెనగునని చెప్పదురు. కాని కనీసము, పది, పదిహేను ప్రతిమలు నిస్సంశయముగ జూపెనగును. కామాక్షిదేవి ఉత్సవ విగ్రహమునకు వెలలేని యాభరణములు గలవు. వజ్రాలు పొదిగిన కంఠాభరణము 60,000 రూప్యముల విలువగలది- సర్. సి. పి. రామస్వామి అయ్యరు యిచ్చెనట. అచటి తిప్పయ పూర్వికులలో నొకడు యేకామ్రనాథునికి12 ప్రాసాదములు గట్టించెను.

యేకామ్రనాథాలయమందలి శిల్పము విశిష్టమైనది. అత్యున్నతమైన యీ గోపురము శ్రీకృష్ణదేవరాయలచే కట్టబడి విజయనగరరాజుల కళాసంపదను వేనోళ్ళజాటును. కామాక్షి మామిడిచెట్టు క్రింద శివలింగము నారాధించుచున్నటుల ప్రతిమలు ఆలయములో ననేక స్తంభములమీద చెక్కబడియున్నవి; రాముడు శివలింగమును బూజించుట, యమపాశముల

8. *T. G. Aruvamuthan: South Indian Portraits Chapter II.*

9 *T. G. Aruvamuthan: South Indian Portraits Chapter II.*

10. *S. I. R. Illuustrated guide.*

11. అచటి పూజారులు చెప్పునది.

12. *Srinatha: Haravilasamu.*

నుండి తప్పించుకొనుటకు మార్కండేయుడు శివలింగమును కౌగిలించుకొనుట, రావణుడు— మొదలగు శిల్పములు తరచుగ ఆలయ మంటపములలో గానవచ్చును. కుమారస్వామికి, చిన్న ఆలయములు గలవు. ఒక ఆలయ మంటపములో 540 స్తంభములు గలవు.

ఏకామ్రనాథాలయమునకు 4 మైళ్ళ దూరాన హస్తగిరి శైలముమీద—విష్ణుకంచిలో శ్రీ వరదరాజ స్వామి దేవాలయము గలదు. దీనికి సంబంధించిన పురాణగాథ13 యీ విధముగనున్నది— బ్రహ్మకు సరస్వతికి కలహము సంభవించినది. బ్రహ్మ లక్ష్మిని మిక్కుటముగ గౌరవించుట వలన సరస్వతి బ్రహ్మను విడిచి వెళ్ళిపోయినది. బ్రహ్మ అశ్వమేధయాగము చేయుటకై కంచి వెళ్ళెనట; కంచిలో చేసిన ఒక యాగమునకు, యితర స్థలములలో చేసిన సహస్ర యాగముల సమాన ఫలమట. బ్రహ్మ యాగము చేయుచుండగా సరస్వతి యిప్పుడు ఆలయమున్న స్థలంలో, భూతముల సాయముతో వరదరూపమున వచ్చి యాగ భంగము చేయదలచెను. విష్ణుదేవుడు బ్రహ్మసహాయార్థము వచ్చి దిగంబరుడై ఆ ప్రవాహములో శయనించెనట. అంత సరస్వతి లజ్జనొంది తనను దక్షిణదేశములో గంగానదికంటె పవిత్రముగ గౌరవింపవలెనను షరతుమీద త్రోవ యిచ్చెను. బ్రహ్మ యాగము సక్రమముగా నడచెనట. ప్రజలు విష్ణువును అచటనే స్థావర మేర్పరచుకొనుమని ప్రార్థించిరి. తత్ఫలితముగ శ్రీ వరదరాజ స్వామి అట వెలసెను.

ఆలయములోనికి కొంతమెట్లు ఎక్కి వెళ్ళవలెను. ఇది యేకామ్రనాథ ఆలయముకంటె చిన్నది దీని బాహ్యప్రాకారపు కుడ్యములపై దక్షిణ దేశ చారిత్రమునకు ముఖ్యమైన శాసనములు లిఖింపబడియున్నవి. వీని లిపి—తమిళము, తెలుగు. కొంత వెక్కుచు మెట్లమీదనుంచి విజయనగర, గజపతి చక్రవర్తుల తెలుగు శాసనములను సునాయాసముగ చదువగలము. నల్లరాతిమీద యీ శిలాక్షరములు ముత్యముల కోవలే. ఆలయములోపల గోడలపై వివిధ వర్ణ చిత్రములు గలవు. ఇందు భాగవతమునుండి కొన్ని ఘట్టములు, శేషశాయియైన మహావిష్ణువు, కృష్ణుడు గోవర్ధనగిరిని ఎత్తుట—గానవగును. ఒక చిత్రములో యేనుగు నెక్కియున్న విలుకాడు గలడు; యేనుగు తొండము, శరీరము అంగములలో 9 మంది గాయనీమణులు చూపబడిరి; వీరి శరీరములు యేనుగు చిత్రము కలిసియున్నవి.14 ఇవికాక పలు విధములైన పూవులు, మొగ్గలు కొమ్మలు, తీగెలు మనోహరముగ చిత్రితములైనవి.15 ఒకచోట పైకప్పుకు బంగరు బల్లి పెట్టబడియున్నది. దాని సమీపమున బల్లి చిత్రములు 3, 4 గలవు వానిని తాకుటకు కొయ్యమెట్లు వరుస కట్టబడియున్నది. అంతియకాక ఆలయమున తరచుగ బలి ప్రతిమలు గానవచ్చును. ఇచటి కల్యాణమంటపము వెల్లూరు జలకంఠేశ్వర ఆలయమందలి మంటపమును బోలియున్నది.

శ్రీ వరదరాజస్వామి, దేవి యొక్క మూలవిగ్రహములు పెద్దవిగ, ఆకర్షణీయములుగ నున్నవి; పంపా సమీపముననున్న కోదండపాణి ఆలయ మూలవిగ్రహములను, తిరువళిక్కేణి పార్థసారథిస్వామిని స్మృతిపథమునకు దెచ్చుచున్నవి. వరదరాజస్వామి 4 హస్తములలో కుడివైపు పైచేతిలో చక్రముగలదు; క్రింది చేయి వరద హస్తము—రక్షణను సూచించును. ఎడమవైపు పైచేతిలో శంఖము, క్రిందిదానిలో కౌస్తుభమణియు చూపబడినవి. శ్రీనాథుని హరవిలాస కృతిభర్త అవచితిప్పయ (త్రిపురాంతకుడు) పూర్వీకులలో నొకడు వరదరాజస్వామి నాభిలో బాలార్కమను మణిని బొదగించెనట,16 శ్రీ కృష్ణరాయలు దేవునికి యనేక బహుమతుల నిచ్చెను 17

ఏకామ్రనాథాలయ సమీపమున ప్రత్యేకముగ కామాక్షమ్మ పెద్ద దేవాలయము గలదు. ఇందు కుడ్యములపై యందమైన పూలతీగెలు, రేఖాలంకారములు విచిత్రవర్ణములలో చిత్రితమై యున్నవి.18

జినకాంచిలో – తిరుప్పతిక్కున్రంలో వర్ధన ఆలయము గలదు ఇందు ఆలయపు సన్నిధయందు గల వర్ధన అర్ధమంటపమునకు ఎదురుగ యిరుగప్ప దండనాయకుడు సంగీతమంటపము కట్టించెను దీని కొలతలు 61′9″ × 26′4″ ఈ రెండు మంటపముల లోపలి కప్పుమీద చిత్రింపబడిన వర్ణచిత్రములలో జైనతీర్థంకరులు – ఋషభదేవ, నేమినాథ, కృష్ణుల –

13. *S. I. R. Illustrated Guide.*

14. *V. A. Smith: A history of Fine Art in India & ceylon P. 344.*

15. ,, ,, ,,

16. *Srinadha; Haravilasamu.*

17. విజయనగర చక్రవర్తుల శాసనములు.

18. *V. A. Smith: A history of Fine art in India & Ceylon P 344.*

జీవితములందలి ముఖ్యఘట్టములు గలవు.19 సంగీత మంటపంలో నొక స్తంభముమీద యిరుగప్ప ప్రతిమ చెక్కబడియున్నది.

విజయనగరశిల్పము, చిత్రకళ కంచి, నెల్లూరు, విరించిపురము, లేపాక్షి, సోంపల్లిలో నిల్చియున్నది. వరదరాజాలయమంటపమందలి స్తంభముల పనితనము జీవకళ ఉట్టిపడు జంతువుల బొమ్మలు పేర్కొనదగినవి.20 శ్రీ రామానుజయతీంద్రుడు విశిష్టాద్వైత మతవ్యాపకమునకు కంచిలో మఠము నేర్పరచెను. ఇచటనే శంకరుని కామకోటి పీఠము గలదు. అస్త శైలసమీపమున గల యీ మఠమును విజయగండ గోపాలుని శాసనము21 పేర్కొనుచున్నవి. ఇచటి వేదమార్గమున రామాయణము చెప్పబడుచుండెను.

ఆంధ్రకవిసార్వభౌముడైన శ్రీనాథుడు కొండవీడు రెడ్డి రాజ్యపతనము తర్వాత క్రీ. శ. 1424 ప్రాంతమున దక్షిణదేశమున పయనించుచు కంచి చేరి, తనకు చిరపరిచితుడు వైశ్యాగ్రగణ్యుడైన అవచితిప్పయ ప్రాపున కొంతకాలము వసించెను. హరవిలాసమందలి కృత్యవతరణిక, సిరియాలకథ కవిసార్వభౌముని కంచి పరిచయమునకు తార్కాణములు. చిరుతొండనంబి వంశీకుడే వైశ్యశిఖామణి అవచితిప్పయ "ముడువంక నేర్పరుగు...కంచి వారవతిలసమాస్త్రీఖిష్టలతలు" అను పద్యములో22 శ్రీనాథుడు అచటి స్త్రీలను వర్ణించియున్నాడు. ఇది చాటుధారయై తర్వాత కాశీఖండములో చేర్చబడియుండును.

కంచిమాహాత్మ్యము అనేక కావ్యములలో వర్ణింపబడినది. జ్ఞానప్రకాశ దేశికులు కంచి గొప్పతనము వర్ణించుచు కచ్చి కలంబకము అను గ్రంథము రచించెను. పెరియపురాణము పురాతన కాంచీవైభవము చాటుచున్నది. కాంచీపురాణ కృతికర్త .23 కాంచిపుర సౌందర్యమును, దేవాలయములను కీర్తించి పనికరి తేపనిగాను. మరొక పాశ్చాత్యాచార్యుడు24 వైభవోపేతమైన దేవాలయములతో ఔన్నత్యము ననుభవించుచున్న కాంచిపట్నమునకు తులతూగు పురము హిందూదేశమందే కాక మరెచటను గానరాదనెను.

---

19. *Vijayanagar Commemoration Volume.*

20 *Journal of Andhra Historical Research Society XVII p 44.*

21. *E. Indica XIII No 16; The History of Andhras.*

22. *Prabhakara Sastri : Sringara Srinathamu p 138.*

23. *C. P. Venkatarama Ayyar: Town Planning in Ancient Dekkan p 77.*

24. *C. P. Venkatarama Ayyar: Town Planning in Ancient Dekkan p 79.*

# విషము విస్మృతి

## శ్రీ దేశిరాట్ విరాట్

చదలేటి జాలారి, జాబిల్లి నవ్వో,
వెన్నంటి నడిచేటి, వాల్గంటి నవ్వో!
హసియించె నిశలూ, కే
కిస కొట్టె దిశలూ-
రేయెండ, నోరెండ,
నే త్రవ్వుచుండ—
చదలేటి జాలారి, జాబిల్లి నవ్వో!
వెన్నంటి నడిచేటి, వాల్గంటి నవ్వో!
శ్రమబిందువులు చింద
సంబాధ మసక,
త్రవ్వేను, త్రవ్వేను
నదిపెండి ఇసుక—
చదలేటి జాలారి, జాబిల్లి నవ్వో!
వెన్నంటి నడిచేటి, వాల్గంటి నవ్వో!
చిరుదోనె పైనెక్కి,
తెరచాప నెత్తి,
ఉదకాల నొంటరిగ
తుదిలేక యరుగ—
చదలేటి జాలారి, జాబిల్లి నవ్వో!
వెన్నంటి నడిచేటి, వాల్గంటి నవ్వో!
'ఏనాటి గోవిందు?
డెచటి గోపికలు?
ఎన్నేళ్ల చిహ్నాలో,
ఇపు డెందు దొరకు!
చదలేటి జాలారి, జాబిల్లి నవ్వో!
వెన్నంటి నడిచేటి, వాల్గంటి నవ్వో!

కథానిక

# మూడు తరాలు

శ్రీ అంగర వెంకటకృష్ణరావు

హాం తనుకి మనసులోవున్న నిశిరాత్రి వేళ అతను సముద్రవిహారం చేస్తున్నాడు. తుపాను రాబోతున్నట్లుంది. సముద్రం ఆకలిగొన్న పులిలాగా వుంది. పులి కడుపులో భుభుక్షలా కెరటాలు ఎత్తుగా లేచి పడుతున్నాయి. ఇసక తడితడిగా వుంది. వాతావరణం జిల్లుమంటూంది.

అతడా తడి యిసకలోనే చతికిలబడ్డాడు. దూరంగా అక్కడా అక్కడా చుక్కలు మెరుస్తున్నాయి. భారంగా వాటికేసి అతను చూశాడు.

అతనుకుంటున్నాడు—

ఆ చుక్కల్లో మహాజీవులుంటారు. వాళ్లు యీ లోకంలో వజ్రాల్లా తరిమెనబడి నలిగేరు. ఇప్పుడు నింగిమీద మెరుస్తున్నారు!

లేక ఆ మెరిసే భాగాలు కిటికీల వజ్రాలతలుపులేమో. పాపపులోకం పడుకోగానే, ఆ మహాజీవులు తమ కిటికీలు తెరుస్తారు. మిలమిల మెరిసే కవాటాలు తెరిచి, యీ లోకంకేసి తొంగిచూస్తారు.

వాళ్ళెప్పుడూ మంచివాళ్లే ఇక్కడ జీవించిన రోజుల్లో తమ నెవరైతే యాతనపాలు జేశారో వాళ్ళని చూస్తూంటారు. కాని కోపగించుకోరు. అసహ్యపడరు. తెలివిగా వున్నప్పుడు తప్పులు చేసే ళ్ళని చూసి జాలిపడతారు. తెల్లవార్లు చూసి విలపిస్తారు.

నిద్ర లేస్తే తమ కన్నీళ్లు చూసి, నిజంగ్రహించి వాళ్లకి తాము చేసిన అన్యాయం గ్రహించి యెక్కడ బెగటిల్లిపోతారో అని, తూర్పున తెల్లరేకలు తోచగానే తమ కిటికీల వజ్రాల తలుపులు మూసుకుంటారు.

అతడొక నిట్టూర్పు విడిచాడు.

అయితే యీ చుక్కల్లో ఆమె యెక్కడుంది? ఆమె యేటువేపు చూస్తూంది.

అతను పిరికి పిరికిగా ఆకాశంలోకి చూశాడు. కన్నీళ్ళలోంచి అతని దృష్టి భిన్నాభిన్నమౌతూంది.

ఏదీ? ఏదీ? ఆమె నక్షత్రం బహు కాంతివంతంగా వుంటుంది. శుక్రుడిని మించి మెరుస్తూంటుంది. ఆమెవి చెంపకు చెరచేసి సువిశాల నేత్రాలు..

విడిన కలువపూ రేకులవంటి, మంచినీటి ప్రవాహంలోని గండుమీలవంటి ఆమె నేత్రాలు ఆకాశం మీద వెతుక్కుంటున్నాడు

నాకు నక్షత్రాలతో పరిచయంలేదు. ఏది హస్త, యేది స్వాతి అంటే చెప్పలేను కాని ఆమెను పోల్చగలను. ఆమె మొలక వజ్రంలా మెరుస్తూంటుంది. ఆమె నీలలోచని నీలలోచనే!

ఆమె నిగనిగ మెరిసే నీలనేత్రాలు నావెంపు తిప్పి తొలిసారి నన్ను చూసినది నేటికి సరిగా మూడు సంవత్సరాల క్రితం. వెంటనే చకితకురంగిలా కళవళపడ్డది.

అదిగో ఆమె! ఎలా మెరిసిపోతోందో!

ఆ కిటికీలోంచి చూసినప్పుడల్లా అనుకొనేవాడిని, వర్షానంతరం అద్దంలా నిర్మలంగావున్న నీలాకాశంమీద ఉజ్వలంగా మెరిసే చుక్కలా వుంటుందని. ఇప్పుడీ పురిటిపొద్దుల మేఘాల నడుమ కూడా అలాగే కిటికీ తెరుచుకొని చల్లగా, జాలిగా, కరుణతో మెరుస్తూంది.

ఒక్కసారి రొజ్జగాలి వీచింది. అతడు వదవదలాడి ముడుచుకు కూర్చున్నాడు.

నే నిక్కడికొచ్చిన కొత్తలో మొదట యీమెను చూసి నా కిలాటి చెల్లెలుంటే బాగుండు ననుకున్నా.

అతని గుండెలు దద్దరిల్లేయి. కాని సర్దుకున్నాడు. ధైర్యం నటిస్తూ వొక దగ్గు దగ్గేడు.

అయినా వొకవేళ పెళ్ళైలుంటే మాత్రం ఎంత కాలం వుంటుంది? ఈడొచ్చి పెళ్ళి కాగానే అత్తగారింటికి తుఱ్ఱున పారిపోతుంది. అక్కడనుండీ మొగుడూ—ఆ లోకమే! చిలకల్లా కాపరం చేస్తూ, సినీమాలు చూస్తూ, నన్ను మర్చిపోతుంది.

గుండె బరువుగావున్నా, గొంతులో డగ్గుత్తిక వుక్కిరి బిక్కిరి చేసినా, కళ్లు చెరువులైనా, అతడలాగే పిచ్చి ఆనందంలో నవ్వుకున్నాడు ఆ ఆలోచనకు.

అయితే ఆమె నాకేం కావాలి? ఆనాడు ఆ ప్రశ్నకు జవాబు అంత సులువుగా లభించలేదు.

రావిచెట్టుమీద యేదో బరువుగా వాలినట్టయింది. ఏదో 'కీచు కీచు'మని ప్రాణసంకటమైన బాధతో ఏడ్చింది గుడ్లగూబ నిద్రపోతున్న ఏ మైనా గొంతు కొరికిందో. అంతా పది సెకన్ల పని. నిర్మలంగావున్న నా మనసు కలవళపడ్డది.

వెనకనుండి బూట్ల చప్పుడు 'కర్ కర్' మని వినిపించింది అతను విసురుగా నడుస్తూవొచ్చి నన్ను ఎగాదిగా చూసి, నా భుజాన్ని దూసుకొని నిర్లక్ష్యంగా పోయేడు.

మకిలి 'డాంగిరీ' ఇనప జోళ్లు. చెరిగిపోయిన వుంగరాల జుట్టు. చేతిలో సిగరెట్టు. పక్కనుండి వెళ్లిపోతూంటే పుల్లటికంపు కొట్టింది.

అతడలా వెడుతూంటే నా నరాలన్నీ అదిరిపోయినట్టయింది.

ఆ కిటికీ దాటి పోయేడు. అతడిని నీలలోచని చూసింది. కాని చలించలేదు. అల్లానే పడుకుంది. అల్లానే చూస్తూంది. అతను తలుపులు తోసుకొని, ఆ యింట్లోకే వెళ్లేడు.

అతడామె కేమౌతాడు? ఎంత ఆలోచించినా యేమవడానికి ఆధారం దొరకడంలేదు. అన్న అనుకోడానికి అవకాశం లేదు. ఆమెను కన్న కడుపు అతడిని కనలేదు!

ఏమైతే నాకెందుకూ—అన్న అయితేనే మంచిది. ఏమీ కాకపోతే మరీ మంచిది. లేకపోతే నీలలోచిని భర్త యేదో పెద్ద ఆఫీసరై వుంటాడు. వీడతని డ్రైవరై వుండవచ్చు. ఏదో భోగట్టా చెప్పడానికి వచ్చివుంటాడు.

అని సమాధానం చెప్పుకొని, ఇంట్లోకి పోయా.

సముద్రం, లేచిపైకి దూకుతూ బెబ్బులి పెట్టిన గాండ్రింపువలె హోరుమంది.

అదేమిటి! అమ్మో!! ఎవరో యెవర్నో కొడ్తున్నారు! చితక బాదిచేస్తున్నారు!! ఎవరో స్త్రీ, రోదిస్తూంది బాధపడుతూ! ఎవడో మూర్ఖుడు వేధిస్తున్నాడు, బాధపెడుతూ!

అప్పుడు ఈదురుగాలి రేగింది రావిచెట్టు ఆకులు రెపరెపలాడిపోతున్నాయి చెరువునీటిలో నక్షత్రాలు కదిలి, చెదిరి, కరిగిపోతున్నాయి.

ప్రళయం వస్తుందా!!!

"ఆ!!!... అబ్బా!!" సుదీర్ఘంగా వుంది ఆ ఆక్రందనం.

గబగబ వీధిలోకి వెళ్ళా. ఆయింట్లోంచే ఆ వేదనాలాపన. ఆ కిటికీలోంచే మూలుగు.

చిటపట చినుకులు రాలుతున్నాయి కొలనిలో కలువరేకులు కన్నీరు కారుస్తున్నాయి.

వర్షం వెలిసింది. "కర్ కర్" మని బూట్లు చప్పుడు చేస్తూ, ఆ "డాంగిరీ" మొఱటుమనిషి ముత సూటు వేసుకొని సిగరెట్టు పీలుస్తూ విసురుగా వెళ్లిపోయేడు నా పక్కనుంచి నడుస్తూంటే పుల్లటి కంపుకొట్టింది. నా గుండెల్లో దడొచ్చింది.

అతడలా బూట్లు 'కర్ కర్' మని చప్పుడు చేసుకుంటూ దూరంగా వెళ్లిపోయి చీకటిలో కలిసిపోయేడు!

స్తంభంలా నిలబడ్డా. చిన్న దీపపు లేతవెలుతురు ఆ కిటికీలోంచి అగుపిస్తూంది. ఆమె అక్కడ పడుకుంది. అల్లాగే నిశ్చలంగా. ఆమె లేలేతనైన, విశాలమైన కనురెప్పలు ముడుచుకున్నాయి. తుమ్మెద రెక్కలవంటి కనురెప్పల వెంట్రుకలు నిగనిగ మెరుస్తున్నాయి. ఆ నీలలోచని నిశ్చలంగా, సమాధిలోని యోగిలా, ముంతాజ్ సమాధిలా, జాలినింపుతూ, జాలికోరుతూ, జాలిరూపు ధరించినట్టు పడుంది. నిద్ర, బాధ, బెంగ, దిగులు, నిరాశ ఆమె హృదయంపు అట్టడుగు అంతరాళం అనే కొలనిలో యేనుగుల్లా జొరబడి అల్లకల్లోలం చేస్తూంటే, అంచులు తాకిన పిల్లకెరటాలలా కనురెప్పలు, పెదవులు మెల్లగా కొట్టుకుంటున్నాయి.

నే నచేతనంగా నిలబడ్డా!

"ఏమలా దిస్సపోయి చూస్తున్నావు?"

నేను తృళ్ళిపడి ప్రక్కకు చూశా. నాలాడ్జి ప్రక్క సందులో వున్న గుడి పూజారి. నేను గాభరా పడ్డా. పూజారి నా కళ్ళలోకి దయగా చూశాడు. అతని పెదవిమీద చిరునవ్వు తురగలిస్తూంది. అతడు వానలో తడిసి వస్తున్నాడు. అతని పండు కనుబొమల నుంచి వాననీటి ముక్కలు రాలుతున్నాయి.

నిశిరాత్రి ప్రశాంతం. శివాలయంలోంచి గుడ్డి వెలుతురు మండపంమీద పడుతూంది అతడు నన్ను దయగా కూచోబెట్టేడు. నా కళ్ళకి అతడే శంకరుడి జటాముకుటంలోని చంద్రుడిలా మెరుస్తున్నాడు. నేను నీలలోచనిని గూర్చి యెన్నో ప్రశ్నలు వేశా ఆతురతతో.

'ఆమె యెల్లప్పుడూ ఆ కిటికీవద్ద అలా పడుంటుందేం? ఆమెకు జబ్బా? ఆమె విశాల నీలలోచనాలలా అపూర్వంగా మెరుస్తూంటాయేం?'

పూజారి యీ ప్రశ్నలకు సమాధానం చెప్ప దలచుకోలేదు. అన్నిటికి వొక చిరునవ్వు నవ్వేడు.

"ఆ మొఱటుమనిషి యెవడు? ఆమె కేమౌతాడు? బంధువుడు కాడనుకుంటా. ఆమె భర్త యేదో పెద్ద కంపెనీలో ఆఫీసరా? [illegible] వెళ్ళివుంటారు వీడు వాళ్ళ కారు డ్రైవరా? అయితే యిందాకా యెవడు యెవరిని కొట్టారు? ఆమెనే అయివుంటుంది. వీడే కొట్టాడా? డ్రైవరు కేం హక్కుంది?"

ఇదంతా నా స్వగతం కాదు. నేను పూజారిని అడిగిన ప్రశ్న పరంపర. వీటన్నిటికీ ప్రత్యేక సమాధానాల వివరం అనవసరం. అత్యావసరమైన, అతి దారుణమైన సత్యమైన విషయం ఆ మొఱటు మనిషి ఆ నీలలోచని భర్త!

పూజారి చెప్తున్నాడు

"వాడు కార్ఖానాలో పని చేస్తున్నాడు. వందలకు వందలార్జిస్తాడు. అంతా తాగుతాడు. వీధి కుక్కలకు పెడతాడు. తప్పతాగి చెడిపెల యిళ్ళంట తిరిగి తిరిగి, నిశిరాత్రి వస్తాడు. ఆ పిల్లని కసితీరా కొడతాడు. తన చేతులు నొప్పి పెట్టేవరకూ, తను అలిసిపోయేవరకూ హింసిస్తాడు. అలిసి శక్తిలేక పోతే ఎనుబోతులా పడుకుంటాడు. శక్తి యింకా మిగిలివుంటే తిరిగి ఊరిమీద వెళ్ళిపోతాడు."

నాకు వూపిరి సలపలేదు ఏమనాలో, ఏమను కోవాలో, యేమని వూహించాలో తెలియలేదు.

వాడికి దయలేదా? దాక్షిణ్యంలేదా? భార్య మీద ప్రేమ లేకపోతే పోయిరి, మానవ సహజమైన కరుణ లేదా?

తిరిగి యిది నా స్వగతం కాదు. నేను పూజారిని వేసిన ప్రశ్నలు. అతడి జవాబు పిడుగువంటిది.

"వాడికి వొక కూతురుంది!"

"ఏమిటీ!!! ఎక్కడ?"

"నాదగ్గిర. ఓనాడు వాడు భార్యను మాటలతో చెప్పలేనంత క్రూరంగా హింసించేడు. చిన్నపిల్ల దవడమీదకూడా వరుసగా ఛెళ్ళుఛెళ్ళున వేశాడు. ఈ దారుణం యెంతకాలం చూడడం? చూస్తూ ఎంత వరకూ వోర్చడం?

ఇంట్లోకి వెళ్ళి పిలను వొళ్ళోకి తీసుకున్నా. భయంతో ఆపిల్ల నా వొళ్ళో దూరి, మొహం దాచుకుని వెక్కుతూంది. నావేపు వాడు వురిమిచూశాడు. ఆ పిల్లను నాకు యిచ్చేయమని, నేను పెంచుకుంటానని వాడిని బ్రతిమాలా. వాడు "తీసుకుపో!" అని నిర్లక్ష్యంగా

తల్లి నావెంపు జాలిగా చూసింది. ఆమె నోటంట నెత్తురు కారుతూంది ఆమెతో మాట్లాడడానికి పరిస్థితి యేమీ అనుకూలంగా లేదు. ఆమెలోని మాతృవాత్సల్యం గాని, నేనామెకు పిల్లవిషయంలో యివ్వబోయే భరవసా గని, మాటలరూపు ధరించడానికి అది సమయం కాదు.

చెదిరిపోయిన పిల్ల కురులు సరిదిద్ది, దానిని నా గుండెలకు హత్తుకొని, ముద్దిడి వెనుదిరిగా. నేను వెళ్ళిపోయేక వాడామెను తిరిగి కొట్టేడు. తల్లి ఆక్రందనం వినిపిస్తూంటే, నా వొళ్ళో పిల్ల గజగజ వొణికిపోయింది."

పొంగుతూన్న కెరటాన్ని మ్రింగివేయడానికో అన్నట్టు దెయ్యంలా వొక కారుమేఘం చరచర క్రిందకు దిగుతూంది పూజారి ఆ విషయం చెప్తూన్నప్పుడున్న అతని మనఃప్రవృత్తి జ్ఞప్తికి వచ్చింది.

"నిద్రాణంగా పడివున్న యేదో అనుభూతి శకలం నా గుండెల్లో చైతన్యం పొందుతూంది. అబ్బ! ఎవరు వీళ్ళు! వీళ్ళెందుకిలా బాధపడుతున్నారు! నన్నెందుకిలా బాధపెడుతున్నారు!" పించింది నా వ్యథిత హృదయంలో.

"పూజారీ! వీళ్ల సంగతి నీకు పూర్తిగా తెలిసినట్టుంది. ఆ నీలలోచని......అంటే ఆ కిటికీలోంచి చూపించే నిర్భాగ్యురాలు యెవరు? ఆ పిల్లకి తలిదండ్రులున్నారా?"

"ఆ కిటికీలోంచి చూపించే అమ్మాయి కర్మను అనుభవిస్తూన్న అనంతకోటి జీవరాసులలో ఒకతె. ఆ కిటికీల్లోంచి అవుపించే యే జీవి అయినా అంతే..."

"కాదు తండ్రీ! నా కామె ఆ కిటికీలోంచే మరోలా చూపిస్తూంది. సమాజం యిచ్చిన అన్యాయపు తీర్పు ప్రకారం అనౌసరంగా శిక్ష అనుభవిస్తూన్న నిర్భాగ్యపు ఖైదీ!"

"నువ్వు కవిత్వం చెప్తున్నావు. జీవితం కవిత్వం కాదు. జీవితం ఒక అప్పువంటిది. మనమీ ప్రపంచానికి బాకీపడ్డాం. ఆ బాకీ తీర్చటంలో కించిత్తైనా విసుగు విరామం లేకుండా పనిచేసి, తిరిగి ప్రపంచంలో బాకీ తీర్చేపద్ధతి రాకుండా చూసుకోవాలి."

అప్పటినుంచీ నాకు పూజారితో మంచి స్నేహం యేర్పడింది. నీలలోచని కూతుర్ని చూశా. ముమ్మూర్తులా నీలలోచనే!

మొదటిసారి ఆపిల్ల నన్ను చూసి భయంచేత పూజారి సందిట్లోకి దూరింది. ఆ పిల్లకి మగాళ్ళని చూస్తే భయం. ఒక్క పూజారే దయగలవాడని దాని నమ్మకం. తదితర పురుషులందరూ తన తండ్రికిమల్లే నే రాక్షసులని ఆమె భయం!

ఆ పిల్ల కళ్లు అచ్చంగా నీలలోచని కళ్ళల్లాగే విశాలంగా వుంటాయి. కాని అవి తరుచు బెదురుతూంటాయి. ఆ పసి గుండెల్లో లోకం అంటే భీతి వున్నదే కాని, అంటే యింకా విర లేదు.

అది వేసవికాలం. వెన్నెలరాత్రి. నా పెరట్లో చిన్న ఆరామం వుంది. దాంట్లో ఒక మంచం వేసుకుని, తలగడెనూత్రెం తలక్రింద పెట్టుగుని పడుకున్నా.

రెండురోజుల క్రితం ఆ మోటుమనిషి నీలలోచనిని క్రూరంగా హింసించాడు. ఆ నిస్సహాయురాలు బాధ భరించలేనప్పుడల్లా ఆర్తారవాలు చేసిందిగాని, వొక్క యెదురుమాట చెప్పలేదు. దెబ్బలు ఆపుకుందికైనా ప్రయత్నించలేదు. ఆ ఆలోచనతో నాతల వేడెక్కి అంతవరకూ బాధపడ్డా. అప్పుడే వీస్తూన్న మలయ పవనాలకి, చక్కని తెలుపు వెన్నెల చల్లదనానికి నా మనసు కొద్దిగా స్థిమితపడింది.

"నన్ను మీరు చూస్తూ వుపేక్ష చేస్తున్నారా? నే పడుతున్న యాతన మీ మనసును కరిగించలేదా?"

నే నులిక్కిపడ్డా. పెద్దైన ముంగురు నలని నొక్కునొక్కుల కురులు. కలువరేకులవంటి కళ్లు. పాలిపోయి చిక్కిపోయిన చెక్కిలు—ఒణికే సన్నని పెదవులు. అందం, జాలి, బాధ ఆకృతిగొన్న నీలలోచని!

"నా యెముకలన్నీ పొడై, నొప్పు లెకుతున్నాయి. నాకీ నరకకూపంలోంచి ము ప్రసాదించరా?"

"నేనా!!!" తిరిగి త్రుళ్ళిపడ్డా. తెలివొచ్చింది. చిన్నకల—తిరిగి తల వేడెక్కొచ్చింది. లేచి మంచంమీద కూర్చున్నా.

"నే నామెను రక్షించగలనా" నాలో నేను తీవ్రంగా ప్రశ్నించుకున్నా.

"ఏం చెయ్యాలి? వాడిని అదుపులోకి తీసుకురావాలి"

"అమ్మో! వాడి నే!"

నా దండెలు చూసుకున్నా. వాడిపోయిన పొట్లకాయలులా వున్నాయి.

"వాడి దండలో! వస్తావ సంగిడీ తిప్పుతాడు కామోసు. వుక్కు ముక్కలూ, దుక్క ముక్కలూ! వాడు కలబడితే అంతే దిక్కూ మొక్కూ లేకుండా పోతా.

"అయితే నే నిలా ఆమరణనరకం అనుభవించవలసిందేనా? ఇదే నాకు దేవుడు వ్రాసిపెట్టాడా." అన్నట్టయిందామె!

నేను దీర్ఘంగా నిశ్వసించా. "హుం! అలా యెన్నటికీ జరగదు."

"అయితే నన్ను రక్షించండి!" ఆమె కళ్లలో కన్నీళ్లు తొణికిసలాడినట్టయింది.

నా వూహాప్రపంచంలో, ఏదో వొక మహాసముద్రపు టొడ్డున ఎత్తుగా లేచివకొండ అంచుకు గొలుసులతో బంధింపబడిన "ఏండ్రోమెడా" అవుపిస్తూంది. ఆమెయే యీ నీలలోచని. ఇక గడియకో గంటకో సముద్రపు రాక్షసి భీకరాకారంతో వస్తుంది!

వెంటనే నాలో నెత్తురు వేడెక్కింది. నా రక్త నాళాలు స్పందించ జొచ్చేయి. నా దండలు తిరిగి పెరిగాయి. నా ఛాతీకూడా పొంగుతూంది.

లాస్ ఎతినీ!" అని పిడికిలితో గుండెల మీద గుద్దుకున్నా. ధైర్యంగానే వున్నాను గాని కొంచెం నొప్పెట్టింది. ఊపిరి తిరగలేదు. లేచి రెండు మూడు అడుగులు పచారు చేసి నెపోలియన్‌లా నిలబడి, చంద్రుడికేసి తల త్రిప్పి "పెర్సియస్! నాలో ఆవహించు" అన్నా. "నీ ఏండ్రొమెడాను సముద్ర రాక్షసి నుంచి నువ్వు రక్షించుకున్నట్లు, నీలలోచని అనే ఏండ్రొమెడాను, యీ మొఱటు రాక్షసుడి బారినుండి రక్షించే శక్తిని నాలోకి ప్రవహింప చెయ్యి" అని కుడిచెయ్యి పైకెత్తా!

అప్పుడే ఒక గుడ్లగూబ అరిచింది. ఆ నడిరేయి నిశ్శబ్దంలో నా మనసు కలవరపడింది. మరి నాకు నిద్రపట్టలేదు.

నా నీలలోచని ఏం చేస్తోందో! నా వెఱ్ఱి నీలలోచని పడుకుంది కామోసు! ఏమీ యెరగదు. వట్టి వెఱ్ఱిబాగులది! వట్టి ఏండ్రొమెడా! నేనొక పెర్సియస్ నిక్కడే అప్పుడే తయారయ్యానని యేలా వూహించుకుంటుంది!

ఆ రాత్రి రెండు గంటలవేళ, వెళ్ళి వీధిలో నుంచున్నా. నేనొక సమున్నతమైన కాంస్య విగ్రహాన్ని.

ఎవరో చప్పుడు! కర్! కర్! కర్ కర్! బూట్ల చప్పుడు. అదే అదే! బూట్ల [illegible]డి నలుగుతూన్న యిసుక రేణువుల వేదనా నిశ్వాసాలు!! కర్ కర్! వాడే! వాడే! సముద్రరాక్షసుడు. కాని నా ముందర బంగాదూర్! నా కాళ్ళకి సజీవాలైన రెక్కల జోళ్ళున్నాయి! (నిజానికసలు జోళ్ళే లేవు) నే నెగిరానంటే నా కాళ్ళకిందకు వస్తాడా సముద్ర రాక్షసుడు!! రా! రా! ఈ రేయి నీ ఆయువు సరి.

వాడు నా ప్రక్కనుంచే వెళ్లేడు. నిర్లక్ష్యంగా వెళ్లేడు. రాసుకుంటూ మరీ వెళ్లేడు. తిప్ప త్రాగివస్తున్నాడు. "రాస్కెల్! నీకు నాలాగు యిన్నాళ్లూ గూబ సంయ్ మనేలా వేసేవాడు లేకపోయేడు!"

అనుకుంటున్నా—ఆవేశం వస్తోంది. వాడు దగ్గరకు వచ్చినప్పుడు 'గుంయ్' మన్నమాట ప్రమాదవశాత్తూ బైటకొచ్చేసింది కామోసు, హఠాత్తుగా వాడు నా వేపు తిరిగి, ఒక వషట్కారం చేసి నిర్లక్ష్యంగా పోయేడు.

వాడు నా వేపు చూడగానే నా కాళ్లు వణకేయి. గుండెలలో గుబగుబ బయల్దేరింది. నేను కాంస్య విగ్రహాన్ని కాను. అంత ఎత్తు లేను వాడే నాకంటె చాలా పొడుగ్గా వున్నాడు ఆపళంగా తంతే వలసిందే నేను పల్లాస్ ఎతినీ కూడా అడ్డుపడలేదు. నేనుకూడా నీలలోచనిలా నిస్సహాయంగా పడివుండవలసిందే! వాడి దండలు వుక్కు ముక్కలు దుక్క ముక్కలు!!

ఒక అరగంటకాలం అలా వీధిలోనే పచారు చేశా. వాడు నీలలోచనిని కొట్టినట్టు లేదు. ఇవాళ తన కార్యక్రమం మార్చుకున్నాడా? లేక వాడు నా ప్రక్కనుంచి వెళ్ళినప్పుడు నాలోని జ [illegible] అప్రయత్నంగా వాడిలోకి ప్రసారితమయిందా

"అలా కొట్టకూడదు నాయనా! మనిషంత మనిషివీ అలా చెయ్యి చేసుకోరాదు. ఆమె నీ భార్య! స్త్రీ—అబల! నిస్సహాయురాలు!! కొట్టొచ్చా?"

అని నా నేను బుద్ధులు చెప్పుకుంటున్నా మనసులోనే!

"ఆ......!" ఎంత కేక!!

"ఆ! ఆ! ఆ!...... ఎంత బాధ!!! ఎన్ని దెబ్బలు! అయ్యో! అయ్యో! వెధవ చంపేస్తాడో యేమో! అయ్యయ్యో! నేను వినలేను! నేను పెర్సియస్‌ను కాను, పల్లాస్ ఎతినీ నాకు ఎందుకు సాయం చేస్తుంది? నేను ఏండ్రొమెడాను రక్షించలేను బాబో!

ఇంట్లోకి పారిపోయా! భయంవేసి వెంటనే నిద్రపోయా. వాడు నీలలోచనిని కొడుతూన్న వొక్కొక్క దెబ్బ నా గుండెల్లో తగులుతూంది. కాని నేనేం చెయ్యను. ఆ విషయంలో ఆమెకంటె నేనేం ఘనుడిని కాను.

ఈ హింస అతనికి పరిపాటి! ఈ బాధ ఆమెకు అలవాటు. ఈ అనంత నాటకంలో, ఈ భయంకర ఛద్మవేషి నిజస్వరూపం యేది అని నా నిత్యసమస్య! ఈ పరమరహస్యం అభేద్యం—ఈ క్రౌర్య ప్రత్యక్షం అమానుషం......

నిన్నటికి సంవత్సరం క్రిందటి మాట యిది. నిన్న రాత్రి అదే ఘట్టం—కాదు అంతకన్న ఘోరమయిన ఘట్టం!

తెల్లవారుఝామున నాలుగు గంటల వేళయింది. బాగా కొరుమబ్బు వేసింది. వాతావరణం హటాత్తుగా చల్లబడిపోయింది. ఉండివుండి వాన జల్లుజల్లుగా పడుతూంది.

దుర్దినాగమన సూచకంగా వుంది. సముద్రపు హోరు మరణదేవత భయంకర రాహ్వానంలా విన వస్తూంది. ఆరు గంటలైనా పిట్టలు లేవలేదు. పొద్దు పొడవలేదు. చలిచలిగా వుంది.

వీధిలోకి వెళ్ళా. వీధి నిర్మానుష్యంగా వుంది. అక్కడ నిశ్శబ్దదేవత పరిపాలిస్తూంది.

ఆ కిటికీదగ్గరకు వెళ్ళా. నీలలోచని అలాగే పడుకుని వుంది. ఆమె చూడడం లేదు. ఏమలా పడుంది? ఊపిరి తీస్తోందా? అనుమానం వేసింది. కిటికీ చువ్వల దగ్గరగా వెళ్లి, తేరిపార చూశా. ఆమె తల పగిలింది. నెత్తురు ప్రవహించింది కొమ్మోసు గడ్డకట్టింది. నీలలోచని వూపిరి తియ్యటంలేదు! నీలలోచని లేదు!!

తలమీద పిడుగుపడ్డట్టయింది. శరీరం కంపించింది. దృష్టి మందగించింది. పరుగెత్తా పూజారి దగ్గరకు......'

అతడు మతిపోయి సముద్రం కేసి పరాగ్గా చూస్తున్నాడు. ఏంద్రో మేడాని ప్రమింగడానికి వస్తూన్న రాక్షసిలా, యముని మహిషంలా వొక పెద్ద కెరటం లేచివస్తూంది. రాక్షసి వచ్చింది. ఏంద్రో మేడాను ప్రమింగింది. మునిగిపోయింది. అసంభవం జరిగింది. అన్యాయం జయించింది!

"ఎంత దారుణమయ్యా పూజారీ! ఎంత అన్యాయం! నీలలోచని మరిలేదు. ఆమె వెళ్లిపోయింది."

నేనెంత విలపిస్తే యేంలాభం. పూజారి గుండె బేజారౌతుందనుకున్నా. నీలలోచని కూతుర్ని మాత్రం సందిట్లోకి తీసుకొని, తల నిమిరి, పది సెకండ్లపాటు తీవ్రత వహించేడు.

పూజారి ఆ పిల్లని నాకు వొప్పజెప్పి నీలలోచని భౌతిక శరీరాన్ని అగ్నికి నైవేద్యం పెట్టడానికి వెళ్ళేడు.

అతడు తిరిగివచ్చేక నీలలోచని పూర్వకథ చెప్పమని ప్రతిమాలా.

"చెప్తా నాయనా! ఇక చెప్పకేం! ఇక నే అభ్యంతరంలేదు. నేనీ చరిత్ర అతిరహస్యంగా దాచి వుంచుతానని యెవరికి మాటయిచ్చేనో వారు మాట యిచ్చిన మరుక్షణంలో కళ్ళుమూసేరు. తన చెలి పడ్డ దురవస్థ తెలిసి దుఃఖించడానికి నేను యీ సిలకూడా లేను. కానైతే—ఆ జగన్నాటక కర్త ఆడించే యీ మహానాటకంలో రెండు విషాదాంకాలు చూచే ప్రేక్షకత్వమబ్బింది నాకు. భగవల్లీలాసం యెంత అనాది, అనంతమో, అంత అనూహ్యం కూడా."

నేను కన్నీళ్ళతో వింటున్నా.

"సుమారు యిరవైసంవత్సరాల క్రితం నా తండ్రి అస్తికలు నిమజ్జనం చెయ్యడానికి వొక పుణ్యనదీ తీర ప్రదేశానికివెళ్లా. రైలు పూర్తిగా సమీపిస్తుండగా వాతావరణం వర్షాగమన సూచకంగా మారింది.

ఊళ్ళో యెలా దిగానో, నదీ తీరాన వున్న సత్రంలో యెలా ప్రవేశించానో ఆ దేవుడికే తెలుసు. కుంభవృష్టి పడుతూంది. తండ్రి తెలిసినవారెవరనీ కనక యితరుల సహాయం అక్కరలేకుండా పని నెరవేర్చా. హోరని వానపడుతూంటే, గంగాలా పరుగులు తీసే నదీమతల్లి కడుపులో తండ్రి అస్తిక సహిత శేషం కలిపి, నా విధి నెరవేర్చా

తుండుధారగా పడుతూన్న ఆ వానలో యింటి ముఖం పట్టడం ప్రమాదకరం అని ఆ సత్రంలోనే రాత్రికి వుండిపోయా. వాన నిముష నిముషానికి హెచ్చిపోతూ, గాలి వానగా మారింది.

కటిక చీకటి—హోరని వాన. ప్రళయ గర్జనా పర్జన్యాలు గర్జిస్తూ విచ్చలవిడిగా ఆ ప్రాంతమంతా దాడి చేస్తున్నాయి మెరుపు లుంకుంచె మెరిసి కళ్లు మిరుమిట్లు గొలుపుతున్నాయి నరసంచారం యెప్పుడో ఆగిందని వేరే చెప్పక్కరలేదు లెగుచు, యెక్కడో యేవో కూలిపోయిన శబ్దాలు వినిపిస్తున్నాయి. ఎక్కడో తలుపులు, కిటికీలు ఫెడీలు ఫెడీల్న కొట్టుకుంటున్నాయి.

ఇంతలో నేనున్న గది తలుపు శబ్దమయింది. తెరచా అప్పుడు నా గదిలోకి ఒక కుఱ్ఱవాడు ప్రవేశించాడు.

'ఆ! కుఱ్ఱవాడా! నా గుండెల్లో యేదో ప్రణకిణాంకం చెక్కలింపబడింది. నేను కన్నీళ్ళు తుడుచుకొని, కృంగిపోతూన్న ధైర్యాన్ని కూడదీసుకొని శ్రద్ధగా వింటున్నా.

"జౌను సుమారు యెనిమిదేళ్ళుంటాయి..."

"ఆ.. నువ్వేనా.. ఆ ప్రళయరాత్రి.. ఆశ్చా ...ఏదో గుచ్చుకుంది ..బల్లెంలా...గుండెల్లో."

# ఆంధ్రాది పదాల ఆవిష్కరణ

ప్రొ॥ రేకుమళ్ల కామేశ్వరరావు

ఏ దేశంలోనైనా చిన్న చిన్న ప్రదేశాలకు, ప్రాంతాలకు పేర్లుంటాయి. ఆదికాలంలో ఆ ప్రాంతాలలో స్థిరంగా ఉండిన ప్రజల తాలూకు వారు ఇప్పటికీ తాము ఆయా స్థలాలకు చెందిన వారమని చెప్పుకొంటారు. ఇటువంటివారు కొందరు—వేగినాటివారు, పలనాటివారు, పాకనాటివారు, ములకనాటివారు మొదలైనవారు. ప్రాంతాలనే తెలుగు భాషలో 'నాడ్లు' అన్నారు.

తెలుగుదేశంలో 'నాడ్లు' కొల్లలుగా ఉన్నాయి. వాటిలోకొన్ని—

1 పాకనాడు 2 పొలకనాడు 3 బెడగనాడు 4 [illegible] 5 [illegible] 6 ములకనాడు 7 కళింగనాడు 8 కొలనునాడు 9 తెలుగునాడు (తెలగాణ్యులు) 10 సబ్బినాడు 11 వెలనాడు 12 వేంగినాడు 13 వేగినాడు 14 కమ్మనాడు 15 ఇంగనాడు 16 ఇమ్మడినాడు 17 తిరుమునాడు 18 తిరువలినాడు 19 తిరునారాయణనాడు 20 పన్నాడు 21 వేగన్నాడు 22 పోన్నాడు.[1]

సాంఘికచరిత్ర కాని, భాషాచరిత్ర కాని వ్రాయదలచినవారు ఉన్న నాడ్ల పేర్లను సరిగా తెలుసుకోగలిగితే అనేక సమస్యలు తీరతాయి. నాడ్లకు, అక్కడ ఉండిన తెగలకు, వారి భాషలకు ఎంతో సంబంధముంది. దాని నిక్కడ కొంచెంగా వివరిస్తాను.

మన దేశంలో ఎప్పుడూ ఒకే జాతివారున్నారని భావించరాదు. కొత్తకొత్త జాతులవారు వచ్చి వెనకటి వారిని పాలిస్తూండేవారు. ఇట్లాగే మొన్నటి దాకా జరిగింది. ఆఖరున ఈ దేశానికివచ్చి పరిపాలించినవారు ఇంగ్లజాతివారు.

క్రీస్తు పూర్వం తెలుగువారిమీద ఆర్య ప్రభావం ఇంకా కలుగక పూర్వం పైశాచీ జాతివారి ప్రభావ ముండేది. కాని దానికి పూర్వస్థితిని కొంచెంగా తెలుసుకోవలసుంది.

## వెనుకటి తెగలు

పైశాచిక జాతివారు దక్షిణ హిందూదేశానికి రాకపూర్వం ఇప్పటి తెలుగు ప్రదేశంలో ఏయే తెగలవారు ఉండేవారు? ఈ తెగలకు పేర్లు, వాళ్లు పూజించే దేవుళ్ళనుబట్టి వచ్చేవని చెప్పవచ్చు. అప్పుడు అక్కడి కొన్ని ప్రధానమైన దేవుళ్లు, తెగలు ఈ కిందివారు: తిరులింగాన్ని (ఇప్పటి మల్లికార్జున స్వామిని) పూజచేసే లింగ తెగ, తిరునాగుణ్ణి (అనగా, నాగార్జునుణ్ణి) పూజచేసే నాగ తెగ, తిరుమల (అనగా, ఇప్పటి వేంకటేశ్వర స్వామిని పూజచేసే ఒక తెగ), తిరుకళింగుణ్ణి పూజ చేసే కాళింగ తెగవారు, ఇట్లే మరికొన్ని ఉండేవని చెప్పవచ్చు. ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క 'తిరు' దేవుడు ఉండేవాడు. ఆయననుబట్టి అక్కడి తెగకు, వారి భాషకు పేరు వచ్చేదని చెప్పవచ్చు. ఈ 'తిరు' నామాలు ఇప్పటికి కొన్ని నాడ్ల పేర్లలో మిగిలిపోయేయి. తక్కిన కొన్నిటిలో ఇతర కారణాల వల్ల జారిపోయేయి, లేక పేరే మారిపోయి ఇంకొక పేరు ఏర్పడిఉండవచ్చు. ఈ వ్యాసం మొదటిలో తెలియజేసిన నాడ్ల జాబితాలో 'తిరు' కలిగినవి ఈ క్రిందిపేర్లు ఉన్నాయి—తిరుమునాడు, తిరువలినాడు, తిరునారాయణనాడు. పరిశోధన చేసినకొద్దీ మరికొన్ని పూర్వపు నాడ్లు తెలుస్తాయి. అట్టి పరిశోధన అవసరం. తెలుగుదేశానికి సంబంధించిన ఒక పేరును గురించి ఇక్కడ చూస్తాం.

## ఆంధ్ర మొదలైనవి

ఐతరేయ బ్రాహ్మణం, మహాభారతం, ప్లినీ అను విదేశీ యాత్రీకుని వ్రాత, పల్లవరాజైన శివస్కందవర్మ శాసనం మొదలైనవాటినిబట్టి ఆంధ్ర

---

1 చిలుకూరి వీరభద్రరావుగారి ఆంధ్రులచరిత్ర, మొదటిభాగం, పుట 35.

శబ్దం కొంతవరకు తెలుస్తూంది. క్రీ. శ. 777 దైన 'కువలయమాల'2 అను ప్రాకృత కావ్యంలో 'ఆంధ్ర భాష' అను పేరు ఉంది నన్నెచోడ దేవకవి (క్రీ. శ. 860 ప్రాంతం) 'అంధ్ర విషయంబున' అని వాడేను. ఎక్కడున్నా మనం పరిశీలించవలసిన విషయ మొక్కటి. ఆ పదం 'అంధ్ర'మా, లేక 'ఆంధ్ర'మా?

ప్రాచీనకాలంలో 'అంధ్ర' అనుమాట కొంచెం స్థలాన్నే సూచించగా, అటుతర్వాతి కాలంలో దాని అర్థం విస్తరించి, తెలుగుదేశానికంతకీ నామంఅయింది.

'అంధ్ర—ఆంధ్ర' అనేమాటల అర్థాలు పూర్వ కాలంలో ఒకటి కావు. 'అంధ్ర'3 అనునది దేశ నామం. ఆ కాలంలో పుట్టిన జనులు 'ఆంధ్రులు.' 'అంధ్ర' అనేది జనకుడు (*Parent*) కాగా, 'ఆంధ్రులు' సంతాన మౌతారు. ఈ రెండు మాటలను ఉండే సంబంధాన్ని 'జనక—జన్య' సంబంధం అందాం. ఇట్టి సంబంధాన్ని సూచించే పదాలు కొన్ని—

| | |
|---|---|
| వసుదేవ | వాసుదేవ |
| గంగ | గాంగేయ |
| మురా | మౌర్య |
| కుంతి | కౌంతేయ |
| — | జాహ్నవేయ |

ఈ క్రమంలోనే కొన్ని దేశపు పేర్లు, అందలి ప్రజల పేర్లు ఏర్పడ్డాయి అట్టివే 'అంధ్ర' 'ఆంధ్ర' పదాలు కాబట్టే మన వాఙ్మయంలో ప్రారంభంలో 'అంధ్ర' 'ఆంధ్ర' పదాలు ఎక్కడవచ్చినా పై అర్థాలలోనే గ్రహించుకోవాలి. ఇట్టి పదాలు ఇంకా ఉన్నాయి.

| ప్రాంతం పేరు | అక్కడి ప్రజ పేరు |
|---|---|
| ద్రవిడ | ద్రావిడ |
| కళింగ | కాళింగ |
| వేంగి | వైంగీయక |
| త్రిలింగ | త్రైలింగ |

పై దంతా సంస్కృత భాషాలక్షణమే అని మనం తలవరాదు. వారికంటె పూర్వమే దక్షిణ దేశంలో స్థిరపడిన పైశాచీజనుల ప్రాకృత భాషా లక్షణాన్ని అనుసరించి కొంతవరకు పై రూపాలు వచ్చేయి.

ఆ కాలంలో కొన్ని కుటుంబ నామాలను ఏర్పాటు చేసుకోడంలోనూ పై సూత్రమే అనుసరించ బడింది—

| తొలిమాట | అందుండి వచ్చిన కుటుంబనామం |
|---|---|
| అంధ్ర | ఆంధ్ర |
| సతవాహన | సాతవాహన |
| ఇక్ష్వాక | ఐక్ష్వాక |
| విష్ణుకుం | విష్ణుకుండిన |
| చలుక | చాళుక్య |

పూర్వకాలంలో పరిపాలించిన కొన్ని రాజ కుటుంబాలవారు అసలు పేరుకి చివర 'గోత్రం' అని చేర్చి కొనేవారు. సంబంధాన్ని తెలియజేయడానికి ఇదొక మార్గం.

| మూలపదం | కుటుంబనామం |
|---|---|
| బృహత్ఫలాయన | బృహత్ఫలాయనగోత్ర |
| సాలంకాయన | సాలంకాయనగోత్ర |

క్రీస్తుశక ప్రాంతాలలో ప్రాకృత భాషలలో 'స' కి 'శ' కి భేదాన్ని కొన్నిటిలో పాటించేవారు కారు. కాబట్టి ఈ కిందిరూపాలు కనబడుతూంటాయి.

| | |
|---|---|
| సాతవాహన | శాతవాహన |
| సాలంకాయన | శాలంకాయన |

కొన్ని దేశీయపదాలను తమ భాషలోకి గ్రహించి, తమ మాటవలెనే వ్యాకరణ రూపాలను సాధించేవారు.

| దేశీయ పదం | సంస్కృతీకృతపదం |
|---|---|
| త్రిలింగ | త్రైలింగ |
| వేంగి | వైంగీయక |

పైన చెప్పినపదాల వ్యుత్పత్తి, మరికొన్ని పదాల వ్యుత్పత్తియును తెలియజేస్తాను. అప్పుడు పై మాటలయొక్క అర్థాలు విశదమౌతాయి. ప్రాచీన కాలంలో పరిపాలించిన అనేక రాజవంశాల ప్రారంభాలను ఈవిధంగా తెలుసుకోవచ్చు

2 గిడుగు రామమూర్తి పంతులుగారి స్మారక వ్యాససంగ్రహము, పుటలు 189—91.

3. భావరాజు వెంకటకృష్ణారావుగారు *Early Dynasties of Andhra Desa* అను తమ పుస్తకంలో అంధ్రపదాన్ని కొంతవరకు వాడేరు.

## పథము

తెలుగుభాషలో 'బాట' అను మాటకు ప్రాకృతంలో 'పథము'[4] అని పేరు. ఇది ఉన్నటువంటి మాటలు చాల ఉన్నాయి—

అంధ్ర పథము
కళింగ పథము
త్రిలింగ పథము
ఉత్తరా పథము
ప్రతిష్ఠాన పథము[5]
దక్షిణా పథము

[పథము అనుమాట ఇప్పటికీ తెలుగులో వాడుకలో ఉంది ఘంటాపథము=రాజబాట. ఈ పేరు ఎందుకు వచ్చిందంటే—రాజుగారి ఏనుగులు ఘంటలు వాయించుకొంటూ ఆ దారిని వెళతాయి కనుక. చూ. శబ్దార్థ నిఘంటువు]

పైన చెప్పిన మాటలలో ఇక్కడ అవసరమైనవి మూడు మాటలు. అవేవంటే—అంధ్ర, త్రిలింగ, కళింగ. వీటికి సంబంధించిన పథాలయొక్క ఎల్లలను ఇవన్నీ స్థలాలను తెలియజేసే భూగోళ శాస్త్రీయ పదాలు.

(1) అంధ్ర :—ఇది ప్రారంభంలో ఇప్పటి గోదావరి, కృష్ణ, గుంటూరు జిల్లాలున్న ప్రదేశానికి మాత్రమే పేరు. ఈమాట వ్యుత్పత్తినిగురించి తర్వాత విచారిద్దాం.

(2) కళింగ :—ఇదొక దేశీయపదం. పైన చెప్పిన అంధ్రదేశానికి, ఉత్తరంగా మహేంద్రగిరి దాకఉన్న ప్రదేశానికి 'కళింగ' అని పేరు. త్రిలింగ, త్రికళింగ మొదలైన పదాలలాగు ఇది ఆదిలో త్రికళింగ పదం మాత్రమే! కాని 'త్రి' ఎట్లా ఏర్పడిందో తెలియని కాలంలో దీనికి 'మూడు' అనే అర్థం పుట్టింది.

ప్లీని అను విదేశయాత్రీకుడు క్రీ. శ. 77 లో ఈ స్థలాన్ని 'మొడోకలింగ' అని పేర్కొన్నాడు. మన చరిత్రకారులు పై పదానికి 'మధ్య కళింగం'[6] అని అర్థమే ఉంటుందని భావిస్తున్నారు. కాని అది పొరపాటు 'త్రి' అంటే తెలుగుభాషలో 'మూడు' కదా!

త్రి కలింగ = మూడు కలింగ

'మూడు కలింగ' అను మాటను ప్లీని గ్రంథకర్త మొడోకలింగ అని వ్రాసుకొన్నాడు. ఎవరో పండితుడు 'త్రికలింగ' అను మాటను 'మూడు కలింగ' అని అనువదించి పీనీకి అందజేయగా అట్లు గ్రంథస్థమయింది ఇప్పుడు ఈ మాటవల్ల మనకు అనేక సంగతులు విశదమవుతున్నాయి.

(1) త్రికలింగ అను రూపం క్రీ శ 77 నాటికే ఉంది. (2) 'త్రికలింగ' అను పదం తెలుగు మాట కాదు అనే భావం అప్పటికే ఏర్పడింది. (3) త్రి అంటే మూడు అని అర్థం (4) తెలుగుభాషలో 'మూడు' అను రూపం క్రీ శ 77 నాటికే ఉంది. మూడు అనేది అక్షరాలలో ఎట్లు వ్రాయబడ్డా దాని ఉచ్చారణ నేడు ఎట్లు ఉందో, నాడూ అలాగే ఉంది. మూడు అను మాటకు ఇప్పటికి దొరికిననాటిలో మొదటి ప్రయోగం క్రీ శ. 77 నాటిదైన ప్లినీగ్రంథంలోది.

ఈ 'త్రి'శబ్దం ఎట్లా పుట్టిందో, దాని మొదటి అర్థ మేమిటో, అది ఎట్లెట్లా మారుతూ వచ్చిందో, ఇటుతర్వాత చూద్దాం.

(3) త్రిలింగ:—ఈ పదాన్నిగురించి ఇక్కడ ప్రత్యేకంగా చర్చించవలసివుంది.

## త్రిలింగ

త్రిలింగ పదం చాల ప్రాచీన పదమే కాని ఇటీవలిది కాదు క్రీ. శ. 77 ప్రాంతంలో ప్లినీ అను విదేశీయుడు తన రచనలో 'త్రిలింగాణ్' 'త్రిగ్లిపాణ్' అను పదాలను పేర్కొన్నాడు. బర్మాను పాలించిన త్రైలింగరాజులు 'త్రిలింగ' సంబంధంగలవారే! త్రిలింగ అను మాట సంస్కృతి మార్కండేయ పురాణంలో[7] ఉంది. త్రిలింగ అంటే మూడు లింగాలు అనే భావం ఇటీవలి వారిలో ఉంది కాని ఆ అర్థంలో పూర్వగ్రంథాలలో చెప్పబడలేదు మూడు కళింగ (మోడోకలింగ) అను పదసంపుటి క్రీ శ. 77 నాటికే ఉంది కాబట్టి 'త్రిలింగ' అంటే 'మూడు లింగాలు' అనే భావంకూడ అప్పటికే ఉండి ఉండవచ్చు. కాని

---

4 ప్రాచీన దక్షిణ దేశీయభాషలలో 'కణ' అనేది ప్రదేశాన్ని తెలియజేసే మాట అని తోస్తూంది. ఉదా:- కొంకణ, తెలంగాణ, కొంకణ.

5 *Early History of the Andhra Coutry by K. Gopalachari P 7, 24.*

6. 'మధు కళింగ' అను మాటకూడ మరొకటుంది. కళింగదేశము—ఉత్కళింగ, మధుకళింగ, కళింగ అను మూడు భాగాలను సూచిస్తుంది. చూ. కళింగ దేశచరిత్ర—రాళ్ళబండి సుబ్బారావుగారు, పుటలు 430—36.

మూడు లింగాలు అనే భావం ఉందని స్పష్టంగా తెలియజేసిన అతను ప్రతాపరుద్రీయ (సంస్కృత) కావ్య కర్తయైన విద్యానాథుడు క్రీ. శ. 1300 ప్రాంతం. ఈ త్రిలింగాలూ శ్రీశైలం, దాక్షారామం, కాళేశం అని తెలియజేసేడు. శ్రీశైలం కర్నూలు జిల్లాలోది దాక్షారామం గురించి పేచీలున్నాయి. హైదరాబాదులో ఒకటి, తూర్పుగోదావరి జిల్లాలో ఒకటి ఆ పేరుగల స్థలాలున్నాయి. ఈ రెంటిలో తూర్పుగోదావరి జిల్లాలోని దాక్షారామ భీమేశ్వరుడే చాల పాతవాడు. ఈ భీమేశ్వరుణ్ణి నన్నయభట్టు అరణ్యపర్వంలో వర్ణించేడు. కాని అంతకు పూర్వమే ఈ దేవుడు గ్రంథస్థుడయేడు. సాతవాహన రాజులలో ప్రసిద్ధికెక్కిన 'హాలు' డను రాజును గురించి రచించబడ్డ 'లీలావతి' అను ప్రాకృత కావ్యంలో 'సప్త గోదావరి భీమమ్' అని చెప్పబడింది. ఇది దాక్షారామ భీమేశ్వరుణ్ణి గురించే. కాళేశ్వరుడను దేవుడు హైదరాబాద్‌లో గోదావరి తీరాన ఉన్నాడు. ఈ త్రిలింగాల మధ్య ప్రదేశం మాత్రమే తెలుగు దేశమని అంటె ఎవ్వరూ నమ్మకుండా ఉన్నారు. ఎందుచేతంటె? తెలుగు దేశం అంతకంటె విస్తారమైనది. కాబట్టి 'త్రిలింగా'నికి చెప్పబడ్డ వ్యుత్పత్తి ఉపయోగపడడం లేదు క్రీ. శ. 1358 లోనిదైన శ్రీరంగం శాసనాలలో[8] తిలింగానికి ఉత్తర హద్దు కన్యాకుబ్జం, పడమట మహారాష్ట్రం, తూర్పుహద్దు కళింగం, దక్షిణ హద్దు పాండ్యక అని చెప్పబడింది. సాతవాహనుల పరిపాలనా కాలంలో మన సామ్రాజ్యం అంతవరకు ఉండేది. ఆ తర్వాత లేదు. ఇప్పుడు మన దేశంలో హైదరాబాద్‌లోని తూర్పు ప్రాంతానికి 'తెలింగాణా' అని పేరు హైదరాబాద్‌లోని అనేక భాషలవల్ల వారికి అట్టి పేరు అవసరం వచ్చిందేమో! ఇప్పుడు తెలుగుదేశమన్నా, ఆంధ్రదేశమన్నా ఒక్కటే!

## 'త్రిలింగం' నుంచి 'తెలుగు' పుట్టిందా?

ఈ చర్చను తెలుసుకోడానికి ముందు పూర్వ కాలపు చరిత్ర అవసరం. కాబట్టి ఇక్కడ సంగ్రహంగా తెలియజేస్తాను. క్రీ. పూ. 6 వ శతాబ్ది ప్రాంతంలో పైశాచీ జనులు, అటుతర్వాత ఆర్యులు తెలుగుదేశానికి వచ్చేరు. వీరికంటె ముందే ఇక్కడ తెనుగుభాషను మాట్లాడేవారు ఉండేవారు. వారు వేరు వేరు నాళ్లలో స్థిరనివాసాలు ఏర్పరుచుకొని ఉండేవారు వారు నాగరికత, భాష, జ్ఞానం కల వారు. పైశాచి ప్రజలు ఇక్కడికి వచ్చేటప్పటికి ఇక్కడి దేశీయుల భాష మంచిస్థితిలో ఉండేది. దేశీయుల భాషలోని అనేక పదాలను పైశాచీ జనులు తమ పైశాచీ భాషలోకి గ్రహించేరు. ఈ ప్రాథమిక చారిత్రక జ్ఞానంతో మనం చర్చలోకి దిగవచ్చు.[9]

తిరులింగ (ఇప్పటి మల్లికార్జున దేవుడు) అచ్చటి తెగవారి దేవుడు. ఈ దేవుణ్ణి పూజించేవారిని లింగ తెగవారని చెప్పవచ్చు. తిరులింగనామం 'కాలం గడిచినకొద్దీ అనేక రూపాలు పొందిందని చెప్పవచ్చు. ఈ రూపాలన్నీ గ్రంథస్థాలు కాలేదు. ఏవో కొన్నిమాత్రమే శాసనాలలోను గ్రంథాల లోను, కనబడుతున్నాయి తక్కిన రూపాలు లేనిది, మిగతా రూపాలు రాలేవు; కనుక వాటినికూడ ఊహించుకొనక తప్పదు. వీటిలో ఏ రూపాలకైతే దాఖలాలు ఉన్నాయో వాటిని ఆ ప్రక్కనే గుర్తిస్తాను.

```
            తిరులింగ
               |
        తిరిలింగ (1027)
               |
            తిర్ లింగ

త్రిలింగ (139) 10              తిలింగ

        తిలింగ (1316, సంస్కృత మార్కండేయపురాణం)
           |
        తిలుంగ (తమ్మసిద్ధిశాసనం, 1207)
           |
        తెలుంగ
           |
        తెలుంగు
           |
      తెలుంగు { 1220  బసవపురాణము }
              { 1270  కేతనకవి    }
```

7. ఆంధ్ర పత్రిక జయసంవత్సరాది సంచిక పుట 133

8. *Eprigraphica Indica Vol XII P. 90*

9 మన తొలిచరిత్ర అను నా వ్యాసంలో దీనిని విపులంగా తెలియజేశాను.

10. టాలెమ్ అను భూగోళ శాస్త్రజ్ఞుడు (క్రీ. శ. 139) త్రిలింగమ్ అను పదాన్ని వా

ఇన్ని రూపాలు ఏర్పడ్డమీదట రచయితలు వారి వారికి ఇష్టమైన రూపాలను శాసనాలలో వాడుకొన్నారు. అందుచేత ఒక కాలంలోనే వివిధ శాసనాలలో వేరు వేరు రూపాలు కనబడుతున్నాయి 'మ్రాను', 'ప్రాకు' వంటి పదాలలో రేఫం జారిపోయినట్లుగానే 'త్రిలింగ'లోని రేఫంకూడ జారిపోయింది. తిరులింగ మాట శుద్ధదేశీయపదమైనా, దీని రూపాలన్నిటిని పైశాచీ పదాలలాగు, సంస్కృత పదాలలాగు ఆయా భాషలవారు వాడుకొన్నారు. పైశాచి ప్రజ తెలుగు గడ్డమీద అడుగుపెట్టేసరికి (క్రీ. పూ. 600 ప్రాంతం) వారి చెవులపడ్డ రూపం 'త్రిలింగ' ఆ మాటను వారు తమ భాషలోకి గ్రహించేరు. ఈ పదానికి ఆ తర్వాతి కాలంలో కూడ తగ్గలేదు. వారివారి భాషా లక్షణాల ప్రకారం దీనికి ఒక్కొక్కప్పుడు చివరను 'ము' కారం చేర్చేవారు. అప్పుడు 'త్రిలింగమ్' అని కూడ అయేది దీనినిబట్టి తేలేవిషయమేమంటే 'త్రిలింగమ్' అంటే మూడు లింగాలు అని అర్థం కాదు. ఆమాట పుట్టుక తెలియని కాలంలో అట్టి వ్యుత్పత్తి ఏర్పడింది. 'తెలుగు' అను మాట వాడుకలోకి వచ్చిన తర్వాతకూడ సంస్కృత శాసనాలలో త్రిలింగ, తిలింగ, తిలంగ, తిళింగ, తేలింగ మొదలైనరూపాలను వాడుతూనే వచ్చేరు. పాత రూపమే శుద్ధమైనదనే అభిప్రాయం ఉండడం సహజం.

లింగ తెగవారు ఇప్పటి తెలుగు దేశాన్నంతను క్రమక్రమంగా వశపరుచుకొన్నారని, చెప్పవచ్చు. అందుచేత ఈదేశం పేరు 'తెలుగు' దేశమని ఏర్పడింది. మొదటిలో ఇక్కడి భాషకుకూడ అదే పేరు ఉండేదని చెప్పవచ్చు. కాని ఇతర కారణాలవల్ల అప్పటి మట్టుకు మారిపోయి 'తెనుగు' అయింది. దేశానికి మట్టుకే 'తెలుగు' అను పేరు రూఢి అయింది. ఇది తెలుగుదేశం. ఇక్కడి భాష పేరును గురించి తర్వాత విశదపరుస్తాను.

## తిరు

ఇచ్చట దేశభాషలోని 'తిరు' శబ్దం పైశాచీ ప్రాకృత, సంస్కృత భాషలలో రెండు విధాలుగా గ్రహించబడిందని చెప్పవచ్చు—(1) త్రి (2) శ్రీ. దేశభాషలోని 'తిరు' పదం గౌరవ వాచకం. కాని విదేశభాషలైన పైశాచీ ప్రాకృత, సంస్కృత భాషలలో ఏర్పడ్డ రెండు మాటలకును భిన్నార్థాలున్నాయి—త్రి = మూడు; శ్రీ = గౌరవవాచకం.

'త్రిలింగ' వంటివే 'త్రినగ', 'త్రికూట', 'త్రికళింగ'[11] ఇత్యాది పదాలు. వీటిలోని 'త్రి'కి నిజంగా మూడుఅని అర్థం కాదు. దాని వ్యుత్పత్తిని ఎరగనివారు అట్టి అర్థాన్ని తెచ్చిపెట్టేరు.

'కళింగ' కంటె 'త్రికళింగ' ఇంకా విశాలమైనదని ఒక చరిత్రకారుని అభిప్రాయం. "మొదటి ఇంద్రవర్మ త్రికళింగాధిపతి అని పేర్కొనబడుతున్నాడు.[12] అతని వంశంవారు తాము కళింగాధిపతులమని చెప్పుకొన్నారు" అని వ్రాసి, చరిత్రకారుడు, త్రికళింగం, కళింగం కంటె ఎక్కువ ప్రదేశం, కాబట్టి తూర్పు కనుముల ప్రక్కనున్న మరికొంత ప్రదేశాన్నికూడ దీనిలో చేర్చాలి అని వ్రాస్తున్నారు. కాని పై వంశీయులే ఆ రెండు శబ్దాలను పర్యాయపదాలుగా వాడేరు. వాటి రెండింటికి ఒక గజంస్థలమైనా తేడాలేదు. అచ్చటి 'త్రి' గౌరవ వాచకం మాత్రమే!

'తిరులింగ'వంటి దేవుడే 'తిరుకళింగ' కూడ. కాని ఆ పేరుగల దేవుడొకడున్నాడన్న జాడే తెలియరావడం లేదు ఇప్పటి కళింగపట్టణం సమీపంలో ఉన్న 'సాలెహుండాం' పూర్వకాలంలో ఆ దేవుడి వాసస్థానమేమో! మొదట జైనులు, తర్వాత బౌద్ధులు వశపరచుకొన్నాక ఆ పేరు నశించిందా? ఏదయినా బహుపరిశోధనమీద కాని త్రికళింగస్వామి బైటపడడు.

దేశిపదమైన 'తిరుమల' కు సంస్కృతానువాదం 'శ్రీ పర్వతము.' తిరుశబ్దం శ్రీగా మారింది అనడానికి అనేక నిదర్శనం. (మల = కొండ) మల్లికార్జునకొండ శ్రీపర్వతమే! అట్లే నాగార్జున కొండ శ్రీపర్వతమే! వెంకటేశ్వరుడి కొండ శ్రీపర్వతమే! కళింగస్వామి కొండకూడ శ్రీపర్వతమె అయ్యుండాలి.

పూర్వకాలంలో అనేకమంది దేవుళ్లు కొండలమీద వెలిసేరు. మన పూర్వులు కొండలమీద కాపుర

---

11 ఆసియా మైనరులో లైసియన్ జాతివారి పురాతన శాసనాలలో త్రిమ్మిలె అనుమాట కనబడుతూంది. (*History of India by K. A. Nilakanta sastry P 7.*) బహు పరిశోధనమీదగాని ఏ సంబంధాలను నిర్ణయించకూడదు.

12. *Early Dynasties of Andhra Desa by B. V, Krishna Rao Garu P 602-*

ముండేవారు. కాబట్టి వారు తమ దేవతలను కొండల మీదే స్థాపించుకొన్నారు. ఇప్పటికీ కొందరు 'కొండదేవత'ను పూజిస్తాం అంటారు. 'దేవరకొండ' అను ఇంటి పేరు కలవారున్నారు.

కొండమీదగల ప్రతి దేవుడికి ఒక్కొక్క పేరు ఉంటుంది. కాని దేవుడుగల ఆ కొండకు మాత్రం ఎక్కడైనా ఒక్కటే పేరు అది తిరుమల, అట్టి తిరుమలలు చాల ఉన్నాయి.

ప్రతి తిరుమలమీది దేవుడికి ఒక్కొక్క ప్రత్యేక నామ ముంటుందికదా! వాటిలో కొన్ని పేర్లు—మల, నాగ, వెంగ, కళింగ మొదలైనవి. 'తిరుమల' కు సంస్కృతాను వాదం 'శ్రీపర్వతం' అని వెనకే తెలియజేశాను.

అటు తర్వాతి కాలంలో జైనబౌద్ధమతాలు కొంతవరకు వ్యాపించేయి. వీరు 'తిరుమలల'ను స్వాధీన పరుచుకొన జూచేరు. సక్రమంగా స్వాధీనమయేయి. తమ జైన లేక బౌద్ధదేవుణ్ణి కొండమీదికి ఎక్కించేరు. కాని ప్రతి స్థలంలోను ఒక్కొక్క కొండ ఎక్కడ వస్తుంది. కాని దేవుణ్ణి కొండమీద స్థాపించడమే ఆచారం కదా! కాబట్టి దేవుణ్ణి పెట్టడంకోసం కృతక మైన దిబ్బలను తయారుచేశారు. కొండలను అనుక రిస్తూ తయారయేయి, ఈ దిబ్బలు! బౌద్ధులు ఈ దిబ్బ లనే స్తూపాలన్నారు. ఇప్పటికీ తెలుగులో 'దిబ్బ—తిరుగుండం' అనే నుడిఉంది దిబ్బఅంటే కృతకమైన కొండ—అది చాలచిన్నదే అనుకోండి. తిరుగుండం అంటే ఆ దేవుడి తాలూకు జలాశయం. జైనబౌద్ధాలు నశించగా దిబ్బలు, రాళ్ళు మిగిలేయి—అదైనా కొన్నిచోట్లే!

'మల'13 అనేది అరవభాషలోని పదం అనీ, కాబట్టి తిరుమల (ముఖ్యంగా వెంకటేశ్వరుని కొండ) అరవమనీ కొందరు భావిస్తున్నారు. అది వట్టి పొర పాటు. 'మల' శుద్ధ తెనుగు పదమే! ఉదా:—నల్ల మలలు, ఎర్రమలలు. ఇంతకీ 'తిరుమల' శబ్దానికి అర్థ మేమిటో పైనే తెలియజేశాను. ఇది ప్రాచీనపు తెనుగుమాట.

ఒకానొక కాలంలో 'తిరులింగ' దేవుణ్ణి ఆరా ధించే తెగవారు, తెలుగుదేశాన్నంతా వశపరుచు కోగా దీనికి తెలుగుదేశమను పేరు వచ్చింది. అట్లే 'తిరుమల' (ఇప్పటి తిరుపతి) ఆరాధకులైన తెగ వారు14 అరవదేశాన్ని ఆక్రమించుకోగా అక్కడి దేశానికి (తిరుమల, త్రిమల) తమిళదేశమనీ, అక్కడి భాషకు తమిళభాష అనీ వచ్చిందని చెప్పవచ్చు.

అటుతర్వాత పైశాచీ జనులు, ఆర్యులు ఆ ప్రాంతా నికి విచ్చేసేరు. దానికి 'ద్రవిడ'మనే సంస్కృత నామం వచ్చింది. ప్రజలు 'ద్రావిళ్లు' అయేరు.

## నన్నెచోడుడుగాని, నన్నయభట్టుగాని 'తెలుగు' శబ్దాన్ని ఏల వాడలేదు?

పై ప్రశ్నకి ఒక్కటే సమాధానం కనబడు తూంది 'తెలుగు' అనేది దేశానికి పేరు, భాషకి పేరు కాదు. ఇది తిరులింగ లేక త్రిలింగ లేక తెలుగు దేశం. కాని ఇక్కడి భాషకి పేరు 'తెనుగు' దేశం పేరు చెప్పవలసివస్తే 'తెలుగు' అని వాడతారు, భాష పేరు చెప్పవలసివస్తే 'తెనుగు' అని వాడతారు. అయితే పైన చెప్పిన ఇద్దరు కవులును దేశవాచిగానైన 'తెలుగు' పదాన్ని వాడలేదేమి? దేశవాచిగా ఉంటూన్నమాట అదొక్కటే కాదు. 'ఆంధ్ర' మొక టుంది: 'ఆంధ్రం' అన్నా తెలుగు దేశమనే అర్థం. కాబట్టి 'తెలుగు దేశం' అని చెప్పవలసినచోట 'ఆంధ్ర దేశం' అంటేకూడ సరిపోతుంది. "తెనుగుభాష" అని చెప్పవలసినచోట ఆంధ్రభాష అంటే సరిపోతుంది

(దేశం పేరు) ఆంధ్ర = తెలుగు.

(భాష పేరు) ఆంధ్ర = తెనుగు.

అవసరం వచ్చినచోటల్లా పై పదాలను వారు తబ్బిబ్బు లేకుండ వాడేరు.

నన్నెచోడదేవకవి—కుమారసంభవంలో వాడిన మాటలు—

ఆంధ్రవిషయంబున = ఆంధ్ర లేక తెలుగుదేశమున.
(ఆ 1 ప 23.)

తెనుంగున = తెనుగు లేక ఆంధ్రభాషలో
(ఆ 1 ప 23,35)

ఆంధ్రి = తెనుగుభాషను మాట్లాడే ఇల్లాలు.
(ఆ 3 ప 54)

నన్నయభారతంలో 'ఆంధ్ర' శబ్దం సమాసం అడుగున పడిపోయింది. 'గౌడాంధ్రకుంతల కేరళ'— అందుచేత స్పష్టం కావడంలేదు. 'తెనుగు' శబ్దానికి ప్రయోగాలున్నాయి.

---

13. అరవభాషలో 'మలై' అంటారు.

14 'మాలలు' అని చెప్పబడు హరిజనులు మొదట ఈ ప్రదేశంలోనివారో, లేక మలల (కొండల) మీద ఉండబట్టి ఆ పేరు వచ్చినదో.

నన్నయ నాటికి కూడ పైమాటలలో తబ్బిబ్బులు లేవు. సుమారుగా మరి రెండుశతాబ్దాలలో అవిచక్షణ అంతరించింది అప్పుడు అంధ్ర, ఆంధ్ర, తెలుగు, తెనుగుశబ్దాలకు భేదమే కనబడలేదు. అంతేకాదు, వాడుకలోంచి 'అంధ్ర' పదం జారిపోయింది కాలం జరిగిపోయినకొద్దీ ప్రజలు, పండితులుకూడ వెనకటి వాటిని మరిచిపోతారు!

ఈదేశానికి తిరులింగ (మల్లికార్జున) స్వామి తన పేరును పెట్టుకొన్నాడు.

'తెలుగు', 'తెనుగు' మాటలనుగురించి మనం ఎన్ని చెప్పినా ఒక సందేహంమాత్రం వదలదు. అదేమంటే—లోకంలో ఎక్కడైనా దేశం పేరే భాషకి ఉండటం కద్దు. అంతేకాని దేశం పేరు ఒకటి, భాష పేరొకటి ఉండడం విపరీతం ఇది తెలుగుదేశం, ఇందులోని భాష తెనుగు. బహుఆశ్చర్యం! దీని విషయమై ముందు ముందు తెలుసుకొందాము.

## దక్షిణాపథం

'దక్షిణాపథం'—ఈపదసంపుటి క్రీసుపూర్వం ఎప్పటినుంచో వాడుకలో ఉంది. వింధ్య పర్వతాలకు దక్షిణంగా సుమారు నీలగిరులదాకఉన్న ప్రదేశమంతా దక్షిణాపథమే! ఈ పేరు భారత, రామాయణాల లోను ఉంది. మొదటి శాతకనిరాజు (క్రీ. పూ. రెండో శతాబ్ది అతను) 'దక్షిణాపథాధిపతి'ని అని శాసనం15లో చెప్పుకొన్నాడు. విదేశరచనయైన పెరిప్లస్ అను గ్రంథంలో 'దచ్చినాబదే' అని ఉంది. 'దక్షిణ' 'దక్కన్' అను మాటలకు సంబంధముంది.

## టెంకణ

కర్నూలు జిల్లా సరిహద్దులలో శ్రీశైల సమీపంలోని కొంత ప్రదేశానికి 'టెంకణ' అని పేరు. ఈ పదం వ్యాస భారతంలో ఇట్లుంది—'పుళింద, టేంకణ, బాహ్లీక, ఆంధ్ర' సైన్యాలు కౌరవ పక్షాన పోరాడేయి అప్పటికి 'టెంకణ' పదం క్రీస్తుపూర్వ నుంచి ఉందని ఋజువవుతూంది. స్థలవాచియైన 'టెంకణ'పదం దేశిపదం మాత్రమే. దీనికి దక్షిణస్థలమని అర్థం. అరవభాషలో తెక్కణం16 అంటే దక్షిణస్థలమని అర్థం.

శ్రీశైలప్రాంతంలోని టెంకణాన్ని రేనాటి చోళులు క్రీ. శ. అయిదో శతాబ్దినుంచి పరిపాలించేరని చెప్పవచ్చు. వీరిలో ముఖ్యుడు కరికాల చోళుడు.17 వీరు తెలుగువారు. అటుతర్వాత క్రీ. శ. 850 ప్రాంతంలో నన్నెచోడదేవుడను కవిరాజు ముఖ్యుడయేడు.

టెంకణంవంటి పదాలు మరికొన్ని ఉన్నాయి: కొంకణం, తెలంగాణం.

తెంకణం అనుమాటే టెంకణంగా మారింది.

ఉదా:—తెంకాయ – టెంకాయ.

తెంకణము అను పదసంపుటిలో—

తెన్+కణము అను రెండుమాటలుఉన్నాయి.

'తెన్' అనగా దక్షిణం. 'కణము' అనుమాటకు స్థలము అని అర్థం.

'తెన్' అను పదం గల మాటలు తెలుగులో మరికొన్ని 'తెమ్మెర, టెంకాయ, టెంకాళి 'తెన్' అంటే దక్షిణం అనికదా అర్థం. దేనికి దక్షిణం? శ్రీశైలానికి దక్షిణానఉండేస్థలం అని భావం. దీనికి సరియైన సంస్కృతం తర్జుమా – దక్షిణాపథం. కాని ఈ పదసంపుటి ఇదివరకే వింధ్యకి దక్షిణంగా ఉన్న ప్రదేశానికి రూఢినామమై ఉంది. అందుచేత దేశిపదమైన 'టెంకణ' అట్లే మిగిలిపోయింది.

## తెనుగు

ఇదొక దేశీయ పదం మాత్రమే. 'తెలుగు' శబ్దానికుండే ప్రయోగాల బాధ దీనికిలేదు. దీనికి మొదటి ప్రయోగం నన్నెచోడ దేవకవి (క్రీ. శ. 850 ప్రాంతం) కుమారసంభవములోను, తర్వాతిది నన్నయ భారతంలోను కనబడుతున్నాయి.

'తెలుగు' అను పదం కేవలం లాన్ని మాత్రమే తెలియజేస్తుంది. అయితే అందలి భాష పేరేమిటి?

'తెనుగు' శబ్దం సుమారుగా వేయి యేళ్ళనుంచి మార్పులేకుండ కనబడుతూంది కాబట్టి మొదటినుంచి ఆ పదం అట్లేఉందని అభిప్రాయపడవచ్చు. కాని దీనిలో పెద్ద చిక్కొకటి వచ్చిపడింది 'తెనుగు' శబ్దాన్ని చ మాడడంతో, ఏవో రెండు పదాల సంపుటిలాగు తోస్తుంది. 'తెనుగు'కి ఉండదగ్గ రెండు వ్యుత్పత్తులను ఇక్కడ చూపిస్తాను.

---

15 ఎపి. ఇం. *VIII* పుట 43.

16. ఆంధ్రభాషావికాసం, పుట 32.

17. *Early Dynasties of Andhra Desa by B. V. Krishna Rao P 282 -284.*

(1) తెలుగుదేశంలో నాగు తెగవారు ఉండే వారు. నాగు తెగవారి ముఖ్యదేవుడు 'తిరునాగు' అని చెప్పవచ్చు. ఇతని పేరుకలదే నాగార్జున కొండ. దీనిని మొదట జైనులు వశపరుచుకొన్నారు. క్రీ పూ మూడో శతాబ్దంలో ఇక్కడ జైనమతం ప్రబలింది. కుబీరకుడు అను జైనరాజు ధనద్రపోలు (ఇప్పటి భట్టిప్రోలు)ను ముఖ్యపట్టణంగా పాలించేవాడు. అతని కాలంలో జైనులు దీనిని నాగార్జునకొండ18 అని పిలిచేవారు; అటుతర్వాత కొంతకాలంపాటు దీనిని బౌద్ధులు వశపరుచుకొన్నారు.

'తిరునాగు' దేవుడున్న ఈ పర్వతంకూడ శ్రీపర్వతమే. 'తిరుమల'యొక్క అనువాదమే 'శ్రీపర్వతం' అని వెనకే తెలియజేశాను.

'తిరునాగు' నామం పొందతగిన మార్పులు

తిరునాగు
|
తిరినాగు
|
తిర్ నాగు

త్రినాగు                    తిన్రాగు

తినాగు
|
తెనుగు

శుద్ధ దేశీయమైన 'నాగు'శబ్దమే పైశాచీ ప్రాకృతంలోకి, సంస్కృతంలోకి 'నాగ' అను మార్పుతో గ్రహించబడింది.

(2) రెండో వ్యుత్పత్తిని చూద్దాం. ఇక్కడ నాగు తెగవారుండేవారుకదా! వింధ్య పర్వతాలకు దక్షిణాన ఉన్నవారు 'తెన్ నాగులు'( తెన్= దక్షిణం) తెన్ నాగులు మాట్లాడే భాష తెన్ నాగు భాష.

తెన్ నాగు
|
తెన్నాగు
|
తెనాగు
|
తెనుగు

ఇట్లు రెండువిధాలుగా దీనిని సాధించవచ్చు. కాని 'తిరునాగు' పదమే 'తెనుగు' అయింది అనడం సమంజసం. అంతకు పూర్వం ఈ తెలుగుదేశం లింగ తెగవారి పాలనకింద ఉండేది. దానిని నాగు తెగవారు ఆక్రమించుకొన్నారు. ఈ దేశానికి మాత్రమే మునుపటి పేరైన 'తెలుగు' రూఢిఅయింది. కొత్తగా వచ్చిన నాగు తెగవారి పేరు, ఇక్కడి భాషకి పేరుగా ఏర్పడింది. 'తెనుగు' శబ్దంయొక్క [illegible]త్తి అది. ఇది 'తెలుగు' దేశం ఇక్కడిది 'తెనుగు' భాష. పై రెండుమాటలకు వేరువేరు అర్థాలు కదా. అది ఎరిగిన కాలంలో వాటికి గజిబిజి లేదు. అది ఎరగని కాలంలో రెండూను పర్యాయ పదాలు కావడంలో వింత ఏమీ లేదు.

## ఆంధ్ర

'అంధ్ర—ఆంధ్ర' పదాలు ఎట్టివో ఈ వ్యాస ప్రారంభంలోనే తెలియజేశాను ఐతరేయ బ్రాహ్మణంలో మొదలుగా అనేక పూర్వప్రయోగాలు కనబడుతున్నాయి కాని ఒక్కటీకూడ దాని వ్యుత్పత్తిని తెలుసుకోడానికి సాయపడడంలేదు. ఇట్లుండగా దండి మహాకవి రచన మాత్రమే మనకు ఉపయోగపడుతూంది. ఆయన దశకుమార చరిత్రలో 'ఆంధ్ర నగరము'ను పేర్కొన్నాడు. అది సరస్సు సమీపంలో ఉంది అని ఆ మహాకవి జేసేడు ఈ సరస్సు ఇప్పటి 'కొల్లేరు' అనీ, ఆయన చెప్పిన ఆంధ్ర నగరం 'వేంగి' (ఇప్పుడు ఇది ఏలూరు దగ్గిర పెదవేగి చినవేగి అను గ్రామాలుగా ఉంది) అనీ, మన చరిత్రకారులు కనుకొన్నారు. ఇప్పుడు మనం ఆలోచించవలసిన విషయమేమంటే— వేంగి నగరానికి ఆంధ్ర నగరం అను పేరు పెట్టడానికి ఏలాగు సాధ్యమయింది? ఆ మాటలను ఈ క్రింది విధంగా సమన్వయం చేయవచ్చు—

వేంగి నగరం = ఆంధ్ర నగరం
వేంగి = ఆంధ్ర

ఇప్పుడు 'వేంగి' తాలూకు పుక్కిటి పురాణాలను తిరగవేద్దాము. వేంగి అన్నా 'వేగి'అన్నా ఒక్కటే! 'వేగి' ఒకప్పుడు దగ్ధరాష్ట్రమట! ఇది దగ్ధరాష్ట్ర మెట్లయింది? 'వేంగి'కి 'మంట' లేక 'నిప్పు' అను మాటలకు ఏదో సంబంధముంది. తెలుగులో 'వేగుట' అను మాటను, 'కాలుట'కు సంబంధించిన భావా

18 *Early Dynasties of Andhra Desa by B. V. Krishna Rao P 122-127.*

లలో వాడతాం. ఉదా:—కూర బాగా వేగింది; వాడు ఏక వేగిపోతాడు. ఇంతే కాదు. 'వేగు' మాటకు మరొక అర్థం కూడా ఉంది.

వేగు తెల్లవారు, ఉదయమగు

మనకు ప్రస్తుతం ఉపయోగపడే అర్థం ఇదే! ఈ అర్థంలోనే మనం 'వేగుజాము', 'వేగుచుక్క' మొదలైన పగులకొద్దీ మాటలను సృష్టించుకొన్నాం. వాడుకలో ఉన్నాయి. కాని అసలు ముఖ్యమైన పదమొకటి వాడుకలోంచి జారిపోయింది. అది ఏదంటే— సూర్యుడు అని అర్థం వచ్చే పదం. ఇప్పుడు మనం 'సూర్యుడు' అను పదాన్ని వాడుతూన్నట్లుగా మన పూర్వులు 'వేంగి' అను మాటను వాడేవారని సులువుగా ఊహించుకోవచ్చు. ఈ పదంనుంచే వేంగినాడు, వేంగిరాష్ట్రం మొదలైన మాటలు వచ్చేయి. 'వేంగినాడు' అను పదానికి 'వేంగి' శబ్దమే మూలం.

'వేంగి' అనగా సూర్యుడు కదా! సూర్యుడు ఎట్టివాడు? అంధము (= చీకటి) ను పోగొట్టువాడు, అనగా, అంధారి (అంధ + అరి) (చీకటికి శత్రువు)

వేంగి = అంధారి.

వేంగినాడు = అంధారి పథము.

ఈ 'అంధారి' పదం పైశాచిక ప్రాకృతం. అప్పటికి ఇంకా ఆర్యప్రభావం మనకు లేదు.

'అంధారి' పదం వాడుకలో క్రమంగా 'అంధర' 'అంధ్ర' అయింది.

అంధారి (సూర్యుడు) ని పూజించే మనుష్యులు 'అంధారులు' ఈ మాట వాడుకలో 'అంధరులు' 'ఆంధ్రులు' అయింది. 'ఆంధ్ర' అనురూపం ఏర్పడ్డ కాలంలోనే ఐతరేయ బ్రాహ్మణ గ్రంథం పుట్టింది. అందుచేతే ఆ రూపం మాత్రమే[19] ఆ పుస్తకంలోకి ఎక్కింది.

పూర్వకాలంలో 'ఆంధ్ర' అనేది ఒక జాతి కాని అఖిరికి ఒక తెగ కాని కాదు. అది ఒక్క కుటుంబం మాత్రమే! దాని సంగతి చరిత్రనుగురించి చెప్పేటప్పుడు చెప్పబడుతుంది.

ఒకదాని వ్యుత్పత్తి మరిచిపోయిన కాలంలో అనేక పుక్కిటి పురాణాలు బయలుదేరతాయి. ఈ దేశం తగలపడిపోయింది కాబట్టి లేక ఇక్కడ పెద్దపులులు సంచరించేవి కాబట్టి దీనికి వేంగి అని పేరు పెట్టేరు అని ఒకరకం కథ. మచ్చుకి మరొకటి, చూడండి. 'ధర్మామృతి' అను కావ్యంలో ఏమిట్రాసి ఉందంటే— ఇక్కడ ఏడుమంది శుద్ధి రాజులు (అంధులు) పరిపాలన చేసేరు కాబట్టి అంధక దేశమని పేరు[20] వచ్చింది. ప్రజలు, పండితులు కూడా అసలు వ్యుత్పత్తిని మరిచిపోయిన కాలంలో ఊరుకోలేక విపరీత విధాలుగా సాధించజూసారు.

ఇప్పుడు మనం తెలుసుకోవలసిందేమంటే— మన దేశానికి పైశాచీ ప్రజలు వచ్చేరు. వారిలో ఒక కుటుంబంవారైన ఆంధ్ర కుటుంబంవారు ఇప్పటి గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాల ప్రదేశాన్ని వశపరుచుకొన్నారు. తాము వశపరుచుకొన్న ప్రదేశానికి ఆంధ్ర పథం అని పేరు పెట్టుకొన్నారు అప్పటి ప్రజలభాష అనగా తెనుగుభాషలో ప్రజలకోసం 'వేంగినాడు' అని పరివర్తించేరు.

ఆంధ్ర కుటుంబంవారు సూర్యుని ఆరాధించేవారు అని వారి పేరునుబట్టే తెలుస్తూంది. ఇటువంటి కుటుంబాలు ఇంకా బోలెడున్నాయి. వాటిని గురించి తర్వాత తెలుసుకొందాం.

ఆంధ్రరాజ్యం క్రమక్రమంగా విస్తరించి ఇప్పటి తెలుగు దేశమంతటా విస్తరించింది. ఇదంతా ఆంధ్రపథమే అయింది. వేంగినాడు, వేంగోరాష్ట్రం దీనిలోవే. కర్నూలు జిల్లాలోని నదికి 'అంధ్రి' అను పేరు వచ్చింది. కళింగదేశం కూడా ఆంధ్రపథంలో ఒక భాగమయింది.

కొంతకాలమయేక పండితులు శుద్ధ తెనుగు పదమైన వేంగిని పైశాచీ ప్రాకృత, సంస్కృతాలలోకి అట్లే లాగుకొని వేంగీనగరం, వేంగీ రాష్ట్రం అన్నారు. అక్కడివారిని వైంగీయకులు అని కూడ అన్నారు. ఇట్లు ప్రాకృత, సంస్కృతాలలోకి దేశభాషా పదాలు ఎన్నో ఎక్కేయి. వాటిని పండితులు బైట పెట్టాలి.

వేగినాటివారు శుద్ధాంధ్రులు. వారే పూర్వపు ఆంధ్రులకు సంబంధించినవారు. దేశమంతటికిని ఆంధ్ర పథం అను పేరు ఏర్పడ్డ తర్వాత ఇక్కడి జనులందరు ఆంధ్రులయేరు. చివరికి ఆంధ్రులన్నా తెలుగువారన్నా, తెనుగువారన్నా ఒక్కటే అయేరు.

---

19. ఏతేంధ్రా, పుండ్రా, శబరా, పుళింద మూతిబా ఇత్యుదంత్యా'— ఐతరేయబ్రాహ్మణం.

20 *Early Dynasties of Andhra Desa P. 124.*

వేంగి (సూర్యుడు) అను పదం తెలుగు నిఘంటువుల్లోంచి జారిపోయినట్లే సూర్యునికి అంధారి అను పదం సంస్కృత నిఘంటువులలో కనబడదు.

పైశాచీ ప్రజలంటే ఆర్యులకు పరమశత్రుత్వం. కాబట్టి వారి మాటను తమ నిఘంటువుల్లో వేసికో లేదా? కాలం జరిగినకొద్దీ అంధ్రశబ్దంయొక్క తొలి అర్థం జారిపోయింది. ఇది ఒక జాతిప్రజకు పేరయింది. వీరి తొలి చరిత్రను మరొక సందర్భంలో చూదాం. మన తెలుగుదేశానికి వచ్చిన పైశాచి జాతివారు సూర్యారాధకులు అను విషయాన్ని మనం గట్టిగా జ్ఞాపకముంచుకోవాలి. ఆవచ్చిన అనేక కుటుంబాలలో అంధ్రకుటుంబం ఒక్కటి మాత్రమే! మిగతి కుటుంబాల సంగతి ఇటుతర్వాత చూద్దాం.

## సాతవాహన

ఇదికూడ ‘అంధ్ర—ఆంధ్ర’ పదాల వంటిదే. జనక—జన్య సంబంధం.

సతివాహనుడు—సాతవాహనుడు

సతవాహనుడు అంటే ఏమిటి? పూర్వకాలపు భాషాచిత్రాలలో ఇదొకటి. దీనిలో రెండు మాటలున్నాయి.

సత + వాహనుడు

‘సత’ శబ్దానికి అచ్చ తెనుగు పదాలతో చేరిక కనబడుతూంది. దానికి ఉదాహరణ ఇటు తర్వాత వస్తుంది. ‘సత’కి ‘సప్త’కి సంబంధముంది. ఏదిముందో ఏది వెనుకో పరిశోధన అవసరం.

సత = ఏడు

‘సత’తో కూడిన కొన్ని పదాలు—సతనాలు కలదునీరు, సతినాల్కల జేజే, సతిహుమాదణి, ఇవన్నీ అచ్చ తెనుగులు.

రెండో పదమైన ‘వాహనము’ను గురించి పరిశీలిద్దాం.

వాహము లేక వాహనము = గుర్రము

‘వాహనుడు’ అను పదం మనకు ఇప్పుడు కొన్ని సమాసాలలో వాడుకలో ఉంది—నందివాహనుడు, గరుడవాహనుడు.

∴ సతివాహనుడు = ఏడు వాహనములు (గుర్రములు) గలవాడు; సతిహుమాదణి

ఈయన ఎవరు? ఏడు గుర్రములు (వాహనములు) గలవాడు సూర్యుడు. సతివాహన శబ్దం అమరకోశంలో లేదు.

‘అంధ్ర’ని ఆరాధించువారు అంధ్రులు లేక ఆంధ్రులు అయ్యారు. అట్లే ‘సతివాహను’ని ఆరాధించువారు ‘సాతవాహనులు’ సాతవాహనులు కూడ ఆంధ్రులలాగ సూర్యభక్తులైన బ్రాహ్మణులు.

తూర్పుతీరంలో క్రీ. శ. నాటి ప్రాకృత భాషలో కొన్ని మాటలలో ‘స’కి ‘శ’కి భేదం పాటించే వారుకారు. కాబట్టి ‘సాతవాహన’ పదం నుంచి ‘శాతవాహన’ పదంకూడ ఏర్పడింది ఈ పదాలకే అటుతర్వాత అనేక అభాస రూపాలు ఏర్పడ్డాయి—శాతహాని, సాతహాని మొదలైనవి.

పై వ్యుత్పత్తిని ఎరగని కాలంలో పండితులు కొత్తకొత్త కథలు అల్లేరు. కథాసరిత్సాగర గ్రంథకాలంలో ‘సాతవాహనుడు’ అంటే సింహాన్ని ఎక్కినవాడు అన్నారు. మరికొందరు గుర్రానికిపుట్టినవాడు అన్నారు.[21]

ఆంధ్రులలాగే సాతవాహనులు కూడ ఒక కుటుంబంవారు మాత్రమే. సూర్యారాధనగల ఇట్టి కుటుంబాలను మరికొన్నిటిని ఇటుతర్వాత తెలుసుకొందాం.

## ఐక్ష్వాకులు (క్రీ. శ. 200-26

పురాణాలలో గజిబిజి లేకుండా ఐక్ష్వాకవంశము అను పేరు చెప్పబడింది—అనగా, వీరు ఇక్ష్వాకు వంశంవారు అని అర్థం. ఇక్ష్వాకుడు అనగా సూర్యుడు ఐక్ష్వాకులు అనగా సూర్యుని ఆరాధించు భక్తులు కాబట్టి వీరిని ఐక్ష్వాకులు అనాలి కాని ఇక్ష్వాకులు అనకూడదు ఈమాటకూడ అమరకోశంలో లేదు. ఆంధ్రులు, సాతవాహనులలాగ ఇక్ష్వాకులుకూడ బ్రాహ్మణులు. వారిలాగ వీరుకూడ ఒక కుటుంబం వారే.

## పల్లవులు (క్రీ. శ. 250-630)

పూర్వకాలంలో పల్లవులు కృష్ణా, గోదావరీ నదీప్రాంతాలలో తొలుత వాసం కల్పించుకొన్నారని చరిత్రకారులంటారు. వీరుకూడ పైవారిలాగ సూర్యారాధకులేగాని మరేమీ కాదు. ఆ విషయం ఇక్కడ చూద్దాం.

---

21. *Early History of the Andhra Country by K. Gopalachari. P 30, 31.*

'పల్లవ' గా సంకంబె 'పలవ' రూపం ప్రాచీనమైనది 22 కాబోలు. పలవ, పల్లవమాటలు తెనుగులో బాగా కలిసిపోయేయి. ఈ కిందిమాటలను చూడండి—

పలపల = సూర్యోదయముపుటలో అనుకరణము.

పల్ల = అరుణవర్ణము కలది.

పల్ల (కేడె) = తెల్ల (కేడె)

పల్లవము = లక్తుకరంగు.

పై పదాలనుబట్టి

పల్లవ = ఎర్రటి రంగుగలవాడు (అనగా, సూర్యుడు)

అను పదం తొలుత ఉండి ఉండాలని చెప్పవచ్చు. అటి మూర్తిని ఆరాధించువారు 'పల్లవులు' అసలు పదంయొక్క రూపం బొత్తిగా చెదిరిపోవడం చేత ఇంతికంటె చెప్పడానికి వీలుకావడంలేదు.

ఆంధ్రులు, సాతవాహనులలాగె పల్లవులుకూడ పై శాచీ భాషను మాట్లాడేవారు. వీరంటే ఆర్యులకు శత్రుత్వం. కాబట్టి 'పల్లవుడు' అను మాటను వారు దుష్టార్థాన్ని పుట్టించేరు. 'పల్లవుడు' అంటే విటుడు. పల్లవులు పై శాచీ జనులుకాబట్టి ఆర్యఆనారాలకంటె భిన్నమైన ఆచారాలను వారు అనుసరించేవారు. 23

పల్లవశబ్దం ఎట్లు వచ్చిందో తెలియనికాలంలో పల్లవ అంటే చిగురు అని అర్థం చెప్పేరు.

పల్లవులు చిరకాలం ఉండడంవల్ల పల్లవనాడు అను పేరువచ్చింది. అది రానురాను 'పల్నాడు' అయింది.

## బృహత్ఫలాయనులు (క్రీ. శ. 270-285)

మొదట 'బృహత్ఫలం' అంటే అర్థం తెలుసుకొందాం.

బృహత్ = గొప్ప

ఫలము = ప్రసవము

ఈ గొప్ప ప్రసవము కలవాడు సూర్యు కాని మరొకరు కాదు.

బృహత్ఫల + అయనము = సూర్యుని గతి.

సూర్యుని గతిని ఆరాధించువారు బృహత్ఫలాయనులు. వీరు సూర్యునియొక్క ఒక అంశను ఆరాధించేవారు. వీరుకూడ ఆంధ్రాదులవలె ఒక బ్రాహ్మణ కుటుంబంవారు.

## సాలంకాయనులు (క్రీ. శ. 320-420)

సాలంకాయన శబ్దం ఎట్లు నిర్వహించాలో చూద్దాం.

స + అలంక = సాలంక

స + అలంకుడు = మండనం లేక ప్రభతో కూడినవాడు (అనగా, సూర్యుడు).

సాలంక + అయనము = సూర్యుని గతి

సాలంకాయనమును ఆరాధించువారు సాలంకాయనులు. ఇది బృహత్ఫలాయనుల వంటిది. తూర్పు ఆంధ్రదేశంలో 'స' కి 'శ' కి భేదాన్ని పాటించేవారు కారు. కాబట్టి 'సాలంకాయను' అన్నా 'శాలంకాయను' అన్నా ఒక్కటే. వీరు వేంగీదేశం స్వస్థలంగా కలవారు కాబట్టి వైంగీయులు అనికూడ చెప్పబడ్డారు. ఆంధ్రాదులలాగే వీరు కూడ ఒక బ్రాహ్మణ కుటుంబంవారు మాత్రమే.

## విష్ణుకుండినులు (క్రీ. శ. 500-670)

'విష్ణుకుండి సంబంధించినవారు విష్ణుకుండినులు.

కుండి = సరస్సు; నలుచదరపు నూయి

'కుం అను మాట పైన చెప్పిన రెండో అర్థంలో కొన్ని ప్రాంతాలలో వాడుకలో ఉంది. కట్టబడ్డ చిన్న గోయి అను అర్థంలో 'మురుగునీటి కుండీ' అని కొన్నిచోట్ల వాడుక. 'కుండి' అను పదము అనేక రూపాలుగా మారింది ఉదా:-గుండము (= లోతైన నేల); (మడి)కుండము; కుంట లేక గుంట (= చెరువు) మొదలైనవి.

విష్ణువు = ఆదిత్యుడు; సూర్యుడు. విష్ణుకుండి = సూర్యదేవుని సరస్సు —అనగా, సూర్యదేవుని గుడికి సంబంధించిన సరస్సు. విష్ణుకుండినులు = సూర్యుని సరస్సుకు సంబంధించినవారు. వీరు సూర్యారాధకులు. ఆంధ్రాదులవలె బ్రాహ్మణులు.

22. *Early Dynasties of Andhra Desa by B. V. Krishna Rao P 136, 216.*

23. *Early Dynasties of Andhra Desa by B. V. Krishna Rao P 136, 216.*

## ఆంధ్రభృత్యులు

'ఆంధ్రభృత్యులు' అని కొన్ని పాలకవంశాలను గురించి చెప్పబడుతూంది. ఈ పదసంపుటికి కొందరు ఆంధ్రరాజులవద్ద సేవకులుగా ఉన్నవారు అని అర్థం చెప్తున్నారు. కాని అది సరికాదు. 'ఆంధ్ర' భృత్యులు అంటే సూర్యభక్తులు అని మాత్రమే అర్థం. భృత్యుడు అనగా భక్తుడనిమాత్రమే భావం. కనుక కొందరు తాము ప్రత్యేకంగా సూర్యభక్తులము అని చెప్పుకోడం కోసం 'ఆంధ్రభృత్యులు' అను బిరుదును తాల్చేరు.

## బప్ప భట్టారక

పూర్వపు పాలకవంశాలు కొన్ని 'బప్పభట్టారక పాదభక్తులము[24] అని చెప్పుకొన్నాయి.

భట్టారక = సూర్యుడు. కాబట్టి వీరు సూర్య పదభక్తులమని చెప్పుకొన్నారు. కాని 'బప్ప' అను మాటకు అర్థమేమో! తండ్రియైన సూర్యుని పాద భక్తులమని అర్థం కావచ్చు.[25] సూర్యుడు మగదేవుడు కాని ఆడదేవత కాడుకదా! 'బాబు' అను పదం యొక్క పూర్వరూపం 'బప్ప' కాబోలు. 'ఆంధ్ర భృత్యు' లన్నా 'బప్ప భట్టారక పాదభక్తులు' అన్నా ఒక్కటే అర్థం. కాని ఇక్కడ ఒక భేదమట్టుకు ఉంది అని చెప్పవచ్చు.

ఆంధ్ర (సూర్య) దేవాలయం కృష్ణానదీతీరాన శ్రీకాకుళంలో ఉండవచ్చు. కాని బప్ప భట్టారక దేవాలయం ఎక్కడఉందో పరిశోధన అవసరం.

## చోళులు

పూర్వపు తెనుగు శాసనాలలో ఴ (తమిళ భాషలో ழ) అను అక్షరం కనబడుతూంటుంది. ఈ ధ్వనినుండి అటుతర్వాత 'డ' 'ళ' 'ఱ' అను మూడు వేరువేరు అక్షరాలు ఏర్పడ్డాయి 'చోఴ' అను మాటనుంచి తర్వాత 'చోడ, చోళ' అను మాటలు వచ్చేయి. ఈ రెండు మాటలేగాక 'ఱ' తోనూ ఒకమాటకూడ, అనగా 'చోఱ' అని కూడ వస్తుంది. మనకు 'చోళ, చోడ' శబ్దాలే తెరుచు వాడుక. ఇవి చోళ లేక చోడరాజులను మాటలలో వాడుకలో ఉన్నాయి. ఇంక 'చోఱ' శబ్దం సంగతేమిటి? పైవన్నీ పూర్తిగా తెనుగుమాటలు.

'చోఱ' శబ్దం వాడుకలో లేకపోయినా ఇంకా నిఘంటువు (ఆంధ్రవాచస్పత్యం)లో మిగిలింది.

చోఱవాడు బాలుడు; శిశువు.

అటు తర్వాతికాలంలో 'ఱ' 'ర' కి భేదం తగ్గిపోయింది. అందుచేత రెండో రూపంకూడ కనబడుతూంది.

చోర బాలుడు; శిశువు.

ఈ బాలుడెవడు? కుమారుడే కాని ఇతరులు కారు. కుమారుడు అంటే కుమారస్వామి ఇతనికి మరికొన్ని పేర్లు—'ముద్దులయ్య; ముద్దుగల తల్లుల బిడ్డడు; సెగపాపడు' (ఆంధ్రవాచస్పత్యం).

చోఱ, చోళ, చోడ ఇవి శుద్ధమైన తెనుగు మాటలు కదా!

'చోఱ' అంటే కుమారస్వామి అని తెలుసుకొన్నాము ఈ దేవుడంటే భక్తిగలవారు తమ వంశానికి ఆ దేవుడి పేరు పెట్టుకొన్నారు. చోఱులన్నా, చోళులన్నా, చోడులన్నా వారే.

కుమారస్వామికి 'చోఱ' అను మాట ఇప్పటి తెలుగులో వాడుకలో లేదు. కాని ఒకప్పుడు ఉండేదని చెప్పవచ్చు. 'చోరగుడి' వారు అను ఇంటిపేరు గలవారు ఉన్నారు 'చోరగుడి' అంటే 'కుమారస్వామి ఆలయం' అని అర్థం.

చోళులు లేక చోడులు మొదట తమిళ దేశస్థులనీ, తర్వాత తెలుగుదేశంలో రేనాటి ప్రాంతాన్ని జయించేరనీ కొందరు చరిత్రకారులు చెప్పే మాటలు విశ్వసనీయాలు కావు.

చోళులు ఆంధ్రదేశంవారనీ, కరికాలచోళుడు ఇక్కడి వాడేననీ, వారు తమిళదేశంమీదికి దండెత్తి అక్కడ రాజ్యము స్థాపించుకొన్నారని చెప్పే భావరాజు వేంకటకృష్ణారావుగారి మాటలే యథార్థాలని[26] చెప్పవచ్చు. ఈ సిద్ధాంతాన్ని అచ్చ తెనుగు పదమైన 'చోఱ' శబ్దం ధ్రువపరుస్తూంది. కరికాలచోడుడు శుద్ధ తెలుగువాడు. ఇతని శాఖవారే తమిళదేశంలో నాటుకొన్నారు.

---

*24. The Early Dynasties of Andhra Desa by B. V. Krishna Rao P 350.*

*25. The Early Dynasties of Andhra Desa by B. V. Krishna Rao P 350.*

*26. Early Dynasties of Andhra Desa P 282-84.*

చోళులు కుమారస్వామి భక్తులు అను విషయం చరిత్రనుంచి తెలుస్తూంది కాబట్టే నన్నెచోడదేవుడు (క్రీ. శ. 828 882) కుమారసంభవ కావ్యాన్ని రచించేడు.

చోళులలాగే గాంగులు, చాళుక్యులు కూడ కుమారస్వామి భక్తులే! ఆ సంగతి ఇటు తర్వాత చూద్దాం.

## గంగులు

అయిదో శతాబ్దాంతంలో కళింగదేశంలో గంగ రాజులు ప్రసిద్ధికి వచ్చేరు. ఆటుతర్వాత వారు ఎనిమిది శతాబ్దాలపాటు పరిపాలించేరు. 'గంగ' శబ్దం ఎటువంటిది? 'గంగ' 'గాంగ' అను రెండు రూపాలు శాసనాలలో కనబడుతున్నాయి. కాని 'గంగ'శబ్దమే తరుచుగా వాడుక. కాని ఈ శబ్దంనుంచి ఏ విషయమూ తెలియడంలేదు. వీరికి మరొక పేరుకూడ ఉంది. అదేదంటే 'జాహ్నవేయులు.' జాహ్నవేయులు అంటే గంగాతనయులు, అనగా గాంగులు. కాబట్టి వీరిని 'గంగులు' అనడంకంటె 'గాంగులు' అనడమే సరియైన మాట.

మైసూరు ప్రాంతంలోని గాంగవంశం తాలూకు వారే కళింగదేశంలో రాజ్యం స్థాపించుకొని పరిపాలించేరని కొందరు చరిత్రకారుల అభిప్రాయం. గాంగ శబ్దం ఉత్పత్తినిబట్టి అదే సరియైనది కావచ్చు.

గాంగులకు ఆ పేరు ఎందుకు వచ్చింది? వీరు పూజచేసిన తొలి దేవుడి పేరు వీరి పేరునుంచి కనుక్కోవచ్చు.

గాంగుడు=స్కందుడు, అనగా కుమారస్వామి (గంగకి పుట్టినవాడు) జాహ్నవేయుడు అన్నా అదే అర్థం. కాబట్టి గాంగులు కుమారస్వామి భక్తులై 'గాంగ' అను వంశనామాన్ని పెట్టుకొన్నారు.

'గాంగులు' అను పేరు ఎట్లు వచ్చిందో తెలియని కాలంలో వారు 'గంగులు' కూడ అయేరు. కాని వారి పూర్వచరిత్ర 'జాహ్నవేయ' పదంలో సందిగ్ధం లేకుండ మిగిలింది.

చోళులలాగె గాంగులుకూడ కుమారస్వామి ఆరాధనపరులు. శైవమతం ప్రబలగా గోకర్ణేశ్వరుని కొల్చి, ఆ స్వామికి దేవాలయాలు నిర్మించేరు. వీరు శ్రీశైలం సమీపంలోనివారే కాని ఉత్తర హిందూస్థానంలోంచి దిగుమతి యైనవారు కారు అని చెప్పవచ్చు.

## చాళుక్యులు

కరుణ—కారుణ్య
పరుష—పారుష్య
కలుష—కాలుష్య

పై పదాలవంటివే 'చళుక-చాళుక్య' పదాలు. అయితే 'చళుక' శబ్దంయొక్క అర్థమేమిటి?

చాళుక్యుల శాసనాలలో 'చలుకి, చల్కి, సల్కి' ఇత్యాది రూపాలు కనబడుతున్నాయి. కాని వీటి మూలం ఏది, దాని అర్థమేమిటి?

పైన చోళులు, గాంగులు కుమారస్వామి భక్తులని తెలుసుకొన్నాం. వీరుకూడ ఆ దేవుని భక్తులై తమ వంశనామాన్ని ఏర్పరుచుకొన్నారా? 'చళుక' అంటే కుమారస్వామి అను అర్థం ఉందా? ఈ విషయమై ఇక్కడ పరిశీలిద్దాం.

జమ్మలమడుగు ప్రాంతంలో హిరణ్యకులను తెగవారున్నారు. వారి సేనాధిపతి 'స్కంద చెలికి రెమ్మణకుడు' అని ఐక్ష్వాకుల శాసనంలో ఉంది. స్కందుడనగా కుమారస్వామి అని తెలుసు. ఇక్కడ రెండుపదాలు తారసిల్లేయి 'స్కంద - చెలికి'. 'చెలికి' పదానికి 'స్కంద' పదంతో ఏదో సంబంధముంది. ఇప్పుడు దానిని సాధించుదాము.

చేలుకుడు = భృత్యుడు; సేవకుడు (ఆంధ్ర వాచస్పత్యం. శాసనాలలో వర్ణక్రమములోపాలు ఒక్కొక్కప్పుడుంటూండడం మాస్తూనే ఉన్నాం. కాబట్టి 'చేలుకుడు 'చెలికి' ఒక్కటే. ఇప్పుడు ఆపదాల అర్థమేమంటే—

స్కందచెలికి = కుమారస్వామి సేవకుడు లేక భక్తుడు.

పైన ఉదహరించిన శాసనవాక్య భాగానికి అర్థం :

స్కందభృత్యుడైన అనగా భక్తుడైన రెమ్మణకుడు. రెమ్మణకుడు సేనాధిపతి. అతను కుమారస్వామి భక్తుడు.

కొందరు పాలకవంశాలవారు తాము ఆంధ్ర భృత్యులమని చెప్పుకొన్నారుగదా! అట్లే చాళుక్యులు తాము స్కందభృత్యులు అనగా స్కందచేలుకులు.

'చేలుక' పదమే 'చెలికి' పదమయింది, చివరకి 'చళుక' అయింది. 'పరుష'నుంచి 'పారుష్య' అను

పదం వచ్చినట్లే, 'చళుక'నుంచి 'చాళుక్య' పదం ఏర్పడింది.

రెమ్మణకుడు చాళుక్య వంశానికి మూల పురుషుడని చెప్పలేము. మూలకుటుంబానికి సంబంధించిన వాడని కూడ చెప్పలేము. ఆనాడు స్కందగుప్తికొల్చి అనేక వంశాలలో అతనొకడు మాత్రమే!

## కాకతీయులు

'కకతి' అను మాటనుండే 'కాకతీయ' పదం వచ్చింది. కాని 'కకతి' అంటే ఏమిటి?

కాకతీయులు శైవ మతాభిమానులని 27 చరిత్ర తెలియజేస్తూంది.

ఆంధ్ర వాచస్పత్యంలో ఈ క్రింది మాటలు ఉన్నాయి—

కకుదము = మూపురము

కకుది = (మూపురము గలది) వృషభము

కకుత్తు = మూపురము

= మూపురము గలది వృషభము

'కకుత్తు' కల దానికి ఏమిపేరో పై నిఘంటువులో లేదు. ఇది 'కకతి' కావచ్చని ఈ క్రింద జెప్పిన దానివల్ల తెలుస్తుంది.

'కకతి' అను మాట కాకతీయుల శాసనాలలోనే ఉంది. వారు 'కకతి పురాధీశ్వరులము'28 అని చెప్పుకొన్నారు. 'కకతి పురం' ఎక్కడుందో చారిత్రక పరిశోధకులు చెప్పవలసిన సంగతి.

'కకతి' లేక వృషభము, సామాన్య వృషభము కాదు. ఇది ఈశ్వరుని వాహనమైన నంది కాబట్టి నందికి మరొక పేరు 'కకతి' అని చెప్పవచ్చు.

కాకతీయులు శైవులని చరిత్రవల్ల తెలుస్తూంది కదా! కకతి అనేది నంది పేరు, అది ఉండబట్టి గ్రామనామనే అయిందనికూడ చెప్పవచ్చు 'కకతి' కి సంబంధించిన వారు కాబట్టే 'కాకతీయులు' అయేరు.

'కాకిత, కాకర్త, కాగిన, కాకత29' మొదలైన గ్రామనామాలు కకతికి సంబంధించినవో లేక కాకతీయులు తమ సంబంధంగా పెట్టిన గ్రామనామాలో కావచ్చు.

ఈ మోస్తరుగా అనేక ప్రాచీన పాలక వంశ నామాలయొక్క పుట్టుపూర్వోత్తరాలను గుర్తు పట్టవచ్చు.

27. చిలుకూరి వీరభద్రరావుగారి కాకతీయాంధ్రరాజయుగ చరిత్రము పుటలు 549, 550.

28. *J. A. H. R. S. Vol 7 Pts P 175*

19. చిలుకూరి వీరభద్రరావుగారి కాకతీయాంధ్ర రాజయుగ చరిత్ర, పుటలు 10, 139

కథానిక

# ఒకపొద్దు పొడిచింది

శ్రీ ఘట్టి కృష్ణమూర్తి

అప్పుడు నాకు మరీ చిన్నతనం కాకపోయినా ప్రపంచాన్ని గురించి అంతగా గుర్తెరగని రోజులవి. మా నాన్న జిల్లా కోర్టులో ‘సెకండ్‌క్లర్కు’గా, పనిచేస్తూ వుండేవారు. ఆయనకు నెలకు వచ్చే జీతం యెంతో నాకు వివరంగా తెలియదు, కాని మా సంసారం బాగానే యే కొదవా లేకుండా జరిగిపోతూ వుండేది.

కొందరు అంటూవుండగా విన్నాను మా నాన్న చాలా మందతోపాటే లంచాలు తీసుకొనేవారని. దానిని గురించిన నిజం నా కిప్పటి అర్థం కాదు. ఏరోజు కారోజు రూపాయల దొంతరలు కోటు జేబులోనించి తీసి డ్రాయర్లో దాస్తూ వుండడం మాత్రమే నే నెరుగుదును. కావలసిన అవసరాలు తీర్చుకోవడంతో నే మాకు సరి!

నాకు బాగా గ్రాహ్యకం తెలిసేనాటికి మా అక్కయ్య లిద్దరికి పెండ్లిండ్లయినయ్. నే నెరుగుండగా అయిందల్లా మా మూడో అక్కయ్య పెళ్ళి మాత్రమే. ఇదివరకు నాన్న చేసిన పెళ్ళిళ్ళతో పోల్చి చూస్తే, నాటికిది తక్కువ భాగంలోనే జరిగిందని రెండూ యెరిగున్నవాళ్లు అంటూ వుంటారు.

అప్పటికే మా నాన్నకు పింఛను తీసుకొనే వయసు రావడంవల్ల డబ్బు దగ్గిర కొంత బిగువు చూపించారంటారు కొందరు. మరి నాలుగేండ్లకల్లా ఆయన పింఛను తీసుకొన్నారు! నెలకు ముప్పైయో నలభయ్యో వస్తయ్, అంతే! ఇంక యీ వూళ్ళో వుండడం అనవసరం అనుకొన్నారు కాబోలు! ఆయన పుట్టిన లంకలో నేవున్న ఒక స్థలంలో యిల్లు కట్టి కాపురం అక్కడకు తర్లించుకు వెళ్ళారు. అప్పట్నించి నేనూ ఆ వూళ్ళోనే వుండిపోయాను.

నాకు ముగ్గురు అక్కయ్యలు, ఇద్దరు తమ్ముళ్లు, ఇద్దరు చెల్లెళ్ళు, ఒక అన్నయ్య. మా అన్నయ్య మాత్రం పక్కవూళ్లోనే వున్న హైస్కూల్లో చదువుతూ వుండేవాడు. నా చదువు విషయమై అంతగా శ్రద్ధ తీసుకోలేదు మా నాన్న. దానికి తగినట్లుగా మా వూరు ‘కృష్ణ’కు ఒడ్డునే వుండడంవల్ల ఏరోజు కారోజు ఏరు దాటిపోయి చదువుకు రావలసిన అగత్యం వుండేది. దానివల్లకూడా నా చదువు సాగలేదు; అయినా చదువను వ్రాయను మాత్రం నేర్చుకొన్నాను.

అప్పటికి యింట్లో వున్న ఆడపిల్లల్లో నేనే పెద్దదాన్నవటంమూలాన మా అమ్మకు చేదోడువాదోడుగా వుండి పనులు చేసుకుపోవడంతోనే సగంపొద్దు గడచిపోయేది. తీరిక సమయాల్లో అర్థంపర్థంలేని ఆటల్లోనూ, కబుర్లతోనూ కాలం గడిపేదానిని. అంతకంటే విశేషించి ప్రపంచజ్ఞానం అలవడగల వాతావరణం అక్కడలేదు.

నాకు పెళ్ళీడు వచ్చింది. మా నాన్న సనాతనాచారాల్లో విశ్వాసంకలవారు కావడంవల్ల, నా కెలాగైనా రజస్వల కాకపూర్వమే పెళ్లి చేసెయ్యాలని శతవిధాల ప్రయత్నించారు. కాని యెక్కడా కలిసి రాలేదు. దానికి తగినట్లుగా పింఛను పుచ్చుకుంటూ యీ పల్లెటూళ్ళో కాలం గడుపుతున్న ఆయన యిదివరకటి కట్నాలూ, కానుకలూ యివ్వలేడాయె! మరాయన మొర విని నన్ను పెళ్లిచేసుకోవడానికి వొప్పుకోగల త్యాగపురుషుడెవరు? కాళ్ళు బలపాలు కట్టేలా యెన్నాళ్లు తిరిగినా ఆయన అనుకొన్న నెరవేరకపోవడంతో కొన్నాళ్ళపాటు ఆప్రయత్నం నించే విరమించుకొన్నారు!

ఏదియేమైనా కాలచక్రం మహావేగంతో తిరిగిపోతూనే వుంటుందిగా! ఆయన ఆలోచనలన్నీ వొక

తీరానికి రాకుండానే నేను రజస్వలనయాను. ఆ మాట వినడంతోటే మా నాన్న సగం కృంగిపోయాడు.

అయినా, నా సంగతి యెవ్వరికీ తెలీకుండా గుంభనగా అట్టే పెట్టారు. ఎన్నాళ్ళు దాగుతుంది? నోరు ముయ్యగలం కాని, లోకం ముయ్యగలమా? ఆ నోటా, ఆ నోటా అందరికి తెలిసింది. ఎవరికి తోచినట్టు వాళ్ళు వాక్కుంటున్నారు. కాలం గడచిన కొలదీ నామీద ఎన్నో వాడుకలు పుట్టించి చెప్పుకోవడంకూడా విన్నాను. చేసేదిలేక నాలో నేనే కుమిలి ఏడుస్తూ వుండేదానిని. అందులోనూ బొత్తుగా సంస్కారంలేని ఆ మారుమూల లంకల్లో యితరుల బాగోగుల గురించి అంత విమర్శగా లోచించే దెవరు? ఆమాత్రం తీరికా, వోర్పూ యెవ్వరికేడిసినయ్?— ఇదిగో పులి, అంటే అదుగో తోక, అనే రకం!

ఇలాంటి వ్యవహారాల్లో యే విషయమైనా మరీ తొందరగా పాక్కుతుంది. అంతి వేగంగానూ వ్యాపించుతుంది, ఏవేవో మాటలు చెప్పి వారిని వొప్పించడం బహుకష్టం. అలాటి ప్రయత్నం చెయ్యడంకూడా మహాప్రమాదమౌతుంది ఒకోక్కప్పుడు. మన తప్పును మనమే నోరారా, బుద్ధిపూర్వకంగా వొప్పుకొంటున్నట్టు భావిస్తారు. అన్నింటికీ తలవంచుకు తిరగటమే మేలని మా నాన్న యెవ్వరితోనూ కల్పించుకోనే వాడు కాదు.

తెల్లారిలేస్తే అందరితోనూ అవసరాలుంటయ్యాయె! అందరికీ ఆయనతోనూ పనులుండేవి! ముప్ఫై సంవత్సరాలపాటు కోర్టులో మెలిగినవాడు కావడంవల్ల, ఎవరికి యే వ్యవహారం కావాలన్నా, యే కాయితం కరాముత్తులు వ్రాసిపెట్టాలన్నా ఆయన దగ్గిరకేవచ్చి చేరుతూవుండేవాళ్లు. ఆమాత్రం పరపతే లేకపోతే మానాన్న ఆవూళ్లో యెలావుండగలడు?

ఎవరి అవసరాలను వాళ్ళు ఉపయోగించుకోవడమేగాని ఆయనపై యెవరికి సానుభూతివుంటుంది? ఉన్నా చేయగల సహాయంకూడా బహు స్వల్పం. ఇది అంతింతమాత్రాన పరిష్కారమైపోయే సమస్య కాదుగా!

ఒక్క రెక్కమీద సంసారం గడుపుకుంటూ ఇతర వ్యవహారాలన్నీ సరిదిద్దుకుంటూ నా విషయమై అంతగా ఆలోచించడానికిగానీ, 'అయినకాడికి జమాబందీగా వ్యవహారం చేసుకొని రావడానికిగానీ, ఆయన యెంతవరకూ సమర్థించుకురాగలరు?

ఇది యిలా వుండగా గోరుచుట్టుమీద రోకటిపోటులా మొక్కగా యెక్కణ్ణించో తెచ్చిన వొక వ్యాజ్యంలో చిక్కుకోవడంమూలాన ఆయన మనసుకు అసలే శాంతి లేకుండాపోయింది ఎవ్వరు ఏమడిగినా చీదరించుకొనేవాడు. మాలాటివాళ్ల విషయమై చెయిచేసుకున్న ఘట్టాలు కూడా కొన్ని వున్నయ్.

నా నాన్నకు కోపమెక్కువ అందుకని మా అమ్మకూడా ఆయన యెదుట నిల్చుని నా విషయం ప్రస్తావించడానికి జంకుతూ వుండేది. అక్కడికీ తల్లిప్రాణం వూరుకోక ఒకటి, రెండుసార్లు మా మామయ్యచేత అడిగించింది కూడా. ఆయనకీ మా నాన్న దగ్గిర్నుంచి సరైన సమాధానం అందలేదు. అంతకంటే మేం స్వతంత్రించి సాధించదగినది కనబడలేదు. కాలం తీర్పుకై [illegible] వున్నాం.

పట్టుమని పదిరోజులైనా గడవకుండానే మా అత్తయ్యకేదో పెద్ద జబ్బు చేసిందని ఉత్తరం రావడంమూలాన అమ్మా, నాన్నా అక్కడకు వెళ్లారు. ఇంక యింట్లో వున్న అందరినీ— పెద్దా, చిన్నా—సాకుకు రావడం నాపైన బడ్డది. తొమ్మిదింటికల్లా మా అన్నయ్యకు అన్నం పెట్టి టిఫిను కారియరిచ్చి స్కూలుకు పంపాక, మిగిలినవాళ్లతో ప్రొద్దస్తమానమూ సతమతమౌతూ వుండేదానిని. యీ సంసారం యీడ్చే భారం నామీద యెందుకు పడిందో......—భవిష్యత్తులో నాకు కొంత అనుభవాన్ని చేకూర్చిందీ స్వల్ప వ్యవధిలో నేను పడిన ఆరాటం—

మా నాన్న ...ళ్ల వారం రోజులైంది. ఉత్తరం ముక్కైనా వ్రాయలేదు అప్పుడే కాదు; ఉత్తరాలు వ్రాయడం విషయంలో ఆయన యెంత మొండివాడంటే, యీనాటికీ అల్లుళ్లు చెప్పుకొంటూనే వుంటారు! ఏనాటికానాడు అన్నయ్య ఇంటికి రాగానే అడుగుతూ వుండేవాడు 'నాన్నదగ్గిర్నుంచి ఉత్తరం వచ్చిందా?' అని. రాలేదనే నా సమాధానం విన్నాక వాడు చిరాకుపడుతూ వుండేవాడు.

ఒక శనివారంనాటి మధ్యాహ్నం మా అన్నయ్య భోజనం చేశాక అత్తయ్యగారి వూరు వెళ్లాలని బయలుదేరాడు. నాన్న ఉత్తరం వ్రాయలేదనే ఆదుర్దాకంటే అత్తయ్య కెలా వున్నదనే దిగులుతోనే మేమందరం

కుమిలిపోతున్నాం—అత్తయ్యదగ్గిర మాకున్న చనువు స్వతంత్రమూ మా అమ్మదగ్గిరకూడా లేదేమో అనిపిస్తుంది! ఆవిడగారి చల్లనికళ్లలో అన్నపూర్ణస్వరూపం ప్రత్యక్షమయ్యేది. ఒకప్పుడు మేమందరమూ అత్తయ్య ఒడిలో దాగుడుమూత లాడుకొన్నవాళ్లమే. మా యింట్లో యే కార్యం కరామత్తులు జరిగినా మా అత్తయ్య వచ్చి వడ్డించనిదే అది జరిగినట్టే వుండేదికాదు. ఆవిడగారు అన్నంపళ్లెం పట్టుకుని, వీణానాయించినట్టు బంతులవెంట పాటలు పాడుకుంటూ పోతూంటే అది నిజంగా అన్నపూర్ణ చేసిన విందులాగుండేది! నాకు బుద్ధి తెలిసిన తరువాత మా మూడో అక్కయ్య పెళ్లికీ, మా అన్నయ్య వొడుగుకూమాత్రం ఆవిడ వచ్చింది. అయినా సంవత్సరానికొక్కసారైనా వేసవికాలపు సెలవులలోవచ్చి రెండు వారాల పాటు ఉండిపోతూ నే వుండేది.

ఆవిడకు ఆడసంతానం లేదు. మా అన్నయ్యను చూసినప్పుడెల్లా 'అలుడూ' అని ముద్దులాడుతుం
నాకు కూతురు పుడితే తప్పక నీకిచ్చి చేసుకుంటావని మురిసిపోతూ వుండేది. అన్నయ్య అంతకంతకూ పెద్దవాడైనా, ఇంటికి వచ్చినప్పుడు వాడికి తలదువ్వి బొట్టుపెట్టనిదే ఆవిడకు తోచేదికాదు.

అత్తయ్యకు జబ్బుచేసిందని ఉత్తరం వచ్చిన నాడే మా నాన్నతోపాటు వాడూ ప్రయాణం కట్టాడు. అయినా, ఇంటిదగ్గిర పిల్లలు ఒక్కరూ వుంటారని గదమాయించి మా నాన్న వాడిని తీసుకువెళ్లలేదు. ఆనాటినించి దిగులుపడుతూ నే వున్నాడు వాడు. ఇక మనసు ఉండబట్టలేక మానాన్న వెనుబోయే చీకాట్లకైనా తల ఒగ్గి బయల్దేరాడు.

సంచి చేతబట్టుకొని గడపలో కొచ్చేసరికి అప్పుడే వచ్చిన మానాన్న కర్ర మూల్లో పెట్టి చొక్కా విప్పుతూవుండడం యిద్దరమూ చూశాం. మమ్మల్ని చూసినా మాట్లాడకుండా, కొల్లాయి గుడ్డతోపాటు చొక్కాకూడా భుజాన వేసుకుని, నూతివేపుకి నడుస్తున్నాడు మా నాన్న. సంచి గడప మీద పెట్టి వెంట నడుస్తూ అడిగాడు అన్నయ్య. 'అత్తయ్య కెలా వుంది నాన్నా?' అని. అక్కడనే ఆగి వెనక్కు తిరిగిగాశాడు నాన్న "ఇంకెక్కడి అత్తయ్యరా?" అంటూ అదోలా నిస్పృహగా చెయి విసిరాడు. అన్నయ్య పెద్దగాఅరిచి అక్కడే కుప్పలా కూలబడిపోయాడు, నేను గుమ్మానికి చేరగిలబడ్డాను—

ఈ సంఘటన మా సంసారంలో—ముఖ్యంగా నా జీవితంలో గొప్ప మార్పుకు కారణమైంది—

ఎలాగో ఆరు నెలలు దొర్లిపోయినై. ఒకనాటి రాత్రి భోజనాలయాక మేమందరమూ పడుకునివున్న సమయంలో అమ్మా, నాన్నా వొక విషయాన్ని గురించి ఘర్షణపడుతూవుండడం విన్నాను నేను. కేవలం ప్రతిమాలుకుంటున్న ధోరణిలో సాయిలా పాయిలాగ చెబుతూన్నది అమ్మ; నాన్న చీటికీ మాటికీ కసిరి కొడుతున్నాడు.

"నువ్వామాట అన్నావంటే పరువు దక్కదు జాగ్రత!"

"నా అంతట నేను అంటున్నానా? వాడు నోరు చేసుకు అడిగించాడుగదా, అదేదో విచారించాల్సిన భారం మనమీదకూడా వున్నదంటారా లేదా?"

"నా మీద యేమీ లేదు, నేను చేతులారా దాని గొంతుకొయ్యాను. అయిననాటికే అవుతుంది, ఆ పాచి మాట రాకుండా చేదామనుకొన్నాను, వచ్చింది రానే వచ్చింది చూస్తూ చూస్తూ నా అంత వాడికిచ్చి కడతానా?"

"వాడి విషయం వొచ్చేసరికి అంతలూ, ఇంతలూను. మీ మానానికి మీరేం జేశారు చెవుదుడూ?"

"అదంతా నీకవసరం. నాకప్పటికి పిల్లలు లేరు నీ అన్నకు ఐదుగురు మొగపిల్లలు!"

"అందుకనే, కాచిపోసే దిక్కైనా లేకనేగా వాడూ అనుసతున్నాడు! చేతికెదిగిన ఆడపిల్లవుంటే వాడింత దిగులూ పడేవాడేకాదు. అయినవాళ్ళు వున్నందుకు అవసరానికి ఆదుకుంటే..."

"అది నావల్ల కాదుగానీ, నువ్వు అనవసరపు వ్యవహారం నెత్తికి తెచ్చుకోకు, నోరు జారావంటే నీ పరువూ, నా పరువూకూడా దక్కదు"—ఈ తీరుగా జరిగింది వారి సంభాషణ. విదిలించుకొన్నట్లుగా చరాల్న సావిట్లోకి వచ్చాడు నాన్న.

అంతకు ముందునించే మంచంమీద కూర్చుని వింటూన్న నాకు గుండెల్లో గతుక్కుమన్నట్టయింది. నావంక ఒక్కసారి తీవ్రంగా చూసి వాకిట్లోకి నడిచాడాయన నేను కుక్కినపేనులా తిరిగి మంచం మీద వాలిపోయాను.

అప్పటికి నాకింకా పసితనమే! జరిగిందేదో విచారించుకుని ఖచ్చితమైన నిర్ణయాలు చేసుకోగల

తాహతు నాకు లేదు. అయినా మనసులో వొక విధమైన గుబులు బయల్దేరింది. వెన్నున అదురుగా చలి వచ్చినట్లయింది దుప్పటి ముసుగు పెట్టి నా అంతట నేనే వణికిపోవడం మొదలు పెట్టాను. అమ్మను పిలవడానికి గొంతు పెగలలేదు. మరేం జెయ్యాలో కూడా నాకు పాలుపోలేదు.

అప్పటి నా వూహాలూ తలంపులూ అన్నీ యేకరువు పెట్టలేనుకాని వొక్కటిమాత్రం ఇప్పటికీ నా కళ్లకు కట్టినట్లుంటుంది-- నేనప్పుడు ముసుగుతిన్ని కన్ను మూశానో లేదో...మా అత్తయ్య యెదురుగుండా నిల్చుని ఓక్క మొహంతో నాకేదో చెప్పొచ్చినట్లయింది.

“ఏమిటత్తయ్యా?” అని నేనడిగాను. “ఏముంది తల్లీ! మామయ్య కులాసాగా వున్నారు కాదూ, శాస్త్రి ఆడుకొంటున్నాడా? (శాస్త్రి మా అత్తయ్య పెద్ద కొడుకు) అమ్మ చెప్పినమాటలు వినకేం? నీ యిష్టం ప్రకారమే చేసుకో! నాన్న నీకేదో చెప్పాలనుకుంటున్నారు, విను! విను!!” అంటూ కొంగు చాటుచేసుకుని వలవలా యేడ్చింది వెన్నున చరచినట్లయి ఉలిక్కిపడి లేచాను. ఆ రోదనధ్వని యిప్పటికీ నా చెవులకు విన్పించుతూనే వుంటుంది. నా చుట్టూ ఏమీ లేదు. మా అన్నయ్యా, చెల్లెలూ తమ్ముడూ అందరూ వొళ్లెరగకుండా నిదురపోతున్నారు.

అత్తయ్య చెప్పిన మాటలకు అర్థమేమిటో అప్పట్లో నేను ఊహించుకోలేకపోయాను. ఆ క్షణం నించి యెంతో సేపటివరకూ నా కంటిమీద కునుకు పడలేదు—అమ్మ నాన్నను అడగటం, అత్తయ్య కనబడి అమ్మమాట వినవద్దనడం యీ క్రమమంతా యేమిటో—వాళ్ల సంభాషణలోగల అర్థం పూర్తిగా తెలుసుకొన్నానేమో...అది నా రాబోవు జీవితం గురించేనని నిర్ణయించుకొన్నాను. నాగురించి తల్లిదండ్రులు అలా మథనపడుతున్నందుకు నాకు తెలియకుండానే, విచారం దుఃఖం పొర్లుకొచ్చినయ్. ఎంతోసేపు నిశ్శబ్దంగా కుమిలి యేడ్చాను.

తెల్లారాక అమ్మగానీ, నాన్నగానీ నాకా విషయం గురించి చెప్పనేలేదు. కాని, యే క్షణానికా క్షణం అత్తయ్య కనులయెదుట మెదులుతూ వున్నట్టే వుండేది—కాని చిత్రమేమిటంటే ఇది జరిగిన పదిహేను రోజుల్లో నే మా బంధువుల్లోను, చుట్టుపట్టా నా గురించిన అపవాదొకటి వినవచ్చింది అది అపవాదేనని నే నీనాటికీ అంటాను. అదేమిటంటే:

నన్ను మామయ్యకిచ్చి పెళ్లి చేస్తానని మా నాన్న బలవంతం చేసినట్టు, నేనందుకు వొప్పుకోక, పైగా పట్టుదల కంతపనీచేసి తీరినట్లయితే ఏ నుయ్యో గొయ్యో చూసుకుంటానని నే నన్నట్లూను—ఇది యెంత తీవ్రంగా వ్యాపించిందంటే మాకు అరవై మైళ్ల దూరంలోవున్న మా చిన్నఅక్కయ్య నాన్నకొక ఉత్తరం వ్రాస్తూ, లక్ష్మిని మామయ్యకిచ్చినట్లైతే తనను చంపుకున్నంతవొట్టేనని గట్టిగా హెచ్చరించింది. ఆ కవరులోనే నా పేరున ఒక ఉత్తరం వ్రాస్తూ 'నాన్న చెప్పేమాటలకు నువ్వేమీ బెదరవద్దనీ, అంతగా ఆయన నీగొంతుకు ఉరిపోయదలిస్తే అబ్బాయిని వెంటపెట్టుకుని తనదగ్గిరకి వచ్చెయ్యమనీ వ్రాసింది.

ఇంక నేనేమనుకోవాలి? ఏపాపమూ యెరగని నామీద యిట్టివాడుక లెలా పుట్టినయ్? ఎవరిద్వారా వ్యాపించినయ్? నా ప్రశ్నలకు సమాధానమే దొరకదు!

ఏది యేలాగున్నా, అనాయికంగా నిమ్మకి నీరెత్తినట్లు బ్రతికే నాలో అర్థం లేని ఆందోళనవొకటి బయల్దేరింది. ఎవరింటిపెరట్లోకెళ్లినా నన్ను వెక్కిరించినట్లు మాటాడేవాళ్లే! చీటికి మాటికీ యేదో వొకమాట సందున పెట్టి దెప్పి పొడిచేవాళ్లే!! మరి నేను మనసు విప్పి యెవ్వరితో మాట్లాడాలి? అమ్మకూడా ఆనాటి నించి ముభావంగానే వుంటున్నది. నాన్నను మాస్తే నాకు మొదట్నించీ హడలేకదా!

ఒంటరిగాకూర్చొని యేదైనా పనిచేసుకొందామనుకున్నా, లేక చదువుకొందామనుకున్నా అంతటి స్వతంత్రమూ, చనువూ యెక్కడివినయ్? అదీకాక యిలాటి గజిబిజీలో వొంటరితనం నాకింతకంటే భయంకరమనిపించేది. చదువుకొని వూరడిల్లడమనేది ఆనాటికి నాకు గల జ్ఞానానికి సాధ్యమయ్యేది కాదు గదా! మరేం జెయ్యాలి? ఇంటా బయటా నాకు సుముఖమైన వాతావరణం కనిపించలేదు. ఎదటి అమ్మాయి ఏమి బాధ పడుతుందోనని విచారించేవాళ్లు మా యిరుగు పొరుగువాళ్లలో లేకపోవడం విచారకరం! అందరూ పామేదాలే! ఎవరికి వారొక రాజ్యాన్ని యేలగలిగినంతటి ధీమాగా మాట్లాడుతారు. ఒకొక్కప్పుడు కచ్చగా యేడ్చేదానిని. బైటకా చిహ్నాలుకూడా కనబడకుండా వుండాలని నేను పడినపాట్లు అన్నీ యిన్నీ కావు. ఇది జరిగిన వారం, పదిరోజులకల్లా గోరుచుట్టుమీద రోకటిపోటులా మరో మిడిమేళం వచ్చిపడింది—

మామయ్యగారి వూరినించి అమ్మమ్మ వచ్చి నాన్నతో యీ విషయమే ప్రస్తావించేసరికి ఆయనకు మరీ పుండు రేగినట్లయింది. ఇంట్లో వున్న అందరూ వింటూవుండగానే చీదరించుకు మాట్లాడాడు. అమ్మమ్మకు ఆయన చెప్పిన సమాధానం కసిరి కొట్టినట్టే వున్నది అచ్చంగా. మా అమ్మకూడా ఆ క్షణాన నోరెత్తలేదు. అయినా ఆవిడ పట్టు వీడలేదు. ఎలాగైనా వచ్చినపని చేసుకుపోవాలనే బింకం మీదనే వున్నది. సంవత్సరకాలం దగ్గిరపడుతున్నది, రెండోయేడు అడుగుపెడితే పెళ్ళిమాట తలపకూడదని ఆవిడ తహతహ! నాన్న చెప్పిన సమాధానానికి యెదురు చెప్పకుండానే నా అంగీకారంతో తన నిర్ణయానికి కొంత బలం సంపాదించాలని, ఆనాటి సాయంత్రం మెల్లగా నన్ను చేరబిల్చి తల దువ్వుతూ, తన మనసులో వున్న క్షోభనంతా వెళ్లగక్కింది—

ఏ విధానైనా మామయ్య సంసారం పచ్చగా వుండాలంటే అది నా వల్లనే సాధ్యమని ఆవిడ చెప్పినమాటల్లోని సారాంశం. లోగడ నాపై వచ్చిన అపవాదు సంగతి చెప్పి అది యెవరో గిట్టనివాళ్ళ కుత్సితాలవల్లనే పాకిపోయిందనీ, తమ కేపాపమూ తెలియదనీ, మామయ్యకూడా యెంతగానో నొచ్చుకొన్నాడనీ— ఇదంతా నన్ను వొప్పించడానికే అన్నట్లు నా కళ్లముందరే వలవలా యేడ్చింది. ఏదియేమైనా చివరకు తానాశించిన ఫలితం నా దగ్గిర పొందలేకనే పోయింది. ఏమాటకూ నేను సమాధానం చెప్పక కళ్ళప్పగించి వూరుకొన్నాను.—ఆనాడు అత్తయ్య నాయెదుట నిల్చున్నప్పటి బిక్క మొహం నా [illegible] మెదులూ వున్నది

నేను సమాధాన మీయకపోవడం, లోపలవున్న యేదో కక్షను అంటిపెట్టుకుని కసిగా మొండి చరిచినట్లు అర్ధంచేసుకుని వుంటుందావిడ—అమ్మకుకూడా నా వైఖరి యిష్టంలేకపోయిందని ఆవిడలోని ముఖభావం వల్లనే అర్థంచేసుకొన్నాను. మొన్నాడు పొద్దున్న కొంగు దులుపుకొని వెళ్ళిపోయింది అమ్మమ్మ.

నాన్న నిద్దరనుంచి లేవనట్టుగానే యెంచి అమ్మతో మాత్రం చెప్పివెళ్ళిపోయిందావిడ. సంగతంతా తెల్సుకున్న నాన్నకు అది మరింత కోపకారణమైంది. ఎన్నోవిధాల అమ్మను దూషించాడు కూడా. తిరిగి అమ్మమ్మను గడప తొక్కనీయనన్నంత కఠినంగా ప్రతిజ్ఞ చేసినట్లే వినిపించినయ్ ఆయన మాటలు—కంటబడిన అందరితోనూ నాన్న విషయం వివరంగా చెప్పివెళ్లింది అమ్మమ్మ. ఇది, నాన్నను గురించి, ముఖ్యంగా నన్ను గురించి యాగీచెయ్యడం కాక మరేమిటి? ఇది విన్నాక నాన్న మరింత రెచ్చిపోయాడు. ఇంత చిన్న విషయాన్ని గురించి—వాళ్ళ దృష్టిలో పెద్దదే కావచ్చు—ఇంత నిర్మొహమాటంగా, కచ్చగా మానవత్వాన్నే మరిచి మాట్లాడుకొంటారని, వాదులాడుకొంటారని నా పసి మనసుకి ఏమర్థమవుతుంది? కాగల దానికంతకీ కళ్లప్పగించి వూరుకోవడం మినహా నాకేమీ తోచలేదు.

పదిహేను రోజులు పదిలంగానే గడిచిపోయినయ్ తలవని తలంపుగా మా చిన్నక్కయ్య, బావగారు. దానిని చూడగానే నాకూ ప్రాణం లేచివచ్చినట్లయింది. అందుకు కారణంకూడా లేకపోలేదు. మా చిన్నక్కయ్య అంటే మా అందరిలోకంటే మా నాన్న [illegible] యిష్టం. దాని మాట అంటే ఆయనకు గుండెకాయ. దానికి తగిన చదువూ, స్వతంత్రమూ వున్నయ్ ఆయనదగ్గిర. ఎదుటబడి ఖచ్చితంగా తెగించి మాటాడగలదు. దానిని వదిలించుకోడానికి కొటడు నాన్న. మా అందరిలోకి చదువుకొన్నది కూడా అదే. హిందీ విశారద పాసయింది. మా బావ కూడా బి.ఏ బి ఇడి. వాళ్ల దాంపత్యం చూస్తే మా నాన్నకు బహుముచ్చట. మా అన్నయ్యనుకూడా మాటవరసకి తిడుతూ వుండేవాడు 'చిన్నబావని చూసైనా బుద్ధికలిగి చదువుకోరా' అని.

వచ్చీరాగానే మేమంతా వాళ్లచుట్టూ మూగాం. మామూలు తరహాలోనే మా బావ నాతో కొంతసేపు సరసాలాడాడు. నేనంటే ఆయనకు అలుసెక్కువ. నావి రెండూ మెల్లకళ్ళు కావడంవల్ల ఆయనవంక చూసి మాట్లాడుతున్నా చూడడంలేదనే దబాయిస్తాడు!

సరే, అక్కయ్య అమ్మా మామూలుగానే మాట్లాడుకున్నారు. ఏ సందువాళ్ళైనా నా ప్రస్తావన వస్తుందేమోనని వెనక వెనకే తిరుగుతున్నాను—

మధ్యాహ్నం భోజనాలయ్యాక అక్కయ్య వచ్చి మెల్లగా అంటించింది నాన్నకు. అంతటితో అమ్మకూడా వచ్చింది. అందరూ కలిసి మొదట్నించీ నేను చెప్పిన రగడ అంతా జరిపారు. వీళ్ళలో మాట్లాడకుండా వున్నవాడల్లా బావ వొక్కడే. అవుననీ, కాదనీ చెప్పడు. అన్నీ ఆకళించుకొని వూరుకోవడమే ఆయన పని.

చివరకు నాన్న తేల్చిన సారాంశం యిది- "నేను చచ్చినా యీ సంబంధానికి వొప్పుకోను. మీ

అమ్మకుమాత్రం బుద్ధిచెప్పి వెళ్లు!" అన్నాడు, అక్కయ్యతో. ఏవీ అనలేక అమ్మకు కళ్లనీళ్ల పర్యంతమయింది.

"అంతా వద్దంటే నేనేనా పట్టుకు పాకులాడేది? తల్లితోడూ కనక ఆమాత్రం అనుకోవడం కూడా తప్పేనా యేమిటి?" అంటూ అవిడ నిరాశగా అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

ఆనాటి సాయంత్రమే మేమందరం కలిసి కృష్ణ వొడ్డుకు షికారు వెళ్ళాం. అన్నయ్యా, బావా రేవు దాటి అవతలగట్టుకు వెళ్లారు. అక్కయ్య నన్ను దగ్గరకు పిల్చి జరిగిన సంగతేమిటని నే చెప్పిదంతా విన్నాక, అయినా మామయ్యను చేసుకోవడం నీ కిష్టమేనా? అని సూటిగా అడిగింది. ఇష్టం లేదన్నాను. అత్తయ్య కన్పించిన సంగతి చెప్పాను. అత్తయ్య పేరెత్తేసరికి దానికీ కళ్ళల్లో నీళ్ళు తిరిగినయ్, ఇలా అన్నది—

"ఎందుకనో నాకూ యిష్టంలేదే! గంపెడు సంసారం యెలా ఈదుకుంటాడో మామయ్య పాపం!" అంటూ కొంతసేపు జాలిపడింది.

"బావ యేమంటాడు?" అనడిగాను.

"ఆయనమాత్రం యేం జెప్తారు? అయినా, నాన్న సంగతి తెలిసినవాళ్లెవ్వరు మాత్రం సాహసించి సలహా యిస్తారు? ఒకటి, రెండుసార్లు నాతోనే అన్నారు, నీకు చెప్పిన సమాధానమే ఆయనకూ చెప్పాను. అవలా వుండనియ్యి! ఇప్పుడు మరో సంగతి నాన్నతో మాట్లాడాలని వచ్చాను. అయినా ఏలూరు సంబంధం వచ్చినప్పుడు ఆయన యెందుకు కాదనాలి?" అంటూ నావంక చూసింది అక్కయ్య.

"ఆస్తిపాస్తులు అంతగా లేవని; పెళ్లి చెయ్యాల్సిన ఆడపిల్లలు ఇంకా నలుగురు ఉన్నారట!" అని నేను విన్నది చెప్పాను.

"ఆస్తులు యెక్కణ్ణించి వస్తయ్? మనకేమో మొత్తలేవను. అన్ని లక్షణాలూ వనగూడి రావాలంటే యెలా కుదురుతుంది? ఈ కొడుకు పెద్దవాడనీ, ఆయన పైకివచ్చి చెల్లెళ్ళకు పెళ్లి చెయ్యాలిసి వస్తుందనేగా యీ ఆయన వూహ? ఈయన అచ్చంగా కోర్టువ్యవహారంలా ఆలోచిస్తాడు! సాక్షిగా విచారించడూ, సాయిలా పాయిగా జరిపించుకొని పోడు. వట్టి మొరటు మనిషి!" అన్నది మా అక్కయ్య ఏదో ఆలోచిస్తున్నట్టు.

"అయితే నన్నిప్పుడేం జెయ్యమంటావు?" అనడిగాను.

"నువ్వు చేసే దేమున్నది? ఇది అంతంతమాత్రాన తేలిపోయేదైతే యెవ్వరేం జేసినా సరిపోతుంది కాని..." అంటూ మాట సగంలోనే వూరుకొన్నది అక్కయ్య.

"మరేమౌతుంది?" అన్నట్టు దాని మొహంలోకి ఆతుర్దాగా చూశాను నన్నా ప్రశ్నించి కదిలించి, వూరుకోబెట్టాలనే తలంపు దానికి లేకపోయినా, నేనడిగినదానికి కొంత చిరాకు పడినట్టు కనబడింది. పైకి ఏమీ అనలేక మౌనంగా వున్నట్టు తోచింది నాకు. అంతకంటే నిర్బంధించి అడగ సాహసించలేకపోయాను. అసలు సమస్య నెలా గెత్తుకోవాలో నాకూ అర్థం కాలేదు.

మా సంసారాని కింత గంపకతెరగా పరిణమించిన నా పెళ్లిసమస్యయేనా దీనికంతకీ కారణం? ఎవరెన్ని విధాల ఆలోచించినా, తర్కించినా అది మరింత విషమమౌతున్నదే కాని, యెక్కడికక్కడ అడ్డంకులు తీర్చుకుని ముందుకు సాగిపోవడం లేదు. పట్టుదలలు పెరుగుతున్నయ్, ఎవరికి వారు ఏదో తల్వి తలకెత్తినట్టు యెదటివారితో మాట్లాడుతూ వుంటారు. ఇదికూడా నాన్నకు నచ్చజెప్ప యత్నించకపోతే మరెందుకు వచ్చినట్టు? మామయ్యమీద మరి నాలుగు మాటలు ఆయనచేత అనిపించడానికేనా? అది కానే కాదు. ఆయన మొరటు మనిషి అని, సాక్షిగా సంసారపక్షంగా ఆలోచించి చేయమని, ఇప్పుడేగా అన్నది? మొత్తానికి దీనిమనసులో యేదో వున్నది, అది నా చెవినివేస్తే కొంత ఊరట గల్గుతుంది కదా! ఏమైనా దానంతట అది చెప్పకపోతే నేను మాట్లాడించ కూడదన్న నిర్ణయానికి వచ్చాను. మరొక వేపుకి తిరిగి చుట్టూవున్న ప్రకృతి శోభ పరికించ మొదలు పెట్టాను.

ఇంకా పొద్దుగూకడానికి ఆట్టే కాలంలేదు. ఏటి వొడ్డునవున్న నాకా క్షణం యెంతో హాయిగా వున్నది. మా అక్కయ్యకూడా సన్నని యేటిపాయలోకి దీక్షగా చూస్తున్నట్టు కనబడింది. మావూరికి అదొక్కటే అందం. ఎప్పుడైనా మనసు బాగుండనప్పుడు అక్కడకు వెళితే కాలం యిట్టే గడిచిపోతుంది. కాని ఇంతకాలంగా అక్కడే వుంటున్న నాకు, ఆ సంగతి అనుభవానికి రాలేదు. అయినా అంతటి సాహసం నాకేది? ఈనాడు అక్కయ్యతో యిక్కడకు రావడం వొక కొత్తలోకంలోకే వెళ్లినటయింది.

నేనూ అటు కేసి చూస్తున్నాను, కాళ్ళక్రింద యిసుక గుంటలు తవ్వుతున్నాను. ఆ దిక్కున రెల్లు దుబ్బుల్లోనించి గుంపులు గుంపులుగా బారులుతీర్చి యేటిమీదుగా యెగిరిపోతున్నై కొంగలు; చిన్నతనం స్ఫురణకు వచ్చింది. ఏనాడో యీ అక్కయ్య మా చెల్లెలి నెత్తుకుని 'కొంగ కొంగ గోళ్ళో' పాట పాడుతూ లాలించి ఆడించడం యెరుగుదును. ఆనాటి అమాయికపు దశ నాకు నెమరుకు రాసాగింది. ఈనాడు ఆ అక్కయ్య వొడిలో కూర్చుని వొక పెద్దజీవిత సమస్య నెదుర్కొంటున్నాను; అప్పటి నా భావం యీనాటికీ మనసులో ముద్రవేసినట్లుంటుంది! ఇద్దరి మనసులూ కొన్ని నిముషాలపాటైనా, అన్యాక్రాంతాలై ఉండివుంటయ్!

సరిగ్గా ఆ సమయానికే పచ్చిమెరపతోటల్లో నించి ఇళ్ళకుపోతున్న కొందరు కూలెతలు మా దిక్కుగా రావడం చూశాను. వాళ్ళు రోజూ అటు పోతూనే వుంటారు; మెరపపళ్ళుకోసి కళ్ళాల్లో కుప్పలుగా పోస్తావుంటారు. చిన్న చిన్న బుట్టలు బుజాన పెట్టుకుని వయ్యారంగా యేటిఒడ్డు వెంట నడిచివస్తున్నారు ఒకళ్ళ మొహంలోనూ వీసమెత్తు విచారం కనబడదు, ఒకరితో వొకరు సరసాలాడుకుంటూ కేరింతలు కొడుతున్నారు అక్కయ్య ఆలోచిస్తున్నట్లే వున్నది. నేను ప్రక్కకు తిరిగి వాళ్ళవంకే చూస్తున్నాను.

మేమిద్దరం యిలా యిసుకలో చతికిలబడి కూచోవడం వాళ్ళకు వింతగా తోచిందేమో... మమ్మల్ని గురించే మాట్లాడుకొంటున్నారా? కాని వివరాలకోసం చెవులు రిక్కించలేదు. వాళ్ళలో కొందరు నన్నెరిగున్నవాళ్ళే! బహుశా నాగురించి కాదుగదా వాళ్ళ మాటలు? వోక్రమానికి వాళ్ళలో నించి వొక వ్యక్తి మాకు దగ్గరగా వచ్చి "ఇక్కడ కూచున్నారేం సిన్నెమ్మగోరూ?" అని అడిగింది. నేను ఉలిక్కిపడి ప్రక్కకు తిరిగిచూడడం, నాతోపాటే అక్కయ్యకూడా ఆలోచనలనించి బయట పడడం జరిగినయ్. ఆ మనిషి పేరు మాలక్ష్మి. మా యింట్లో అప్పుడప్పుడూ పనిపాటలు చేసిపెడుతూనే వుంటుంది. మా సంసారంగురించి చాల సంగతులు దానికి తెలుసు. అక్కయ్యనుకూడా యెరిగివున్నదే. అది మా యెదట కూర్చొని మాట్లాడుతున్నంతసేపూ అక్కయ్యే యెక్కువ పాత్ర నిర్వహించింది. పిచ్చాపాటే అయిన తరవాత నా పెళ్ళి వ్యవహారంలోకి దిగారు. అదేవో అడగడం, అక్కయ్య సమాధానాలీయడం జరిగిపోయింది. నాకిదంతా చిరాకనిపించి వొకపెడగా తిరిగి కూర్చున్నాను. దేనికీ స్వతంత్రించి స్వంత అభిప్రాయంగా సమాధానం చెప్పలేదు అక్కయ్య. ఏదో వొక నెపం నాన్నమీదనో, మరెవ్వరిమీదనో మోపుతూనే వున్నది—'ఇంతకీ ఆ ఘడియ రాలేదని, పెదవి విరిచి వూరుకొన్నది మాలక్ష్మి. అంతే నన్నట్టు వంతపలికింది అక్కయ్య. మరి నా ప్రశ్న అలాగే మిగిలిపోయింది?

మనసు విప్పి అక్కయ్యతో మాట్లాడుకొనే అవకాశం కలగలేదు. మూడో వ్యక్తి దగ్గిర వున్నప్పుడు స్వేచ్ఛగా అడిగి తెలుసుకోవడం సాధ్యం కాదుగా! నాకేమీ పాలుపోలేదు. మధ్య ఇదెందుకు రావాలన్నట్టు మాలక్ష్మివంక కొరకొరా చూశాను.

'బావ ఇంకా రాలేదే!' అని నాతో అన్నది అక్కయ్య. 'బాబుగారుకూడా వచ్చారా?' అంటూ ఆశ్చర్యంగా చూసింది మాలక్ష్మి. అవు నన్నది అక్కయ్య. 'అయితే నేనూ వారిని చూడాలి' అంటూ అక్కడే మఠం వేసింది మాలక్ష్మి. నా పని మరీ ఇరకాటాన బడింది. అయన్ను చూడాలని దాని కింత ఆరాట మెందుకో!

అది వొక్కతేకాదు; మా చిన్నక్కయ్యా, బావా వొచ్చారంటే యెందరో వేలంవెర్రిగా వాళ్ళను చూడడానికి వస్తూవుండేవారు. నా దృష్టిలో ఆయన మామూలు బావే కావొచ్చు. కాని దానిని యెలా అక్కణ్ణించి పంపివేయడం? అక్కయ్య అందుకు కాదనక దానితో కబుర్లు మొదలెట్టింది. మరి నా సంగతో...పిల్లికి చెలగాటము, ఎలుకకు ప్రాణసంకట మూను. కొంచెం దులుపుకొని అక్కణ్ణించి లేచిపోదామా అన్నంత కసిపుట్టి గొంతుదాకా వుక్కిలింత లయ్యింది నాకు. ఆపని చేసే శక్తి లేకపోయింది!

నే నల్లా అక్కయ్య చెప్పే అభిప్రాయానికై ఆశపడి వెళ్ళాను. మరి యీ అవాంతరం యెందుకు వచ్చినట్టు? ఇంతమాత్రానికే వొక దారీ, తెన్నూ తెలియని నా స్వార్థాన్ని పురస్కరించుకొని పాపం! మా లక్ష్మి సాధుస్వభావాన్ని శంకించానా, అనిపించింది. ఇంతలోనే యేటి అవతల గట్టుమీదుగా అన్నయ్యా బావా వస్తున్నట్టు చూశాము. మేమూ వాళ్ళు దిగివచ్చే రేవుకు తిన్నగా నడిచాము. వేసవి కాలంలో మావూరిదగ్గిర రేవు పాటారినప్పుడు దిగి వెళ్ళడం అలవాటు.

ఆ రాత్రికి అక్కయ్య నాన్నతో యీ సంగతే చెప్పేసరికి ఆయనకు అత్తిరువులో కారం కలిపి రాచి

నట్లయింది. దాని మనసులోవున్న దేమిటో ఖండితంగా చెప్పివెయ్యదు. మాటిమాటికీ ఆయనను రెట్టించి అడగడంలో అర్థమేమిటి? ఇన్నాళ్ళుగా ఆయనతో నిర్భయంగా మాటాడనేర్చినది యీనాడు ఇలా మొండిపరిచి వూరుకోవడంలో అర్థం యేమై వుంటుంది? నన్ను పురస్కరించుకొని నాన్నతో తల పట్టు పట్టడం యిష్టంలేకనా? లేక తాను స్వతంత్రించి నాకై వొక వ్యక్తిని నిర్దేశించితే రాగల ఫలితానికి తనూ బాధ్యురాలు కావలసివుంటుందనే జంకు వల్లనా?—అప్పుడు నాకీ చివరిమాటే సముచితంగా తోచింది. కాకపోతే వొక్క తల్లి కడుపున పుట్టిన నన్ను గురించి ముభావంగా వూరుకోవడంలోని ఆంతర్యం యేమిటి? లేకపోతే అది నాపై చూపిన నిర్లక్ష్యాన్ని యేమని వ్యాఖ్యానించుకోవాలి?

జీవితంలో కష్టసుఖాలనేవి సంభవిస్తూ వుంటాయని వినడమే గాని, అవి యెలా సంభవిస్తాయో నాకంతగా తెలీదు. అయితే నా జీవిత విధానంమీద, లేక నాకు కాబోయే పెండ్లిపైన అవి రెండూ ఆధారపడి వుంటయ్యాని తెలుసుకోలేకపోయాను. అక్కయ్యకు తెలీదని యెలా అనగలను?

ఒకరి కష్టసుఖాలు నిర్ణయించవలసిన సమయం వచ్చినప్పుడు యెదటివాళ్లెంతటి పూనికతో పని చేయగలరో... లేక స్వార్థం వదులుకొని నిర్ణయాలు చేయగలరో అనేదికూడా నాకు కొత్తవిషయమే. అప్పుడప్పుడూ నాన్న, యీ సంబంధం చేసుకొని జీవితంలో అదెంత సుఖపడుతుంది? అని అమ్మను రెట్టించి అడుగుతూ వుండడం విన్నాను. ఇది ఆయనకు పరిపాటి అయిపోయింది. అక్కయ్యకూడా మొదటిరోజున ఆయనతో వాదించినప్పుడు అలాటివైఖరినే అవలంబించింది కనక నేను సుఖంగా బ్రతకగలగాలీ అంటే వీరంతా నాకై నిర్ణయించే సంబంధంపైన ఆధారపడి వుందన్నమాట! అందుకనే అక్కయ్యను మరీమరీ అడిగాను. అది సాక్షీగా సమాధానమిచ్చి తప్పుకున్నా, గోడమీది పిల్లివాటంగా వుండేది. కాని చివరకు మొండిపరిచి నాకు ఉచ్చు బిగించింది!

ఇంట్లో ఇంతమందిలో తిరుగుతున్నా ఆ క్షణంలో అసహాయనైపోయినట్లు తోచింది చాలా, మాటునా గుడ్డు విప్పితే కుంచెడు నీళ్లుగా యేడ్చాను. అక్కయ్యా అమ్మా తిండికి కూర్చున్నప్పుడు వాళ్లతో పాటు ఉండడానికి నాకు మొహం చెల్లలేదు. పెద్దతప్పు చేసినదానిలా వొదిగి, వొదిగి తిరిగాను. 'ఇప్పుడిది యెందుకురావాలి?' అని కచ్చగా నన్ను నేనే లెక్కలేనన్నిసార్లు ప్రశ్నించుకున్నాను. రాత్రల్లా నాకు తెలియకుండా యెంత కన్నీరు కారిపోయిందో... అక్కయ్యయెడల నాకు గల చనువు, స్వాతంత్ర్యం యేదో తెలియని తెరమరుగునపడి పోతున్నట్లనిపించింది! ఇకనించీ దానితో మాట్లాడాలంటే వొక కొత్త మనిషిగానే! కాని తెల్లవారుఝామునే అక్కయ్యా, బావా ప్రయాణమై వెళ్ళడంతో నేను మామూలు ఊబిలో దిగబడిపోయాను.

ఆనాటినించీ నాన్న యెత్తినకత్తికి యెదురులేదు. ఆయన పులిలా తిరుగుతుంటే మేమంతా పిల్లుల్లా నక్కి నక్కి వుండేవాళ్లం. అయినా అమ్మతో యీ మాట యెత్తుతాడేమో విందామని నాకు మనసులో మెదులుతూ వుండే; అంటి కేదీ కూడిరాకపోవడంవల్ల దించుకుపోయాను. మరొక్క ఆశకూడా యేడిపిస్తూ వుండేది. అది బావఅన్నయ్యతో ఏమైనా అన్నాడా అనేది. నిజానికి అన్నయ్యను అడగాలంటే నేను వెనుకాడవలసిన పనిలేదు కాని యెంతో పెద్దవాళ్లని అడగవలసిన దానిని వాడితో అంటే ఆట కోడితనానికి అడిగినట్లుంటుందని జంకాను. వాడికీ, నాకూ మూడేళ్ళు మాత్రమే వార. ఒకటి రెండుసార్లు అడుగుదామని నోటిదాకా వచ్చి మానేశాను. ఒకనాడు పనివేళా పిల్చేసరికి 'యెందుకు?' అన్నాడు వాడు. దగ్గిర కొచ్చేసరికి నాకు గుండె దడదడమన్నది. 'అం... ఏమీ లేదు. అవ్వాళ బావా నువ్వూ యెక్కడికి వెళ్లారు ఏమా దాటకి?' అనడిగాను. వాడు నా మొహంలోకి తేరిపారి 'నువ్వంత వెర్రిదానవే!' అన్నట్లు నవ్వి వూరుకున్నాడు. మరేమన్నా నిలదీసి అడుగుతాడేమో అని భయంవేసింది. నేనే లేని నవ్వు తెచ్చుకొని, ఏటివొడ్డున కూర్చుంటే హాయిగానే వుంటుందిరా! అవ్వాళ అక్కయ్యకూడా అన్నది, అని మాట తప్పించుకోనెందుకు తంటాలుపడ్డాను. 'రోజూ వెళ్లేదేగా!' అని నిర్లక్ష్యంగా అని తప్పుకున్నాడు వాడు. ఇంక నాకు చెప్పేవాళ్లెవ్వరూ లేరు, ముందు యెలాటి ఫలితం నెత్తిన పడినా, వోర్చుకోడానికి, అనుభవించడానికి సిద్ధమయ్యే వుండాలన్న మాట!

నిమ్మకి నీరెత్తినట్లు బ్రతికే నా గుండెల్లో ప్రతి నిముషమూ యేదో కలవరం బయల్దేరుతూనే వుండేది. బయటికి చెప్పలేక, అణచుకోలేక, అర్థం చేసుకోలేక అణగారిపోయేదానిని. దరీ—అంతూ తోచేది కాదు. లేనిపోని పనులు కల్పించుకొని తీరూ—తెన్నూ లేకుండా ఒకదానికొకటి చేసుకుపోతూవుండేదానిని.

నా పరాకు గమనించి మా అమ్మకూడా హెచ్చరించడం జరిగింది.

మా దొడ్లో నుయ్యి సరిగ్గా తాడిలోతుంటుంది. రోజూ ఇరవై బిందెలన్నా నీళ్లు తోడుతూవుండాలి! ఒకనాడు మధ్యాహ్నం యేదో అవసరమై నూతిలో చేదవేశాను. ఉత్తప్పుడైతే బరువునుబట్టే బొక్కెన మునిగినట్టు తెలుసుకొని లాగేదాన్ని అప్పుడు పొద్దు సరిగ్గా నెత్తినవుండడంవల్ల నా మొహంకూడా రూపాయంతగా నూతినీళ్లల్లో కదులుతున్నట్టుంది. ఏదో ఆలోచనలో చేద లాగడం మర్చిపోయాను. నావంక నేను దిగాలుగా చూసుకుంటూ నూతిమీదకు వంగాను. ఇంకొక్క నిమిషమైతే కాళ్లు తేలిపోయేవి. వెంటనే అన్నయ్య వచ్చి వెనక్కు లాగాడు. 'కళ్లు తిరిగినయ్యా?' అనడిగింది అమ్మ.

'అవు' నన్నాను. జీలకర్ర వాసనచూడమని యిచ్చింది తిరిగి నాలుగురోజులవరకూ నేనా పరాకు నుండి కోలుకోలేదు — 'అమ్మైనా నా కెందుకు చెప్పకూడదు?' అని వొకనాడు కచ్చతో అటక మీదలో పెట్టుకున్న నీళ్ళబిందెలు రెండూ తాకి వచ్చాను. తరవాత చెప్పి తిట్లు తిన్నాను — ఇంకొకనాడు నన్ను మడికట్టుకు వొడియాలు పెట్టమని గుచ్చిన పిండి అక్కడ పెట్టి యింట్లో వెళ్ళింది అమ్మ. నాకేదో గుబులుగా పొంగుకు వచ్చింది మామూలుగా అప్పడాలు వొడియాలు పెడుతున్నారంటే చుట్టపు చూపుగా వొచ్చిన వారంటూ వుండడం విని వున్నాను "అమ్మాయ్ పెళ్లా? అబ్బాయ్ వొడుగా?" అని. సరిగ్గా ఆ సమయానికే మా లక్ష్మి వచ్చి నన్ను వేళాకోళం పట్టించడంతో యేదో జ్ఞాపకంవచ్చి కళ్లనిండా నీళ్ళు కమ్ముకున్నయ్. ఎదుట యేమున్నదీ సరిగా కనిపించలేదు. ఎలాగో యీపని కానిచ్చుకుని బయటపడాలని, వొకొక్కటి దిబ్బరొట్టెంత పడేసి చెయి కడుక్కోబోయాను నా వెనకనే అమ్మవచ్చి జరిగిన పనికి శాపనార్థాలు పెట్టడం వాటిని మూడు రెట్లుగా సవరించుకోవడం జరిగింది.

పొడిబట్ట కట్టుకుని తలదువ్వి జెడవేసుకుందామని అద్దంముందు కూర్చుంటే మళ్ళీ అదే గుబులు. కళ్ళు జేవురించినట్లుండి నాకే భయం గొల్పినయ్. నా మొహం నాకే పరాయిదిగా తోచింది నేను పీల్చి విడిచే ప్రతి ఉచ్ఛ్వాసనిశ్వాసమూ, నాలోవున్న వేదనను రెట్టించినయ్యేగాని ఉపశమింప జేయలేదు. నే నెక్కడకు వెళ్ళినా, ఏమి చేసుకుపోతున్నా, మరేమి ఆలోచిస్తున్నా నా చుట్టూ యేదో వలయం అల్లుకుంటున్నట్లనిపించేది. అమ్మ యెంత పిల్చినా, మరెన్ని తిట్టినా వేళ్ళకు అన్నానికి కదిలేదాన్ని కాదు. — నేనిలా ప్రతిపనిలోనూ మొండి చరవడంచూసి వొకనాడు నాన్నకూడా కల్పించుకుని కేకలేయడం జరిగింది. సాధ్యమైనంతవరకు మర్చిపోవాలని, మనసు కుదుటబర్చుకోవాలని నేనుచేసిన ప్రయత్నాలంతతొందరగా ఫలితాన్నీయలేదు. గుండెల్లో కుదుగుబాటు లేనప్పుడు, దానిని యెంత కప్పెట్టుకోవాలనుకున్నా మొహంలో కనబడక మానదేమో.. అంతకంతకూ నా మొహం చూసుకుంటే నాకే డొక్కుపోయినట్టుతోచి, నాన్న తిడతాడేమో అని తప్పుకు తారుకు తిరగడం మొదలెట్టాను.

ఎన్నడూ లేనిది వొకనాడు మధ్యాహ్నం అన్నంతిని నిద్దరకు పడ్డాను. సందెకసువు వూడ్చే వేళకు కూడా లేవకపోయేసరికి, అమ్మ వచ్చి, వీపు మీద తట్టి లేపింది.

'ఏమిటే బండనిద్రా నువ్వూను, ఇంట్లో పనీపాటా చూసుకో అక్కర్లా?' అని కసిరింది, వాకిలి వూడ్చి ముగ్గెయ్యి, నే నిప్పుడే తాయారమ్మగారింటికి వెళ్లివస్తాను; అని నాకొక పని పురమాయించి వెళ్లిపోయింది అమ్మ. నేను లేచి కళ్లు నులుముకుంటూ మంచం నడుంగా కూర్చుని, రేగిన జుట్టు చక్కదోసుకుంటున్నాను. వెక్కి యెక్కి నిద్రపోవడం, అప్పుడే మెలకువ రావడం మూలాన నాకళ్ళు ఇగురుబడి చింతనిప్పుల్లాగుండడం గమనించింది కాబోలు, 'అదేమిటే కళ్ళలావున్నయ్' అని దగ్గిరగా వచ్చి అడిగింది అమ్మ.

"పగటినిద్రచేత కావున్ను" అని టూకీగా సమాధానమిచ్చి తప్పించుకో జూశాను. అమ్మ అంతటితో వూరుకొని వళ్ళే ఘటం కాదుగా! "నీ మొహం నిద్ర అంటా వేమిటే? కళ్ళు రెండూ నలిపి నైవేద్యం పెట్టె ఏడ్చినట్టుంటేనూ? పైటచెంగు చూడు! తడిగా వున్నది!" అంటూ కసురుకుంటున్న ధోరణిలో అన్నది. నిజం చెప్పిఒప్పించే తాహతు నాకు లేదు. అమ్మదగ్గిర ఆమాత్రం చనువువున్నా, నాన్న చెవిని బడితే అదెలా పరిణమించుతుందోనని మనసులో దేవుతున్నది అందుకనేగా నా మూగబాధ అంతాను!

ఏమీ చెప్పక మొండిచరిచి వూరుకొన్నాను. తాయారమ్మగారింటికి వెళ్ళడం వాయిదా వేసుకుని నా ప్రక్కగా వచ్చి కూర్చున్నది అమ్మ "అక్కయ్య నీతో యేమి చెప్పిందే?" అని ఆవిడ మొదటగా అడిగిన ప్రశ్న. "అక్కయ్య నాకెందుకు చెవుతుంది?"

అని బుంగమూతి పెట్టుకుని మొరటుగా సమాధాన మిచ్చాను.

"నీకు చెప్పకపోతే నాకు చెప్తుందిటే? ఏది యేమైనా మీరూ, మీ నాన్నా అందరూ వొకటి. మళ్ళీ అన్నింటికీ నేను నోరు నొక్కుకుచస్తున్నాను. ఏమాట అనబోయినా నీకెందుకు వూరుకోమని కసిరి కొడతారు అవునుమరి! నేనూ మీఅంతపాపమేదానైతే బాగానే వుండేదాన్ని. దానిమట్టు కదివొచ్చి వొరగ బెట్టింగమీ లేకపోగా నాన్నతో కలిసి హోరాహోరి పోట్లాడి పంతం నెగ్గించుకు మరీ వెళ్ళింది! ఎంత కాదన్నా తల్లితోడూ కనక అన్నాను ఆమాటా తప్పేనా? దానికింత రాద్ధాంతం చేసుకున్నాగు? వాగియిష్టం మీయిష్టమూను. నువ్వు కళ్లు కాయలు కాచేట్టు యేడ్చినా, నేను దిగులుపడి చచ్చినా, జరిగే దేమీ లేదు. మొహం కడుక్కుని, వాకిలూడ్చి ముగ్గెయ్యి!" అంటూ చివాల్న అక్కణ్ణించి లేచి వెళ్లింది అమ్మ.

ఇంక నేను దిగులుపడి లాభంలేదు. మనసు పాడుచేసుకున్నా వొక అందాన కలిసివచ్చేదీ లేదు. గుండెరాయిచేసుకుని ఇంటిపనులు చెయ్యడానికి అక్కణ్ణించి బయటపడ్డాను.

ఇది జరిగిన నాలుగురోజులకే ఒకరాత్రి అమ్మా, నాన్నా యిలా మాట్లాడుకోవడం విన్నాను.

"మీయిష్టం వచ్చినట్టే చేసుకోండి, మధ్య నాతో సలహాలు, సంప్రతింపులూ యెందుకు? నేను చెప్పినవన్నీ చెప్పినట్టు చేసుకుపోయినారు కనకనా?" అంటూంది అమ్మ

"అదికాదే, అమ్మాయి పట్టుబట్టి చెప్పి వెళ్ళిన యేలూరుసంబంధాని కీయడం నా కెంతిమాత్రమూ యిష్టం లేదు. నలుగురైదుగురు ఆడపిల్లలు, తండ్రి నాకుమల్లే నే యింటికి చేరుకొన్నాడాయె! వారి కందరికీ కార్యకర్మత్తులు చేసుకుంటూ యీయన గారి చేతిమీదుగా సంసారం యేం నడుపుతాడు? ముందుముందేం సుఖపడి యేడుస్తారు? ఇప్పటికి యఫ్ ఏ. చదివినంతమాత్రాన యీయనకు ఉద్యోగాలు వొరగబెట్టేవా లైవగు? సంబంధం చేశామంటే, మొన్నాటినించీ మనప్రాణానికి ఉసూరుమనకుండా, వాళ్ళతిండైనా వాళ్ళు తినగలగాలా వద్దా?" అంటు న్నాడు నాన్న. "అందుకని యిప్పుడేం జేస్తా మంటారు?" అనడిగింది అమ్మ.

"నేనూ అదే ఆలోచిస్తున్నాను. మొన్న బందరు వెళ్లినప్పుడు రామమూర్తి కనిపించి తన తమ్ముడి సంగతి చెప్పాడు. వింటే బాగానే వుండే టట్టు తోచింది. నేనూ కొన్ని వరతులు అడిగాను, తమ్ముడికి వ్రాసి కనుక్కుంటానన్నాడు. అను కూలిస్తే 'శుభం' అని వస్తాను; కాకపోతే యేలూరు కూడా వెళ్ళి సంగతి సందర్భాలు అన్నీ విచారించు కొనే భీమవరం పోతాను. ఈపట్టు యేదో వొకటి ఖాయం అనుకోవాల్సిందే. ఇంకెన్నాళ్లని యెదిగిన పిల్లని యింట్లో అట్టే పెట్టుకుంటాం? ఇంటా బయటా కూడా తల వాచిపోతోంది" అని చాలిం చాడు నాన్న. ఒక్క నిమిషంవరకూ యెవ్వరూ మాటాడలేదు. అమ్మ యిలా అడిగింది "అయితే మీ రిప్పుడు చేయబోయే నిరవాకం యేమిటి? రామమూర్తి తమ్ముణ్ణి మాటాడటం అదేమంత ఘనకార్యమని? ఎడంచెయ్యి తీసి, పురచెయ్యి వుంచాగు అంతేనా? మీ యిష్టం వొచ్చినట్టే పనులన్నీ చుట్టబెట్టుకురండి! తల్లి, తోడూ కనక మనసు వూరుకోక అంటూ వుంటాను" అంటూంటే అమ్మ యేడుపు దిగమింగు కొని మాటాడుతున్నట్టు తోచింది నాకు.

"తల్లీ లేదు తోడూ లేదు. అయినవాళ్లంతో— అందులో మీ అన్నగారింటివాడికి పిల్ల నివ్వగానే వొక అందానరాదు. ఆమొన్నాటినించీ యెన్నిపొరు పులు పుట్టుకువస్తయ్యో తెలుసా? అయిదుగురు మొగ పిల్లలు! పెద్దవాడికీ అమ్మాయికీ యెన్నేళ్ళు వార అంటావ్? వాడికేముందే యేదో పల్లెటూళ్ళో బడి పంతులుగా యేడుస్తున్నాడు బతికలేక! నెత్తిన జుట్టైనా లేదు. రామమూర్తి తమ్ముడంటావా, వాడికి వొక్కడే మొగపిల్లవాడు, వాడికి రెండేళ్లు, ఒక్కర్తే ఆడపిల్ల—దానికి అయిదేళ్లు! ఇద్దరూ పసి వాళ్ళే. అమాత్రం లేకుండా యెలా వుంటారు? భీమవరంలోనే కాపరం. అక్కడే వుద్యోగం కూడా. ఎంత లేన్నా బస్తీ కాపరం గదా! అమ్మాయ్ అన్నివిధాలా సుఖపడుతుందనే నా వుద్దే శ్యమూను" అని వూరుకున్నాడు నాన్న. వొక్రమా నికి అమ్మ అడిగింది, "అమ్మాయ్‌తో చెప్పారా?" అని.

"ఆఁ...దానికీ దీనికీ చెబుతూ కూర్చుంటే పనులు సాగుతియ్యా?" అన్నాడు నాన్న. "మీ యిష్టం వొచ్చినట్టు చేసుకోండి!" అన్నది అమ్మ. "తెల్లవారుఝామునే బయల్దేరిపోయి మొదటి కారు అందుకోవాలి. బందరు కోర్టులో పని చూసుకుని,

రామమూర్తితో మాట్లాడి భీమవరం పోయివస్తాను" అని మాట చాలించాడు నాన్న.

నాన్న యెన్నడూ యింతసేపు అమ్మతో మాట్లాడగా చూడలేదు! ఇప్పుడు నా విషయమై సంప్రదించడానికి ఆయన కింత తీరికా, ఓర్పూ వొచ్చినయ్యనుకుంటాను!

కాని, నే నిన్నాళ్ళనించీ దేనికోసం మథనపడి, ఆవేదనపడి చస్తున్నానో అది యీ రాత్రితో తేలిపోయిందన్నమాట! దానితోపాటే నా భవిష్యత్తు కూడా ముడివడి ఉన్నది కనక, ఇంక సందేహింప నవసరంలేదు; తల్చుకుంటే నాన్న అంతపనీ చేసే తీరతాడు! ఈ క్షణంనించే నేను ఒకయింటి కోడల్నయిపోయానని తీర్మానించుకోవచ్చు!

ఇంక నేను కుమిలి చావడమెందుకు? అక్కయ్య యేనాడో చెప్పకుండా వెళ్ళిందని దానిని అనుకొని లాభమేమిటి? ఇంతపని చేయదల్చుకున్న నాన్న రేపు బందరు వెళ్ళినప్పుడు దానితో మాత్రం చెప్పి వొప్పించడూ? మా అక్కచెల్లెళ్ళల్లో అది తలూపితే యింక నోరెత్తేవాళ్ళే వుండరుగదా! ఆ క్షణంలో నా గుండె వొక రాయో, పాషాణమో అయిపోయింది రేపట్నించీ నేను మామూలు మనిషిని కాదు; యిద్దరు బిడ్డలకు తల్లిలాటిదాన్ని కాబోతున్నాను, చేతినిండుగా పని! ఇంట్లో యెంత సంపడి!—అయితే మీకొక సందేహం కలగవచ్చు, మామయ్య కివ్వడానికి ససేమిరా వొప్పుకోని నాన్న, అలాటిదే అయిన మరో సంబంధానికి నన్నెలా కట్టబెట్టాడూ! అని.

మానవుడు బుద్ధిపూర్వకంగా యేది వద్దనుకుంటాడో, తిరిగి తెలిసో, తెలియకో తాత్కాలికమైన కొన్ని బలహీనతలవల్ల, దానికే వొడబడుతూ వుంటాడు. అదే మా నాన్న మనస్తత్వంలో వున్న గొప్పదనం!

నేనూ యీ ప్రశ్న అడుగుతానని కాబోలు, మా అమ్మకూడా నాకే విషయంగురించి చెప్పనేలేదు. ఇంక నేను ఆలోచించదల్చలేదు, చాటున యేడవాలనుకోలేదు. ఆ రాత్రి మామూలుగానే నిద్రపట్టింది!

వారం రోజులకల్లా భీమవరం సంబంధమే ఖాయం చేసుకుని తాంబూలాలు పుచ్చుకొని వచ్చాడు నాన్న. నాకు వేరే బొట్టుపెట్టి చెప్పకుండానే సంగతంతా తెలిసింది. మా అమ్మ పెళ్ళిపనులు మొదలెట్టింది. చిత్రమేమిటంటే, నా పెళ్ళికి చిన్నక్కయ్యకూడా వొప్పుకుందట! నాలుగురోజులు ముందుగానే వస్తానన్నదట!! కార్యక్రమంయే కొదవాలేకుండా సాగిపోతూనే వున్నది, మిగతా మా అక్కయ్యలకు, బంధువులకు శుభలేఖలు వ్రాశాడు నాన్న. వారితోపాటు మామయ్యకూ వొకటి వ్రాశాడు. కట్నాలూ, కానుకల విషయం తేలికగానే పరిష్కారమైపోయిందట. ఈయన యివ్వవలసినది ఆట్టేలేదు, వెండిచెంబులు, పట్టుబట్టలు మాత్రమే. వారికి వొక్కర్తే ఆడపడుచు, తోచినంత లాంఛనం మాత్రం యివ్వాలి! వారు మాత్రం యెనిమిది వందలు నగలక్రింద నాకిచ్చేటట్టు వొప్పుకున్నారట! మరి వారెవ్వరూ నన్ను చూడడానికి గానే లేదు...ఒకనాటి ఉదయాన వాకిలికి పచ్చతోరణం కట్టాడు నాన్న. చిన్నక్కయ్య నన్ను పెళ్ళికూతుర్ని చేసింది. సాయంత్రానికల్లా భీమవరంవారు సపరివారంగా దిగారు. మా యింటి యెదురుగావున్న బాబాయిగారింట్లోనే వారికి విడిది యేర్పాటయింది. వారందరికీ కాఫీ ఫలహారాలు అందివ్వడంలో హడావిడిగా తిరుగుతున్నారు, మా అక్కయ్యలు ముగ్గురూ. ఆనాడే మా చిన్నబావమాత్రం వచ్చాడు. నేను బయటపడే పనులేవీ చేయకపోయినా యింట్లో వుండి యేవో అటూ-యిటూ సర్దుతున్నాను అప్పుడు గదిలో పట్టెమంచం క్రింద నాన్న తెచ్చిన కూరలన్నీ విడివిడిగా పేరుస్తున్నాను. మా చిన్నబావ గుమ్మం దగ్గిరకొచ్చి నిలబడి "లక్ష్మీ!" అని పిల్చాడు. చివాల్న లేచి యివతలకు వచ్చాను. "ఏం కోపంగా వున్నావ్?" అని అడిగాడాయన. "అబ్బే, ఏమీ లేదు బావా!" అన్నాను, లేనినవ్వు తెచ్చిపెట్టుకుంటూ. "పెళ్ళివారొచ్చారు చూశావా?" అనడిగాడు బావ. "వాళ్ళు బాబాయిగారింట్లో దిగారుగా, అయినా నీ కెప్పుడూ పరాచికాలే బావా!" అన్నాను. "రేపట్నించీ బస్తీకి వెళ్ళిపోతే మేము జ్ఞాపకం వుంటామా?" అన్నాడాయన.

"నువ్వూ అక్కయ్యా మాత్రం తప్పకుండా జ్ఞాపకం వుంటారు బావా!" అన్నాను. నేనామాట మామూలు ధోరణిలో సాదాగా, ముక్తసరిగా అని వుంటే ఇప్పుడు వ్రాయవలసివుండేదే కాదు. నేనెంతో కచ్చగా పళ్ళు బిగించి బాణం విసిరినట్టు అన్నానని తరవాతగాని గ్రహించుకోలేదు. మరాయన మనసుకు ఏమని తోచిందో, దెబ్బతిన్నవాడిలా గుమ్మానికి చేరగిలబడి మరి నోరెత్తకుండా వెళ్ళిపోయాడు—బహుశా వొకటి అనుకొని వుంటాడు. తనూ, అక్కయ్యా కలిసి యేదో పెద్ద ద్రోహం చేసినట్టు నేను తలచానని, ఆ బాధనే మాటలో పొదిగి,

యిలా తనమీదకు విసిరివుంటానని—అప్పణ్ణించీ ఆయన నాతో మాట్లాడాలంటే మొహం చెల్లనట్టు తప్పించుకు తిరుగుతూ వుండేవాడు. అజ్ఞానం వల్ల అనవసరంగా ఆయన మనసును బాధ పెట్టానేమో...అని నేను పరితపించిపోయాను. దానిలో యీ వున్న కొస్త ఉత్సాహం కూడా లేకుండాపోయింది. ఆ క్షణంనుంచీ నే నేదిచేసినా యంత్రంలాగే చేసుకుపోయాను.

కొంతసేపటికి మా ఆడబిడ్డ నన్ను చూడడానికి వచ్చింది...ఆవిడ అడిగిందల్లా రెండే ప్రశ్నలు - వంటా పెట్టా, చేతనవునా? చదవను వ్రాయను వచ్చునా? అని. చెప్పాను కాదూ, నా పనులన్ని యంత్రంలాగే వున్నయ్యని. ఆవిడకిచ్చిన సమాధానాలుకూడా అలాగే వున్నయ్యని తరవాత తెలిసింది! ఆవిడ గడపదాటిందో లేదో! అక్కయ్య రివ్వునవచ్చి నన్ను కసిరి కొట్టింది. "ఏమిటా పెంకె సమాధానాలూ నువ్వూను" అని. "నే నేమన్నా నేమిటి?" అని దానిని గెట్టించి అడిగాను. "అడిగినప్పుడు సరిగా చెప్పొద్దూ? వంట చేతవునా అంటే, ఎందుకు చేత కాదూ? అని ఆవిణ్నే యెదురుప్రశ్న వేయడమా?" అన్నది. "నే నేం అలా అనలేదు" అని అక్కయ్యను యెదిరించబోయాను. వెంటనే నాన్నవచ్చి "ఏమిటీ గందరగోళం. అవతల పెద్దమనుషులతో పని" అని కసిరి కొట్టడంతో యెక్కడివాళ్ళక్కడ సర్దుకున్నారు—రాత్రికి భోజనాల తంతుసాదాగానే సాగిపోతోంది. బావ యెందులోనైనా పాల్గొంటున్నాడా, లేక నాలాగే తనూ బాధపడుతున్నాడా? అని ఏక్షణాని కాక్షణం కనిపెట్టి చూస్తూ నేవున్నాను. పెళ్ళి వారి వరసనే ఆయనకూ పీట వేశారు. ఆవేళకు వచ్చింది ఆయనవొక్కడే—మిగతా యిద్దరు బావలూ లగ్నం వేళకు దిగారు. ఎంతోసేపటివరకూ ఆయన భోజనం పందిట్లోకి రానేలేదు. అంతా సిద్ధమౌతోంది. నేతి ఝారీపట్టుకుని నాన్న ఇటూఅటూ తిరుగుతున్నాడు. అక్కయ్యలు వడ్డనలు చేస్తున్నారు. 'మీ ఆయన యేడమ్మా!' అని చిన్నక్కయ్యను అడిగాడు నాన్న. వస్తార్లేనాన్నా, అని తాపీగా సమాధానమిచ్చింది అక్కయ్య. చిట్టచివరకు లడ్డూల పళ్ళెం చేతబట్టుకు వచ్చి అందరినీ నవ్వించాడు బావ. కిటికీదగ్గిరకు వచ్చేసరికి నా మొహంలోకి పరకాయించిచూసి అదోలా ముడుచుకుపోయాడు. నేనూ చివాల్న అక్కణ్ణించి యివతలకు దూకాను. ఇంతలోనే సన్నాయి మేళం మోగింది. పెళ్ళివారు ఒక్కొక్కరే పట్టుబట్టల పటాటోపంతో పీటలమీదకు చేరుకుంటున్నారు. చిట్ట చివరకు రామమూర్తిగారూ తమ్ముడూ దిగారు వారివెంట అన్నయ్య వస్తున్నాడు. వారిద్దరిలో కాస్త పెద్దగా పిలగా వున్నవారు అన్నగారని, కొంచెం పొట్టిగా వున్నవారు తమ్ములని నాకు నేనే పోల్చుకున్నాను. నా వూహ సిసత్తైనదే—అన్నగారూ ఆయనా యేవో మాట్లాడుకుంటున్నారు. మనిషిలో ఔద్ధత్యం కనబడలేదు గాని, ఆయన మొహంలో యేదో విచారరేఖ వొకటిమాత్రం అస్పష్టంగా వున్నట్టు ఆ దీపాల వెలుగులో అనిపించింది నాకు. అది బహుశా, పూర్వస్మృతుల చిహ్నమేమో...అక్కయ్య వచ్చి అప్పడాలూ—వడియాలూ వెయ్యడంతో వడ్డన పూర్తయింది. ఇలాంటి సమయంలో అత్తయ్య వుంటే యెన్ని అధ్యాత్మ రామాయణ కీర్తనలు పాడివుండేదో...ఏదో చాటున వుండి 'శృంగార లహరి' పాడుతున్నది చిన్నక్కయ్య. మా అందరిలో సంగీతం చెప్పించింది దానికొక్కర్తెకే.

అందరూ ఆపోశనం పట్టబోతుండగా మా మామయ్య పెద్దకొడుకు శాస్త్రి దిగాడు. వాళ్లతరఫున వచ్చిందల్లా వాడొక్కడే. చూసీ చూడడంతోటే అన్నయ్య వెళ్ళి వాణ్ణి కావలించుకున్నాడు. 'మామయ్య వస్తున్నాడా?' అని అడిగాడు. 'అందరి బదులూ నేనే వచ్చాను' అన్నాడు వాడు యుక్తసరిగా. వొదినగారెక్కడ? అంటూ గుమ్మంలోకి చక్కా వచ్చాడు. వాడిని చూడగానే యెక్కడలేని యేడుపూ గుబులుగా పొంగివచ్చింది నాకు. రెండు చేతులతో మొహం కప్పెట్టుకుని పక్కకు తప్పుకున్నాను.

ఆమొన్నాటి ఉదయానే బాజా బజంత్రీలు మ్రోగిసై, సరిగ్గా పదిగంటల యిరవైయైదు నిమిషాల కల్లా రాఘవరావుగారు నా మెళ్ళో మంగళ సూత్రం బంధించారు. అంతటితో శాస్త్రీయంగా పెళ్ళి అయిందన్నమాటేగా! ఆ సమయంలో యెందుకనో ఆయనకు చేతులు వణికినయ్. మంగళసూత్రం జారి నా వొడిలో పడింది. నాకు వెన్ను ఝల్లుమన్నది. నా వెనకనే వున్న అక్కయ్యలు ఒకరి మొహంవంక ఒకరు చూసుకున్నారు. ఎదురుగుండా వున్న చిన్నబావ అదోకలా తల తిప్పేసుకున్నాడు. అమ్మా, నాన్నా కూడా కొంచెం గాబరా పడ్డట్టు కనిపించారు. అమ్మలక్కల్లో పెద్ద కలకలం బయల్దేరింది. ఆయన యెలాగో తమాయించుకుని.

తిరిగి మూడు ముళ్ళూ వేశారు—తలంబ్రాలు పోయ డంలోకూడా ఆయన అంత ఉత్సాహం చూపలేదు.

కట్నాలవేళకు అందరూ తలా వొకటే చేతిబట్టు కొని వచ్చారు. చిన్నబావ యేం చదివించుతాడా అని నా ఆదుర్దా—

చిన్నక్కయ్య వెండి కుంకంబరిణె చదివిం చింది......ఉన్నట్లుండి మా యిద్దరికీ చెరివొక ఖద్దరు నూలుదండా యిచ్చి అందరినీ నవ్వించాడు బావ. ఆయనగారి మెడలో నేనా దండవెయ్యాలన్నమాట! నాకు చేతులు వణికినయ్. అంతమనిషి యెదట నే నెంతా! అనిపించింది. అయినా తప్పని సరి. ఆయన నా మెడలో వేశారు. నా సాహసాన్ని పరీక్షించ డానికే బావ యింతపని చేశాడా, అనిపించింది. చిన్నక్కయ్య వచ్చి నా చేతులు పట్టుకుని ఆయన మెడలో దండ వేయించింది. వోమూలనించి. మామయ్యగారి శాస్త్రి మరో రెండు కర్పూరం దండలు తెచ్చాడు. ఈసారి నే నొక్కర్తెనే వెయ్యా లని కాబోలు, అక్కయ్య నా సరసకు రాలేదు! ఈ దంపతు లిరువురూ, పార్వతీ పరమేశ్వరుల అన్యోన్యం కలిగి, చిరకాలం వర్ధిల్లాలని పెద్దలంతా స్వస్తివాచకాలు, సామగానాలు చదివి మా నెత్తిన అక్షింతలు చల్లారు.—తండ్రిగారి కల్యాణం చూడ కూడదనే నిషేధం వుందట! రాఘవరావుగారి సంతా నాన్ని అస లిక్కడకు తీసుకురానేలేదు.—మధ్యాహ్నం భోజనాలవేళ వేరేకంచంలోనే వడ్డిం చారు నాకు—సాయంత్రం పూలదండెల వేళకు అమ్మలక్కల్లో తలపట్లు బయలుదేరినయ్—

"ఇంకా చెండ్లాట యేమిటి? ఆయనమాత్రం యెలా వస్తాడు, బాలాకుమారుడిలాగ?" అని యీస డించింది మా పెద్దక్కయ్య. "అయితే అమ్మాయ్ ముచ్చట యెలా తీరుతుంది" అని దాని పంతం నెగ్గించుకోవాలని పట్టుపట్టింది మూడో అక్కయ్య. దీనిని ఆధారంగా గొని ఇంట్లో, పెద్ద రణగొణ ధ్వనులు బయలుదేరినై. చిన్నక్కయ్య బావా మాట్లాడుకొని వొక నిర్ణయానికివచ్చినట్టున్నారు. అది వచ్చి అందరితోనూ యేదో చెప్పింది. కొంత సద్దుమణి గింది. మొత్తంమీద ఆపూటకు ఆ ప్రమేయం విర మించబడింది. నామట్టుకు నేను బ్రతుకుజీవుడా, అను కున్నాను—

ఆ మొన్నాడు పెళ్లివారందరూ వెళ్ళిపోతారు గనక భోజనాలైనతరవాత, పెట్టేబేడా సద్దుకోవడం మొదలెట్టారు. మరి నేనూ వారిలో వొకదాన్నయాను కనక, నా ప్రయాణానికి తగిన సన్నాహాలుకూడాజరుగు తున్నయ్, చిట్టచివరకు నావెంట యెవరు వెళ్ళాలి? అనే మీమాంస బయల్దేరింది. "ఇంటిదగ్గిర పిల్లలు వొక్కళ్ళూ వున్నారు, నేను వెళ్లటానికి లేదు" అన్నది పెద్దక్కయ్య. "మా ఆయన మద్రాసు వెడు తున్నారు, ఆయనకు అన్నీ సర్దియివ్వాలి, ఎక్కడ యేమున్నదోకూడా తెలియదాయనకు, నేను బెజ వాడ వెళ్లిపోవాలి" అన్నది మూడో అక్కయ్య. "అయితే నేనేనా యే పనీ పాటా లేనిదానిని? ఒక్కనాటుకూడా మా ఆయన అత్తెసరు పెట్టుకు తిన లేదు. హోటలు భోజనం అసలే ఆయనకు సరిపడదు" అన్నది చిన్నక్కయ్య. "అందరూ అలా గనుకుంటే నే నేం జెయ్యను తల్లీ? ఈ కొంప యెవరిమీద వదిలి పోయేదీ?" అన్నది అమ్మ. అన్నింటికీ సాహసికు రాలు, అయినమట్టుకు నిర్వహించుకు రాగల్గినదీ, మా చిన్నక్కయ్యే కనక చివరకు నాతో రావడానికి తనేవొప్పుకుంది దాని చెవిలో యేమిటో రహస్యంగా మాట్లాడింది అమ్మ. నేను భీమవరం వెళ్ళాక నాకు ఎలాటి సలహా లివ్వాలో చెప్పివుంటుందనుకున్నాను.

అనుకున్న వేళకు ప్రయాణం సాగింది. అందరం భీమవరం చేరుకొన్నాం. ఆపూటే గృహప్రవేశం తంతుకూడా నడిచిపోయింది. గడపదాటి మేమిద్దరం లోనికి వెళ్లాలంటే పరస్పరం పేరులు ప్రకటించు కొని ద్వారలక్ష్మిని అనుమతి కోరాలట! ఇది వొక ప్రమాదకరమైన పట్టుదలగా పరిణమించింది నా విష యంలో. చుట్టూ వున్నవాళ్లందరూ చెవులు రిక్కించి మా నోటివెంట వచ్చే చిన్న మాటకోసం నిరీక్షిస్తు న్నారు! ఎక్కడికో కానిదేశం తీసుకువచ్చి నన్ని ఆడపులుల మధ్య బంధించారా, అనిపించింది. కట్టూ-బొట్టూ యెలాగున్నా వారిమాట, మన స్తత్వం నాకు మరీ కొత్తవిగా తోచినయ్. ఇంత స్వల్పవిషయాల కింత పట్టుదలలు యెందుకూ అనిపించింది. అందరినీ సమాధానపర్చుకు రాగలిగింది మా అక్కయ్య. ఇంక నా దగ్గిరకొచ్చి, నిదానించి లాభం లేదు, నువ్వే ముందు చెప్పాలి, లేకపోతే మనల్ని వేళాకోళం పట్టిస్తారు, అని చెవులో చెప్పి నట్టుగా చెప్పింది. భయంలేదన్నట్టు వీపుపై చెయి వేసి నిమిరింది. నేనూ అంతటి సాహసానికి సమ కట్టాను. రాఘవరావుగారూ, నేనూ వచ్చాము, తెలుపుతియ్యమని, అజ్ఞాతదేవతను ప్రార్థించాను. నిజానికి ఆసమయంలో నాగొంతు ప్రార్థనాస్వరం లోనే పలికినట్టు గుర్తు! నాకు వొళ్లు గగుర్పొడి

చింది. విజయగర్వంతో తలెత్తి చూశాను, రావుగారి మొహం దగ్గరలో స్పష్టంగానే కనిపించింది. వారెందుకో తటపటాయిస్తున్నట్టు కనబడ్డారు. వెంటనే అనిపించింది పూర్వంలాగే, 'ఇంతటి వారియెదట నేను నిలబడగలనా?' అని నేనీ తబ్బిబ్బులలో వుండగానే ఆయనా, నా పేరు చెప్పినట్టున్నారు. అందరూ ఘొల్లుమని పెద్ద కోలాహలం చేశారు. ఎందుకో, మా తాలూకు మనాభిమానాలతో వారికింత చెలగాటం? అడుగు ముందుకు వేయబోతూ వుండగా, వొకముత్తైదువ నా యెదురుగా వచ్చి కళ్లు పెద్దవిచేసి యిలా అన్నది. 'మాయింట్లో పెళ్లికూతురు మాటు మార్లు చెప్పే అలవాటుంది కనుక మామూలు చెల్లించి మరీ కదులు...' అని. రావుగారు చిరాగ్గా ఆమెవంక జూసి పళ్లు బిగించారు. ఆవిడ వెనక్కు జారుకుంది. నేను వారినించి బైటపడ్డానన్నమాట! ఇంక మూడు రాత్రులు ఇక్కడ గడపాలన్నమాట!

సాధ్యమైనంతవరకూ, నన్ను అంటిపెట్టుకు తిరుగుతూ వున్నది అక్కయ్య. అయినా అది అవతలకువెళ్లిన ఘడియలోనే నన్నొకసమస్య యెదుర్కొంది.—సబ్బుబిళ్ల చేతబట్టుకుని నీళ్లు పోసుకోబోయింది అక్కయ్య. ఆ సాయంత్రం రావుగారి యిద్దరిపిల్లల్ని తీసుకుని మా ఆడబిడ్డ నేనున్న గదిలోకి వచ్చింది. పరాకుగా ఆలోచిస్తున్న నేను చివాల్న లేచి నిల్చున్నాను.

"ఫరవాలేదమ్మా, కూర్చో...అంటూ నాదగ్గరకువచ్చి ఆ బిడ్డలకు నన్ను పరిచయంచెయబోయింది. పెద్దపిల్లకు అయిదేళ్లు. "యీావిడే మీపిన్ని, పో! దగ్గరకువెళ్లు; అమ్మకాదు? నిన్నెత్తుకుంటుందిగా" అని దానిని ముందుకు నెట్టింది. అది నా మొహంలోకి దీక్షగాచూసి ముందడుగు వేయడానికి తటపటాయిస్తూ నిల్చున్నది. ఇంక పిల్లవాడికి రెండేళ్లుమాత్రమే! వాడు బొటన వ్రేలు చీకుతూ అత్తయ్య పక్కగా వొదిగి వున్నాడు. "అమ్మరా నాన్నా! మీ అమ్మ!! వెళ్లు! ఎత్తుకుంటుంది వెళ్లు!!" అని రెండు చేతులా వాడిని నా కీయబోయింది. వాడు నోట్లో వ్రేలు తీసి ఇదెవరు? అన్నట్టు మొహంబిగించి నావంక కొండంత అనుమానంతో చూశాడు. అవును మరి! ఆ పసి మనస్సుల్లో యేమేమి స్మృతులు బాధిస్తున్నవో...

నిజానికి యెనిమిది నెల్ల క్రిందటివరకూ, వాళ్లు అమ్మ వొడిలో దోబూచులాడుకొన్న వాళ్లేగా, ఇంతిలో మర్చిపోగలిగి వుంటారా? అమ్మ యిచ్చిన చనుబాలతీపి వారి కంత తేలికగా మరుపుకొస్తుందా? మరి, వా డలా వెర్రిగా చూడడంలో అర్థమేమిటి? అమ్మ, అనే పవిత్రనామానికి నేను అర్హురాలను కాదా? సహజంగా మాతృహృదయంలో నిండివుండే ప్రేమ, నా కళ్లల్లో వాళ్ళకు కనుపించడంలేదా? నే నిలా మథనపడుతూన్న తరుణంలోనే "రారా నాన్నా! అమ్మరా! అని ఆ మాటలే పునశ్చరణ చేసుకొంటూ వాడిని నా చంకకిచ్చింది వదినగారు. యేడ్చాడు. నేను లేని నవ్వు తెచ్చిపెట్టుకుని వాడిని యెగరేసి ముద్దు పెట్టుకున్నాను. "వెళ్ళమ్మా! పిన్ని దగ్గరకువెళ్లు! అని పెద్దపిల్లను కూడా అక్కడే దిగవిడిచి, చరాల్న బాణంలా దూసుకుపోయిందావిడ. నాకిదే పరీక్షా? అనుకొన్నాను రాముని యెత్తుకుని, సరోజను చేతబట్టుకొని గుమ్మందాకా నడిచాను. అమ్మ, అన్నది సరోజిని. ఎక్కడ, అనడిగాను 'అదుగో, అని గోడమీదవున్న ఫొటో కేసి చూపించింది. నాకు వెన్ను ఝల్లుమన్నట్టయింది. మా అక్కయ్య, పేరుకు తగినట్టుగానే శాంతంగా చిరునవ్వుతో నా వంకవ చూస్తున్నట్టయింది. 'పిల్లలు జాగ్రత్త' అని యేదో తెలియని మూగభాషలో హెచ్చరిస్తున్నట్లుంది రాముని మరొకసారి అక్కున జేర్చుకుని ముద్దుపెట్టుకున్నాను. 'అమ్మా' అంటూ వచ్చీ రాని తొక్కు పలుకులతో మెడ కావిలేసుకున్నాడు వాడు. పిన్నీ, నన్నూ యెత్తుకోవూ? అని చీరకొంగు లాగింది సరోజ నేనొక్కర్తెనే వొకరికి పిన్నీ, మరొకరికి అమ్మానా? నాలుగడుగులు ముందుకు వెళ్ళి అటుకేసి తలెత్తిచూశాను. ఇదంతా తిలకిస్తూ వున్నట్టు రావుగారు కనుపించారు. దిగ్గున వెనక్కు తగ్గాను. విమనుకున్నారో మరి! మధ్యాహ్నం కల్లా అక్కయ్య ఫొటో అక్కడ లేదు —

అక్కడ వున్న మూడురోజులూ నాకొ పిల్లలతోనే కాలం గడిచింది. రాత్రులు నా దగ్గిరే పడుకుంటానని మారాం చేసింది సరోజ. నేనూ అందుకు కాదనలేదు. హృదయం యిచ్చే యెవ్వరికైనా పిల్లల అమాయికపు మనసులు వశమౌతయ్యేమో...

ఈ స్వల్పవ్యవధిలోనే పసిపిల్లల్ని సాకే తీరుతెన్నులు కొన్ని నాకు చెప్పింది మా అక్కయ్య— 'వారు మారాంచేసి యేడ్చినా సొర్చుకోమన్నది. అంతగా పోరుపెట్టి పట్టినపట్టు విడవకపోతే, ఏదో కథచెప్పి వూరుకోబెట్టమన్నది. అమ్మను జ్ఞాపకం చేసే విషయాలేవీ వాళ్ళ స్మృతికి రానీయవద్దన్నది. ఆటబొమ్మలు కొనిపించి పేరు పేరునా కథలుగా విప్పిచెప్పమన్నది. ఆయనగారు విసుగుగా చిరాగ్గా

వున్నప్పుడు, పిల్లల్ని ఆ ఛాయలకు పోనీయవద్దన్నది. నీదగ్గిరే పడుకుంటానని మారాం చేస్తే, వొక చిన్న మంచంమీద వాళ్లను పెట్టుకు పడుకొని నిద్దరూపమన్నది: తెల్లవార్లూ ఆ బిడ్డల పక్కలోనే పడుకోవడం మరవవద్దన్నది. 'అమ్మా', అనే మాట వారి నోటివెంట వచ్చినప్పుడు ఆమాటకు నేనే అర్థమైనట్టు సర్వవిధాలా వారిని వొప్పించడానికే పాటుపడుకోమన్నది. సాధ్యమైనంతవరకూ తండ్రితో పాటే రెండుపూటలా వారికి అన్నం పెట్టమన్నది. ఇంక నా విషయంలో...కొన్నాళ్ళవరకూ ఆయనతో పాటు భోజనానికి కూర్చోవద్దన్నది. ఆయన తిన్న విస్తట్లో తినాలనే మూఢవిశ్వాసం మానుకోమన్నది. భోజనం చేసి లేవగానే ఆయనకు వక్కపలుకు ఇచ్చే అలవాటు చేసుకొంటే మంచిదన్నది. ఆఫీసునించి యింటికి వచ్చే వేళకు పిలల్ని ఆడించుతూ, విసుగులేకుండా నవ్వు మొహంతో కనబడమన్నది. లేనిపోని గొంతెమ్మకోరికలు కోరి ఆయనకు చిరాకు కలిగించవద్దన్నది. చివరకు ఒక్కమాట మర్చిపోవద్దన్నది. మా అక్కయ్యగారి ఫోటో యెదురుగా నిల్చొని వొంటరిగా యెన్నడూ ఆలోచించవద్దు, అని—అక్కయ్య చెప్పిన యీ వుపదేశాల బరువుతోనే మూడురాత్రులు గడిచాక భీమవరం నించి మా వూరు చేరుకొన్నాప్—

భావికాలంలో నే నవలంబించబోయే మాతృత్వాన్ని మననం చేసుకోవడంతోనే పదిహేను రోజులు గడిపాను. నా మట్టుకు నేనే యేవో కొన్ని నిర్ణయాలు కూడా చేసుకున్నాను. కొన్నింటిలో నాకు కొంత అసంతృప్తి వుండవచ్చు, కాని దానిని పైకుబికి రానీయక లోపలనే అణచుకుని కార్యాచరణకు సిద్ధమయ్యే ప్రయత్నంలోనే వున్నాను—

భీమవరంనించి రావుగారు నాన్నకొక ఉత్తరం వ్రాశారు, 'తను వొంటరిగాడినని, పిల్లలను సాకుకుంటూ ఆఫీసుకు వెళ్ళి రావటం యాతనగా వున్నదని, వెంటనే వొక మంచిరోజు నిర్ణయించి, ఆ మొక్కు కాస్తా తీర్చితే నన్ను తీసుకువెళ్లుతానని"—ఆవుత్తరం నాన్న చెయిదాటి నాకళ్లబడింది. ఆయన బుద్ధిపూర్వకంగానే నాకు అందజేశాడనుకుంటాను. రావుగారు వ్రాసిన ప్రార్థనాపూర్వకమైన వాక్యాలు చూడడంతోనే నాకూ కళ్ళల్లో నీళు తిరిగినయ్—నే నెంత అమాయకపు, అవ్యక్తపు ప్రాణినైనా, వారి యెదుట నిలబడడానికే తాహతులేనట్లు జంకుతున్నా, నన్నే ఆసరాగా జూసుకుని రాబోవు జీవితంలో వారేదో సుఖపడాలని, తన తరఫున ఇంట్లో బాధ్యత వహించగల వ్యక్తి వొకటి కలదనే తృప్తి పొందాలని, ముఖ్యంగా తన బిడ్డలకు ఆలనా పాలనా లభించగలదని, ఇంకా యేవేవో తీయని తలపులతో మనసు నింపుకొన్నారుగదా!" అనిపించింది. వారి వూహాలన్నీ, కల్పనలన్నీ నిజాలని నిరూపింపవలసిన కర్తవ్యభారం యిప్పుడు నామీద పడిందన్నమాట! సహజంగా లోకంలో వారందరూ యిలాగే తలంచుకుంటూ వుంటారా? ఒక వ్యక్తికి మరొక వ్యక్తి గృహజీవనంలో ఆసరాగా వుండకపోతే జీవితంలో వెలుగు అనేదే వుండదా? ఇంతటి పవిత్రమైన పత్నీత్వము, మాతృత్వము, అనే రెండు ఉత్తమ ధర్మాలు నాకిచ్చి నిర్వర్తించుకోమంటున్నారా రావుగారు? అందుకై నేనెందుకు సంసిద్ధురాలను కాకూడదు? తప్పకుండా నడుంబిగించుకొని నేవున్నాను. మరి నాన్న వారికేమని సమాధానం వ్రాయబోతున్నాడో...

నేను ఏనాడో వారిదాననయ్యాను. ఇంకొక్క క్షణమైనా యిక్కడవుండగల తాహతు నాకు లేదు. రెక్కలుకట్టుకు యెగిరిపోదామన్నంత ఉత్సాహపు పొంగు నాలో పెల్లుబికివచ్చింది. నాన్నకూడా దగ్గరలో ముహూర్తం నిర్ణయించి రావుగారికి ఉత్తరం వ్రాశాడు. ఆనాటికే చిన్నక్కను రమ్మని బందరు వొక ఉత్తరం వ్రాశాడు—

అనుకొన్న రోజుకల్లా రావుగారు దిగారు. వెంట యెవ్వరూ లేకుండా ఆయన వొక్కరే వచ్చారు. జరగవలసిందంతా ముక్తసరిగానే గడచిపోయింది—వారికీ, నాకూగల సన్నిహితత్వం నిరూపించుకోవాల్సిన సమయం దగ్గిరపడుతున్నకొలదీ, నా మనసు అదోకలా గుండపడం మొదలెట్టింది. మొత్తంమీద మందమతిగా వుండకుండానే తోచిన పనులేవో చక్కబెట్టుకుపోతున్నాను.—పెద్దలు నిర్ణయించిన ముహూర్తం దగ్గిర పడడానికి అట్టే వ్యవధిలేదు. కావలసిన యేర్పాట్లన్నీ అక్కయ్య చేసుకుపోతున్నది. ఆయన నాకై ప్రత్యేకంగా తెచ్చిన జరీఅంచు తెల్లచీర సింగారించింది. మొహాన బొట్టు పెట్టి, గది గుమ్మంవరకు తీసుకువెళ్లి లాలించి లోపలకు పంపింది.—

రావుగారు మంచంమీద కూర్చొని యేదో పత్రిక చదవడంలో నిమగ్నులై వున్నట్టున్నారు. వెంటనే తలెత్తి నావంక చూడలేదు. ఆయన గ్లాస్గో పంచె కట్టుకుని సన్నని సిల్కులాల్చీ తొడుక్కున్నారు. భయాభయంగానే నేను వారివంక చూశాను. రెండు చేతులూ వెనక్కు పెట్టుకుని గోడకు చేరగిల బడి గుమ్మానికి ప్రక్కగా నిల్చున్నాను. ఎదురుగుండా

గోడన వున్న కోదండరాముని రూపచిత్రం నా మనసును ఆకర్షించింది. సీతామహాతల్లి ఆయన అంకంపైన యెంత నాజూకుగా, ఠీవిగా కూర్చొని వున్నది! జీవితంలో స్త్రీ కోరేది, కోరవలసింది కూడా పతి దగ్గిర తన కలాటి పవిత్రమైన ఆశ్రయం కావాలనేనా? తదేకంగా నేనటు చూడడం గ్రహించి, పత్రిక చదవడం ముగించి, నా మొహంలోకి పరకాయించి చూసినట్టున్నారు, రావుగారు. కొన్ని క్షణాలైన తరవాతగాని నేనా విషయం గ్రహించుకోలేకపోయాను. వా రక్కణ్ణించి లేవడానికే ప్రయత్నిస్తున్నటు అలికిడియై నా ధ్యానానికి భంగంకలిగించింది మరుక్షణమే 'లక్ష్మీ' అనే పిలుపు వారి పెదవులనుండి వెలువడింది. ఆ పిలుపుతో పాటే వారి పాదాలుకూడా నా వేపుకే కదులుతూన్నట్టు గ్రహించాను. మరొక కనురెప్పపాటులో నే వారిచేతులు సున్నితంగా నా పూలజెడను తడిమినై.

నే నంతకుముందే వూహించుకొన్నట్టు, తాను తలచినవీ, కల్పించుకొన్నవీ అన్నీ వ్యక్తంచేశారాయన. భావిజీవితం నిరామయంగా, నిరుపహతంగా గడచిపోవాలనే వారి వాంఛితం కొనసాగాలంటే అందుకు నాపై పెట్టుకొన్న ఆశలన్నీ వ్యక్తం చేసేటప్పుడు వారి కనుకొలకుల్లోనించి నీళ్ళు రాలటం నా కళ్ళారా చూశాను. పైటచెంగుతో అద్దే సాహసంలేక కాసేపు గజిబిజి అయినాను.

వారి యెదట నిలబడగల తాహతు, నాకు కలదనే ధీమా క్షణక్షణానికీ బలపడింది. క్రమంగా యిద్దరి హృదయాలూ సన్నిహితాలై, వొక తీరానికి చేరుకొన్న సంతృప్తిని వెల్లడించి పరస్పరం పలకరించుకొన్నయ్.

హృదయాలు ఏకమై, పరస్పరం పరిపుష్టమైన చైతన్యాన్ని నింపుకొన్నప్పుడు జీవితం వొడుదుడుకులు లేకుండా సాగిపోవడానికి, వయోభేదం అంతగా ఆటంకం కాదేమో...అని రెండవనాటి రాత్రి వూహించుకొన్నాను—ఆశలు, ఆశయాలు ఒకటైనప్పుడు, లౌకికములైన కొన్ని అసంతృప్తులను, వాటిని పురస్కరించుకొని ఉత్పన్నములైన ఆవేశాలను అణచుకొని అవాంతరాలను అధిగమించిపోయే అవకాశం లేకపోలేదని మూడవనాడు తోచింది నాకు—ఆ తరువాతి రోజునే రావుగారితోపాటు నేనూ భీమవరం ప్రయాణమయ్యాను. ఈ తడవ కూడా అక్కయ్యే నాతో వచ్చింది — నే నక్కడున్న మూడురోజులూ, మొదట నా మనసులో గల్గిన వూహాలన్నీ మరింత బలపడినయ్. అందుకై నేనూ కొంత ప్రయత్నించుకొన్నాను—తిరిగి అక్కయ్యా నేనూ యింటికి చేరుకొన్నాం.

కొన్నాళ్ళకు ఒక మంచిరోజున నన్ను తీసుకువెళ్ళి భీమవరంలో దిగవిడిచి వచ్చాడు నాన్న. నేనూ మామూలు సంసారిణినే అయ్యాను.

అక్కయ్య ఆనాడు చెప్పిన మాటలన్నీ అక్షరాలా పాటించడానికే పాటుబడ్డాను. పిలల విషయంలో నే నెంతమాత్రమూ యేమరి వుండేదానిని కాదు. రావుగారు కూడా నా వైఖరియెడ సంతృప్తిగానే వుండేవారు. అప్పుడప్పుడూ యేవేవో చిన్న చిన్న విషయాలపై నాతో సంప్రదించుతూనే వుండేవారు. మనసుకి కష్టంకలిగే మాట అనేవారే కాదు, ఒకవేళ నోరు జారినా నొచ్చుకున్నట్టుండేవారు. నేను నోరు చేసుకుని అడిగినా, అడగకపోయినా తనకు నచ్చిన ఏవో కొన్ని చీరలు, జాకెటు గుడ్డలు తీసుకువచ్చి నా సమ్మతిని అర్థించేవారు. అది కేవలం నన్ను తనవైపుకి ఆకర్షించుకొనే ఆరాటం మాత్రం కాదు; యధార్థంగా వారి మనసే అంత అని త్వరలోనే గ్రహించుకొన్నాను ఆఫీసునించి వచ్చేటప్పుడు, ఏదో వొకటి చేతబట్టుకు వచ్చి నాకిచ్చేవారు. పిల్లలు కాళ్ళకు అడ్డాలుపడి, తినుకు ముందు పెట్టమని వెంపర్లాడితే 'అమ్మ పెడుతుంది అడగమని' నన్ను చూపెట్టేవారు. ఆ మాట విన్నప్పుడు, ఒకప్పుడు సిగ్గుతో ముడుచుకొనిపోయేదానిని; మరొకప్పుడు అంతులేని ఆనందంతో పొంగిపోయేదానిని నా కళ్ళు అప్రయత్నంగానే గోడన వ్రేలాడుతున్న శాంతక్కయ్య ఫొటోవైపుకి చూసేవి.

మా యింట్లో ఉదయం, మధ్యాహ్నం కూడా కాఫీలు త్రాగే అలవాటుండేది. అందరం వొక్కసారే త్రాగేవాళ్లం పిల్లల్ని త్రాగించడంలో ఆయన కూడా యెక్కువ శ్రద్ధ తీసుకుంటూ వుండేవారు. సరోజకు ఒక చెమ్చా పంచదార యెక్కువ పడితేగాని కాఫీ నోట బెట్టేదికాదు. దానికి పానకాలస్వామి అని నేను పెట్టిన పేరు విని వారు ముసిముసి నవ్వులు నవ్వేవారు. ఒకనాడు యేదో పనితొందరలో వుండి భోజనం కాగానే చక్కపలు కీయడం మర్చిపోయాను. కాఫీకి వచ్చినప్పుడు ఆ సంగతి జ్ఞాపకం చేస్తే "దాని బదులుకూడా యిప్పుడే ఇవ్వు" అన్నారాయన. ఆ మాటతో నా హృదయం తేలికయింది.

అంట్లూ చెంబులు తోమడానికి, ఇల్లు వూడవడానికి పనికత్తె వుండనే వుండేది. ఎటొచ్చీ మిగతా వంటపనులు మాత్రమే నేను చేసుకోవాల్సినది. వెళ్లిన

అంత గట్టిగా, అంత అసభ్యంగా వాడు మాటాడ్డం అసహ్యమనిపించింది వాసుకి. మిగతా అతిథులందరూ తమవేపు అలగా జాతివాళ్లవేపు చూసి నట్టు చూస్తారేమో అని సిగ్గుతో చచ్చిపోయాడు. పోనీ—

"అలా బ్రూట్‌లా కేకలేస్తావేరా?" అనేపాటి ధైర్యంగూడా లేకపోయింది.

"అయితే ఏం తెచ్చావ్?" మరీ మెల్లగా అడిగాడు.

"కొన్ని పుస్తకాలు."

"ఏడిసినట్టుంది."

శారదపాట పూర్తి అయింది. హాలెగిరి పోయేట్టు చప్పట్లు, నవ్వులు, అభినందనలు—అంతా వాసుకి వింతగా కనిపించింది.

వెంటనే శారద వచ్చింది.

"హలో వాసూ...ఎలావుంది పాట?"

సమాధానం చెప్పాలి. తన సమాధానంలో తన తక్కువతనం స్ఫురించకూడదు. ఆ మిగతా వాళ్లందరి కంటె తనే గొప్పవాడనే భావంతో మాటాడాలి.

అందుకే మాటకిముందు నవ్వేస్తూ—

"చాల గొప్పగా వుంది" అన్నాడు. ఇంకా ఏమిటో విశేషణాలు చేర్చాలనుకొని చేర్చలేకపోయాడు. ఆ లోపాన్ని కప్పుకోడానికి, చప్పున చేతిలో ప్యాకెట్ ఆమెకు అందించాడు—పక్కనున్న రాము ఆమె అందానికి దిగ్భ్రాంతి చెంది, అలాంటి సౌందర్యరాశి తన స్నేహితురాలని ఆశ్చర్యంతో ఉక్కిరిబిక్కిరైపోతూ వుండాలనే అంత ర్భావంతో!

"ఇదేమిటి?" అంది శారద ఇటూ అటూ ఆ ప్యాకెట్ తిప్పుతూ.

"బహుమతి"

"ఓ" అంటూ నవ్వింది.

ఆ కిలకిలకి రాము చచ్చిపోయుంటాడు!

"నువ్వు కవివి గాబట్టి కవిత్వాన్ని మోసుకొచ్చావ్" అంది.

నిజానికి శారద ఆ మాటని మరో భావంతో అని వుండదు కాని, వాసుమాత్రం చాల సిగ్గుపడ్డాడు, 'ఓస్! పుస్తకాలటోయ్ బహుమతి చేసేది' అని ఆవిడ వ్యంగ్యంగా వెక్కిరించిందనే భావాన్ని దాన్లోనించి తీసుకొని.

"సరేగాని, ఫైవారం సింహాచలం పిక్నిక్‌కి వెడుతున్నాం, వస్తావా?" అంది.

"నేనా?"

"అవును నువ్వే"

"వీలుపడదు"

"ఎందుకో"

ఎందుకో మరి! నసిగాడు. పిక్నిక్! వూహించుకొంటే చాల గొప్పగానే వుంది. కాని అక్కడికి ఇలాంటివాళ్లతో వెళ్లడం మామూలు సంగతా?

"వీలుపడదు శారదా"

"నీ కెప్పుడూ వీలుపడదు—ఎందుకో మరి?"

సమాధానంనించి తప్పించుకోవాలి. ఇటూ అటూ చూసి లేచి—

"ఇహ మేం వస్తాం" అన్నాడు.

"ఇంత తొందరా?"

"కాస్త పనుంది...లెక్చరర్‌గా రేరి?"

"పిలవమంటావా?"

"వద్దులే...వస్తే వెళ్ళిపోయినట్టు చెప్పు."

బయటకు వెళ్ళిపోయాడు.

దార్లో రాము అన్నాడు:

"గగన కుసుమ మనుకొంటానురా వాసూ"

నిట్టూర్పు విడిచాడు.

"ఈ లెక్చరర్ ఎవరు?" కనీసం లెక్చరర్‌నైనా చూడని రాము నిజానికి ఏదో సమాధానం చెబుతాడని కాదు అడిగింది, మనస్సులో ఈర్ష్య, అసూయ, బరువు, భారం తగ్గిపోయేటందుకు అడిగాడు.

"ఎవరైనా కావచ్చు; కాని శారదమీద ఆశ పెట్టుకోవద్దని నా సలహా" అన్నాడు రాము.

"సలహా!" నవ్వుకున్నాడు.

వారందినాల తర్వాత ఓనాడు ఒంటరిగా సముద్రపొడ్డు ఇసికలో కూచొని రెండు నీలాంబుదాలను పరీక్షగా చూస్తున్నాడు వాసు!

అనంతంలో కలసుకొన్నట్టగుపిస్తున్న రెండు నీలాంబుదాలూ నిజానికి అక్కడ ఆలింగనం చేసుకొంటున్నవా? ఏమో—మాయ!—వేదాంతం కలగదు మనిషికి?

తన ఉనికిని జ్ఞప్తికి తెచ్చుకున్నాడు: చలనం లేని తన అస్తిత్వానికి దుఃఖించాడు. పాతికేళ్ళు మీద వచ్చిపడ్డాయి; ఇంకా తను ఆలోచిస్తూనే వున్నాడు—తన గురించి, తన జీవితం గురించి. ఏ ఒక్క నిర్ణయమూ చేసుకోలేడు; కచ్చితంగా అటో యిటో తేల్చుకొనే ధైర్యమూ లేదు!

ఈ వారం దినాల్లో ఏదో ఒక మధురానుభూతి తన హృదయంలో నిర్విరామంగా నృత్యం చేసింది. ఆ ఆనందంలో తనకి నిరాశలు, ఖేదాలు, కన్నీళ్ళు అగుపించలేదు. ఒకవేళ వున్నా అవి తనని అంతగా బాధించలేదు. ఆ క్షణాల్లో జీవితం పరమ పూజ్యంగా కనిపించింది: ఆ డిన్నర్లు, ఆ టీపార్టీలు, ఆ పిక్నిక్‌లు, ఆ నవ్వులు, ఆ మాటలు, ఆ నవ్వడి తనలో ఏవో ఏవో ఆశల్ని రేకెత్తించి చిత్రంగా ఉల్లాసపరిచేవి. పిన్ని చూతి నిరూపులు పూలమాలల్లా వుండేవి, బాబాయ్ తిట్లు సంపెంగ పరిమళాల్లా దగ్గరకు చేరేవి. నిరాశల్లో ఆశాసౌధాలు నిర్మింపబడేవి తమాషాగా!

కాని—

నిన్న!

తను వెళ్ళాడు: శారదను చూడాలని. మేడ మీద అగుపించింది: రెండు జడల్లో ఏనాడూ కనిపించనంత సౌందర్యంగా కనిపించింది.

"శారదా!" లోలోన ఉచ్ఛరించుకొన్నాడు! చప్పున మెట్లు యెక్కాడు. మాటలు వినిపిస్తున్నాయి: అక్కడే ఆగిపోయాడు.

"శారదా" ఒక కంఠం దగ్గరగా వచ్చింది!

"ఇదేమిటి—హద్దుమీరి నడిచేస్తున్నారు? వారం రోజుల్లో పెళ్ళి పెట్టుకొని యిలా అత్తారిళ్లకి రావచ్చా?" శారద గొంతు.

"సరేగాని రేపు నేను మద్రాసు వెడుతున్నా"- ఈ స్వరం లెక్చరర్‌దని వాసు గుర్తు పట్టగలిగాడు.

"ఎందుకు?"

"కొన్ని వస్తువులు తీసుకరావాలి."

"బాగుంది అంత అవసరమైతే ఎవరినైనా పంపించకూడదు?"

లెక్చరర్ నవ్వారు:

"భయం లేదులే — ముహూర్తానికి సరిగా వస్తాలే."

లెక్చరర్ వెళ్ళిపోయాడు.

శారద కూనిరాగం మొదలుపెడుతుంది.

పెళ్ళి! ఎవరికి? శారదకు...లెక్...

గుండె ఆగినంత పనయింది! క్షణంసేపు తను యెక్కడున్నదీ తెలుసుకోలేనంతగా కళ్లు మిరుమిట్లు గొల్పాయి. తేరుకొనేసరికి తను అప్రయత్నంగా మెట్లు దిగి, గేటు బయటకు వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి తను ఏం చేస్తున్నదీ, చెయ్యవలసిందీ తెలిసికోలేకపోయాడు. ఆ మర్నాడు ఆఫీసులో ఎలా పనిచేశాడో తెలీదు. సాయంకాలం చేతికి వచ్చిన జీతాన్ని గూడా లెఖ్ఖపెట్టుకోకండా తిన్నగా సముద్రపొడ్డుకు వచ్చాడు.

సముద్ర తరంగాలు పక్కవాళ్లకు ఆనందాన్నిస్తాయి. కాని తనలోని తరంగాలు తననే ముంగు సర్వనాశనం చేస్తున్నాయి తిరిగి జీవించాలనే వాంఛ ఉత్పృతమై తిరిగి కుప్పలా కూలిపోయింది! తనిప్పుడేం చెయ్యాలి?

బాగా చీకటిపడిన తర్వాత ఎటూ నిశ్చయించుకోలేని స్థితిలో యింటికి వచ్చాడు.

బాబాయ్ గొంతుక వినిపించింది:

"ఓయ్! నిన్నే! వాసు క్రితం నెల జీతం యిచ్చాడా అని అడుగుతున్నా."

"నస్నెందు కడగడం—మొత్తం అంతా కలిపి యిమ్మన్నారుగా? ఇస్తాడో, చస్తాడో అదంతా మీ పూచీ."

నిర్లక్ష్యంగా వాసు యింట్లోకివచ్చి, జీతాన్ని తీసి బాబాయ్ చేతిలో పెట్టాడు.

"ఏమిటిది?" అన్నాడు బాబాయ్.

"ఈ నెలజీతం"

"ఎంత?"

"నాకు తెలీదు"

బాబాయ్ లెక్కపెట్టుకున్నాడు.

"ఊఁ, క్రితం నెలది?"

రెండో జేబునించి ఇరవై తీసియిచ్చాడు. అదీ బాబాయ్ లెక్కపెట్టుకొని అడిగాడు:

"తతిమా నలభై ఏఁవి?"

"ఖర్చయిపోయింది బాబాయ్"

"ఎలా?"

"ఆమధ్య సింహాచలం స్నేహితులతో కలిసి వెళ్ళాను."

పిన్ని అందుకుంది:

"ఊహూఁ! తాగడానికింత లేదుగాని స్నేహితులతో షికార్లట గూడానూ—"

"నిజమే పిన్నీ" అన్నాడు నిట్టూర్పు విడుస్తూ. "తాగడానికి గంజిలేనివాడు సంతోషాలకోసం పైకి యెగరకూడదు."

"ఓ యబ్బో! మాటకిమాట యెదురాడ్డంకూడా నేర్చాడే! అదే ఏదో సామెత చెప్పినట్టు: ఆరునెల్లు అంట్లూ మెతుకులు తినేసరికి అంబోతు రంకె లేసిందట!"

వాసు చాలా తమాయించుకొన్నాడు:

"ఇకనలా రంకెలు వేయనులే పిన్నీ: నా బ్రతుకు నేను చూసుకొంటాను"

బాబాయ్‌కి చిర్రెత్తుకొచ్చింది:

"ఏమిటోయ్ నీ బ్రతుకు నువ్వు చూసుకొనేది? ఇన్నేళ్ళుగా నా సొమ్ము తిని నా రొమ్మే గుద్దడానికి ప్రయత్నిస్తున్నావ్!"

"అంత కృతఘ్నుణ్ణి కాను బాబాయ్. నేను మిమ్మల్నేం అనను. అమ్మా నాన్నా పోయాక ఇంతవరకు గాలిలో దీపం బ్రతుకు బ్రతికాను. ఇకనించయినా స్వేచ్ఛపొందాలని రెక్కలాడిస్తున్నాను— అడ్డగించకండి బాబాయ్"

"అవున్లే అది లోకసహజమేలే" అందుకొంది పిన్ని "ఎక్కడలేని దిక్కుమాలినవాళ్ళనీ ఈ కొంపకి తెచ్చి పోషించి, చివరికి యిలాంటి మాట లనిపించుకోడానికే అని నేను నెత్తీ నోరూ బాదుకున్నా ఆనాడు వినిపించుకోనందుకు, మామంచి బాగా చెప్పుతో కొట్టావు నాయనా"

"అంత కంగారుపడకు పిన్నీ—" వాసు మాటలు నోట్లోనించి పూర్తిగా రాకుండానే బాబాయ్ ఉద్రేకంతో "కంగా రేమిట్రా వెధవా" అని ఛెళ్లున దవడమీద కొట్టి బయటకు గెంటేశాడు.

వాసు కళ్ళనించి నీళ్లు గిర్రున తిరిగాయి. కోపాన్నీ, దుఃఖాన్నీ నిగ్రహించుకొంటూ:

"వస్తా పిన్నీ—వెళ్ళొస్తా బాబాయ్"అని వెళ్లిపోయాడు బయటకు!

గాలిలో దీపం నిశ్చలంగా నిలబడింది—వడగాలికి తట్టుకొని. చమురు పూర్తిగా ఆహుతయిన తర్వాత అంత్యంలో కలిగే నిశ్చలత యేమో అది!

తిన్నగా రాము యింటికి వెళ్ళాడు—సముద్రంలో పడి ఆత్మహత్య చేసుకోవాలనే భావంతో. తలుపు తట్టాడు. రాము ఆశ్చర్యపోతూ వాసుని లోపలికి తీసుకవెళ్ళి పడక కుర్చీలో కూచో బెట్టాడు. ఆ వాలకం అర్థంకాక రెండు మూడుసార్లు అడిగాడు "ఏమయిం"దని. సమాధానం లేక విసుగెత్తిపోయాడు రాము!

అరగంట తర్వాత వాసు రెండేమాటలు రాల్చాడు:

"శారద వెళ్ళిపోయింది—నా ఆశలు తిరిగి కూలిపోయాయి"

రాము భయపడ్డాడు. అయినా ధైర్యం చెప్పే ధోరణిలో—

"చాల గొప్పవాడివే గాని, యిక్కడ కాసేపు విశ్రాంతి తీసుకో, నే నిప్పుడే వస్తా"

"ఎక్కడికి వెడతావ్?"

"నీ కెందుకు—కాస్త పడుకొందూ."

తలుపు దగ్గరగా చారేసి రాము బయటకు వెళ్లిపోయాడు.

చాలసేపు వాసు పడకకుర్చీలో పడుకున్నాడు. కళ్ళు మూతలు పడవు! మస్తిష్కంలో తుఫాను: అంచులో శారద మెరిసి అస్పష్టంగా అదృశ్యమై పోతోంది.

చప్పున రొప్పుతూ లేచాడు. కలంతీసి రాశాడు. నుదుటిమీది బిందువులు సిరామీద రాలాయి. వాసు చూసుకోలేదు. సంతకంచేసి, తలుపుతీసి వెళ్ళిపోయాడు.

పావుగంటలో రాము వచ్చాడు, శారదతో కలసి.

శారద కంగారుగా "వాసు ఏడి?" అంది.

రాము లోపలికొచ్చి చూశాడు: ఖాళీ పడక కుర్చీ! పిలిచాడు—ప్రతిధ్వని తప్ప సమాధానంలేదు! అరచాడు; గది కంపించి భయంతో ఆ కేకని రెట్టించింది—వెళ్ళిపోతున్న వాసుకి వినిపిస్తుందో వినిపించదో అని.

దీపం వెలుతుర్లో కాగితం కనిపించి చప్పున ఎత్తి చదివాడు. పూర్తికాకుండానే "వాసూ" అని అరచుకొంటూ సముద్రం వేపు పరుగుతీశాడు రామూ —"ఆగండి నేనూ వస్తున్నా" అన్న శారద మాటలనైనా వినిపించుకోకుండా!

# రాజేంద్రవర్మ పాడలిశాసనము

### శ్రీ మండ నరసింహము

పూర్వగాంగవంశపురాజులలో నొకరగు అనంతవర్మకొడుకు రాజేంద్రవర్మచే నీయబడిన దీ తామ్రశాసనము. తండ్రి అనంతవర్మ జీవితకాలములో నాతనికుమారుడు రాజేంద్రవర్మ యువరాజుగా నుండునపుడు కళింగనగరమునుండి నీయది యొసంగబడినది. పూర్వరాజులవలెనే ఈ యువరాజుగూడ మూడు రాగిరేకులపై దానపత్రము వ్రాయించి యిచ్చెను. శాసనమందు దానకాలము తెలుపబడి యుండుటచే నియ్యది క్రీ. శ. ఏడవ శతాబ్దాంతపుదియని స్పష్టముగా తెలియుచున్నది. భాషయంతయు సంస్కృతమేయయ్యు, లిపి పురాతనపు తెలుగు. ఈ లిపినే తెలుగు కన్నడ లిపియని శాస్త్రజ్ఞులందురు. ఆ కాలమున కన్నడ తెలుగు లిపులకు నెట్టి భేదములేదు. ఈ రెండుభాషలుగూడ నొక్క లిపిచేతనే వ్రాయబడుచుండుటచేతను, తరువాతి కాలమున, లిపులుగూడ వేరుత్రోవలబట్టుటచేతను, ఆనాటి లిపికి, లిపిశాస్త్రజ్ఞులు తెలుగు కన్నడ లిపియని పేరుబెట్టిరి.

లేఖకుడు దామచంద్రుడని తన పేరును శాసనమున చెప్పుకొనియున్నాడు. ఈతనికి అక్షరజ్ఞానము తప్ప విద్య యేమాత్రమున్నట్లు గానరాదు. శాసనము మొదటినుండి చివరవరకు తప్పులతడికయే. శాసనమెంత గ్రంథమగుచున్నదో తప్పులు చూపుటకు మరియంత గ్రంథమగును. అయినను విమర్శకునిపని వివిధ గుణదోషములు జూపుటయే. అందుచేత శాసనమూలము యథాప్రకారము వ్రాసి సవరణ పాఠము ప్రత్యేకముగా నీయబడినది.

తప్పులట్లుండ అక్షరక్రమమునగూడ కొన్ని మార్పులు కనబడుచున్నవి. 'న' అను అక్షరము రెండువిధములను 'మ' అను అక్షరము రెండువిధములను వ్రాయబడియున్నది. బ, వ లకు భేదమేమియు చూపుటలేదు. ఒకప్పుడు 'మ' అను అక్షరము, 'వ' కు బదులుగా వాడబడుచుండెను. అరవభాషలోనుండు 'ఱ' అక్షరము తెలుగులో నీ శాసనమున కనబడుచున్నది అది 'డ' కారోచ్చారణముగా మారినది. అచ్చులలో, అ, ఉ, ఇ, ఔ అనునవి వాడబడినవి. అచ్చులు, హల్లులుగూడ వేంగీలిపికి భిన్నముగా నున్నవి. 7, 8 శతాబ్దములనాటి తెలుగుభాషా పరిణామమే వేంగీలిపిగా మారినది నన్నయభటీయమందలి "బాలేందు పరిఘ, శంఖావర్త, కుశగ్రంధి" యిత్యాది పూర్వ లిపులరూపమును వర్ణించు వ్యాకరణసూత్రము ఈశాసనలిపి కన్వయించదు. ఇతరవిషయముల శాసనగ్రంథమంతయు పూర్వపు పోకడలనే సామాన్యముగ నడచుచున్నది. కళింగరాజుల ముఖ్యదైవతమగు గోకర్ణస్వామి, రాజుల ప్రతాపాతిశయము, కళింగనగరవైభవము, సామంతరాజుల తమ ప్రతాపముచే లొంగుబాటులో నుంచగలుగు గొప్పతనము మొదలగు వర్ణనలతో నిండియున్నది తరువాత తండ్రి పేరును, దాతయగు కుమారుని పేరును, ఆతరువాత దానాది క్రమమును వర్ణింపబడినవి. దానమును రాజధాని నగరమునుండి కుటుంబీకుల ప్రముఖ జానపదులసభయందు రాజు వెల్లడించుట, భూదానగ్రామమునకు నలుదిక్కుల సరిహద్దులు పేర్కొనబడినవి. ఆ తర్వాత భూదానమువలన గలుగు పుణ్యమును, దానము చేయబడిన భూమిని అపహరించుటవలన కలుగు పాపములను వివరించు వ్యాసగీతములు నుదాహరింపబడినవి. దానము చేయబడిన గ్రామము విదేశాంగ వ్యవహార మంత్రి 'సంధివిగ్రహి' ఆమోదమును పొందినటుల చెప్పబడినది. దానకాలమును చెప్పుటలో గాంగశకమే తెల్పబడినది. సంవత్సరముల సంఖ్య తెలుపుటలో అక్షరములతోను, అంకెలతోను వివరింపబడినది. ఆఖరున శాసనమును చెక్కిన వాని పేరుకూడా తెలుపబడినది. ఈ వివరములచేత పూర్వపు రాజుల శాసనములకును దీనికిని విశేషభేదము గానరాదు.

ఆంధ్రదేశమున నీ దాన తామ్రశాసనమునకు కొంత ప్రాధాన్యము కలదు. ఆ కాలపు లిపి యొట్లుం

డెనో, క్రమక్రమముగా నే యే పరిణామముల జెందెనో చూపుటలో నాంధ్రభాషా, లిపి శాస్త్రముల నియ్యది గొప్ప ప్రాధాన్యమును బొందుచున్నది. గ్రామ నామములు, దానమును బొందిన మనుష్యుల పేరులు, గ్రామ సరిహద్దుల చెప్పుటకని వాడబడిన కేవలాంధ్ర పదములు, ఇవన్నియు పూర్వకాలపు తెలుగుభాషా తత్వశాస్త్రమునకు (*Philology*) మిక్కిలి తోడ్పడుచున్నవి. చారిత్రక విషయమున గూడ నీ శాసనము అత్యంత ప్రాముఖ్యమును బొందుచున్నది. అనంతవర్మలును, రాజేంద్ర వర్మలును అనేకులు పూర్వగాంగవంశమున నున్నారు. ఆ వంశవృక్షమున వీరి స్థానమును నిర్ణయించుటకు దానకాలము తప్ప వేరుమార్గము లేదు. సంధి విగ్రహి పేరును లేఖకుని నామముగూడ తోడ్పడుచున్నవి. దానకారణములుగూడ నాటిసాంఘిక చరిత్రనవగతము చేసుకొనుటకు ముఖ్యాధారము లగుచున్నవి.

కలింగరాజ్యములో ఇప్పటి కాలమున జిల్లాలు, తాలూకాలువలె పూర్వము మండలములు, విషయములు గలవు. ఈ శాసనములో దానము చేయబడిన గ్రామము 'కృష్ణమట్ట' మను విషయములోనిది. దానము ఛేయబడిన గ్రామము "పాట్టలి" అనియు 'పాటలి' అనియు చెప్పబడినది. ఈ గ్రామ మిప్పుడు "పాడలి" అని వ్యవహరింపబడుచున్నది. ఈ పాడలి గ్రామము నేటి శ్రీకాకుళం, పాతపట్నం, పాలకొండ తాలూకాల సరిహద్దున నున్న పర్వత ప్రాంతమున నున్నది. ఇదియొక చిన్న కొండగ్రామము. ఇందు నివసించువారు చాలభాగము సవరలు. వీరినే శబరజాతియని చెప్పుదురు. హిందువులుగూడ కొలదిగ నున్నారు. సవరలు 'పోడు' వ్యవసాయమునకు మాత్రమే అలవాటు పడినవారు. వీరి పంటలు, కందులు, గుమ్మడికాయలు, దుంపజాతులు, చింతపండు, అరటికాయలు, ఇతరమైన కూరజాతులు ముఖ్యములు. వీనిని కొండలపైనున్న హిందువులకమ్మి ఆ ధనముతో, ఉప్పు పొగాకు బియ్యము మొదలగు సవరల కత్యవసరముగు వస్తువుల కొని జీవయాత్ర గడుపుదురు. శాసనమందలి 'పాటలి' నేడు 'పాడలి' అని వ్యవహరింపబడుటచేత నీ గ్రామమందు ప్రజోక్తి నా కాలమున 'కృష్ణమట్ట'మని పిలువబడుచున్నట్లు చెప్పవచ్చును. గ్రామనామమందలి 'ట' 'డ' గ మారుట శబ్దశాస్త్రమునకు భిన్నము కాదు. 'ట' 'డ' లు రెండును మూర్ధన్యములే.

దాన ప్రతిగ్రహీత లిరువురు. మొదటివాడు బ్రాహ్మణుడు వీని పేరు కంచి పొట్టిభట్టు. ఇతడా గ్రామ దేవాలయపు అర్చకుడు కానోపు. దానము 'బలినివేద్యచర్తాయ' అని చెప్పబడినది, దేవాలయములలో బలిహరణము, నైవేద్యము అను కార్యక్రమములు జరుగుచుండవలెను. దేవతకై సిద్ధముచేసిన భోజనాదికములు నివేదనకు పూర్వము కొంతభాగము బలిపీఠమున నుంచెదరు. దీనినే కాకబలియందురు. ఆ తర్వాతనే క్రమముగ నైవేద్యము జరుగును. ఈశ్వరాలయములలోను, దేవాలయములలోను నైవేద్యముచేయబడిన భోజనాది ద్రవ్యములు బ్రాహ్మణాలుతినరు. దానిని శూద్రులే యనుభవింతురు ఇందుచేతనే శివాలయమందలి సేవకులే దీని గ్రహింతురు. శాసనమున శివప్రసాదమును పొందుటకు నిర్ణయింపబడినవాడు శబరజాతివానివలె కనబడుచున్నాడు. వాని పేరు "జాద్ధాట" ఈ నామము సవరజాతిలో నిప్పటికిని వాడుకలోనున్నది. జాఘు, జాద, జాగట, జాఘుడు, ఇట్లు బహు వికారరూపములలో నీ పేరు నేటికిని వాడుకలో కనబడుచున్నది; ఈ సేవకుడు 'సంకిరి' గ్రామవాసిగా చెప్పబడెను. ఈ గ్రామము 'సంకిలి'యను పేరుతో కొండలపై గనబడుచున్నది. సంకలి అను గ్రామము పాడలికి సమీపమున నున్నది. శాసనములో చెప్పబడిన అరలియను గ్రామము నేటికిగూడ నా పేరుతోనే వ్యవహరింపబడుచున్నది. 'కంచి పొట్టిభట్టు' అను పేరుగలవాడు కేవలము తెలుగువాడుగా కనబడుచున్నాడు. బహుశా ఈతడు కంచిప్రాంతమునుండి వచ్చి అర్చకత్వమునకు నీ ప్రాంతమున కుదురుకొని రాజసన్మానముచే పాడలి అను గ్రామమును పొందియుండవచ్చును. 'పొట్టి' అను పదము కేవలాంధ్రపదము కావున నీతడాంధ్రు డనుటలో నెట్టి సందియము లేదు. సేవకునకు దానముచేయబడిన భూపరిమితి 'పంచాల్య' అని చెప్పబడినది. దీనినే 'పంచహాల్య' లేక యైదు నాగళ్ళతో దున్నుటకు తగినంత భూమి అని చెప్పవచ్చును. కంచి పొట్టిభట్టున కిచ్చిన భూభాగమునకు సర్కారు పన్ను కట్టనవసరము లేదు శాసనములో 'భట్టరికాయాం సర్వ కరపరిహృత్య' అని చెప్పబడుటచేత సేవకుని కిచ్చిన భూమిపై పన్ను చెల్లించుకొనవలసియున్నది. యువరాజగు రాజేంద్రవర్మయు వాని తల్లి శ్రీలోకమహాదేవియు నీ కొండల నడుమనున్న యొక పల్లెగ్రామములోని చిన్న దేవాలయపు అర్చకునియందు ఇంత ప్రేమాభిమానములు జూపుటలో నాకాలపు రాజుల పరిపాలనము పర్వతాగ్ర

స్థిత జానపదములందును ఆటవికజనులందును గూడ వ్యాప్తి గాంచుచుండి సమగ్రముగా నుండెనని బోధ పడును.

ఆంధ్ర శబ్దశాస్త్రమున కృషిసలుపు పండితులకీ శాసనమందు వాడబడిన తెలుగు పదజాలము కొంత విమర్శకు తావొసంగుచున్నది. ఇందు వాడిన తెలుగు పదములు:—

1 పొటలి, పొట్టలి—గ్రామనామము. ఇప్పుడు పొడలి అయినది.

2 కంచి పొట్టిభట్టు—బ్రాహ్మణుని పేరు. పొట్టి పదము తెలుగు.

3 డాపు—సమీపార్థమున వాడబడియుండును.

4 పంచాల్య—భూమి కొలత ప్రమాణము. బహుశా 'పంచహాల్య'కు వికృతమేమొ.

5 సంకిర—గ్రామనామము ఇప్పుడు సంకిలి అయినది.

6 జాధాట—సేవకుడగు సవరవాని పేరు-యోధశబ్ద వికారమేమొ?

7 అరలి —గ్రామనామము.

8 నాఫ —కొలువ కావచ్చును.

9 నిబ్బిల—వృక్షము పేరు.

10 గర్త —మార్గము.

11 కాశించి—వృక్షము పేరు కావచ్చును.

లేఖకుడు దామచంద్రుడు విద్యావంతుడు కాడని యిదివరకే చెప్పియుంటిమి. ఇతని కేమాత్రము జాగ్రతయున్నట్లు కనబడదు మూడవ రేకులో ఆరవ పంక్తి వ్రాయుటలో పంక్తులు చిన్నగా వ్రాయలేక మూడక్షరములుమాత్రమే ఒక పంక్తిగా చేయవలసి వచ్చెను. శాసనగ్రంథమంతయు మూడు రేకులలో నిమిడ్చలేకపోయెను. గ్రంథమందలి ఆఖరు మూడు పంక్తులు మిగిలిపోయినవి. ఈ పంక్తులను మూడవ రేకు రెండవప్రక్కను వ్రాయవలసియుండగా తెలివి తక్కువచేత మొదటి రేకు మొదటిప్రక్కను వ్రాయుట కారంభించి ఒకటిన్నరపంక్తులువ్రాసి ఆపైని తన తప్పును తానే గ్రహించుకొని తరువాత మూడవ రేకు రెండవప్రక్కను తిరిగి ఆరంభించి గ్రంథమును ముగించెను. మొదటిరేకు మొదటిప్రక్క చెక్కిన భాగము చెరిపివేయుటకు వీలులేక అట్లే యుంచి వేసెను. వీని తెలివితక్కువవలన మూడు రేకుల కారు ప్రక్కలపై లిపి కనబడుచున్నది.

పూర్వగాంగవంశపు రాజుల వంశవృక్షమున నీరాజుస్థానము నిర్ణయించుటకు నా రాజీశాసనమున నిచ్చినకాలమే తోడ్పడుచున్నది. దానకాల మిట్లు చెప్పబడినది: "గాఙ్గేయవఙ్శప్రవర్ధమానవిజయరాజ్య సమ్వ్యధరశతత్రయేత్రయోదశధిక 313 —" లేఖకదోషముల సవరించి చదువ నీయది 'గాంగేయవంశప్రవర్ధమాన విజయరాజ్యసంవత్సరాః శతత్రయేత్రయోదశాధిక 313' అని యగును. వీని తండ్రి అనంతవర్మ గాంగశకము 304 లో నున్నట్లు తెలియుచున్నది. వీనిశాసనములు రెండిప్పటివరకు ప్రచురింపబడినవి. [(1) *EP. Ind. Vol III P. P. 7-21.* (2) *EP. Report For 1924 P. P. 97-98.*]

అనంతవర్మతరువాత దేవేంద్రవర్మ యనువాడొక డేలినట్లు కనబడుచున్నది. వాని శాసనము నాచేతనే (*J. A. H. R. S; Rajahmandry Vol 19* లో) ప్రచురింపబడినది. అదిపశింత్రి గ్రామమున లభించినది.

ఈశాసనకర్త రాజేంద్రవర్మదానశాసనము లింతవరకు రెండుమాత్రమే ప్రచురమైనవి. ఇది మూడవది. మొదటి శాసనము (*J. B. O. R. S Vol. 12 P.101*) బీహారులోని పాట్నా సంచికలో ప్రచురింపబడినది.

రాజేంద్రవర్మతండ్రి అనంతవర్మ అని శాసనము చెప్పుచున్నది. రాజేంద్రవర్మ యువరాజనికూడ నిందె జెప్పబడియున్నది. ఈతడు యువరాజుగా నుండుట తండ్రి బ్రతికియుండినకాలములోనా? లేక తండ్రి యనంతరము రాజ్యపాలనము చేసినట్లు రుజువగుచున్న దేవేంద్ర వర్మకాలములోనా? దేవేంద్రవర్మ అనంత వర్మకు తమ్ముడు. కొడుకునకు రాజ్యము రాక అనంత వర్మ తమ్మున కేల రాజ్యము వచ్చెను? అనంతవర్మ చనిపోవుసరికి రాజేంద్రవర్మ చిన్నవాడా కాడు. ఇట్లుండు రాజ్యము తమ్ముడగు దేవేంద్రవర్మకు నేల రావలయును? అప్పటి రాజకీయ పరిస్థితులు తెలియ రాకున్నవి. అనంతవర్మ దానశాసనములలో సంధి విగ్రహి సామిరాజు. దేవేంద్రవర్మ కాలమునకూడ నాతడే ఆపదవియందుండెను. యువరాజు రాజేంద్ర వర్మకాలమున కూడ నితడే సంధివిగ్రహి యగుటచేత నీ రాజుకాలమున నితడు మిక్కిలి ముసలివాడై యుండునో? రేకుల చెక్కిన దామచంద్రుని కొడుకు భీమచంద్రుడను పేరు తరువాతి రాజుల శాసనములలో కనబడుచున్నది.

రాజేంద్రవర్మకు సంధివిగ్రహి సామిరాజని ఈ శాసనమునకలదు. కాని గాంగశకము 310 లో వ్రాయబడిన శాసనమున సామిరాజు కుమారుడు సంధివిగ్రహికుడు రణామేయుని పేరు కనబడుచున్నది. 313 లో యువరాజుగా నీతడుండ 310 లో నీతడు స్వతంత్రరాజనియు చెప్పబడి బీహార్ పత్రికలో *Vol* 12 *P.* 101 లో ప్రచురితమైన శాసనము కల్పితమైయుండెనోపు. దీనిగూర్చి యింకను విమర్శ జరుగవలయును.

గాంగేయ ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరములచే పూర్వ కళింగరాజులు కాలగణనము చేయుచుండిరి. ఈ గాంగశక మెప్పుడు ప్రారంభమైనదో యింతవరకును నిర్ణయింపబడలేదు. కాని కళింగ చరిత్ర విమర్శకులు క్రీ. శ. 494 వ సంవత్సరమున నీశకము హస్తివర్మవలన కళింగమున స్థాపింపబడినదని నమ్ముచున్నారు. ఈ యువరాజు రాజేంద్రవర్మ గాంగశకము 313 లో నీ దానమొసంగుటచేత నీ రాజును, వాని శాసనమును 494+313=క్రీ. శ. 807 అగుచున్నది. అందుచేత నీ శాసనము 1150 సంవత్సరములకు ముందుగా ఆంధ్రదేశమున బుట్టినదని రూఢిగా చెప్పవచ్చును.

# రేకులందున్నరీతి పాఠము

## 1 వ రేకు - 2 వ పేట



1. ఓం. స్వస్తిమరపురాణు కారిణ సుర్వర్తుసుఖరమణీ
2. యద్విజయవతు కలిఙ్గ నగరవాసక మహేన్ద్రా చలామ
3. ల శిఖరప్రతిష్ఠితస్య స చరాచర గురో సకల భువ
4. న ని ర్మాణైక సూత్రధ్ధారస్య ససాఙ్క చూడామణే భగవ
5. తో గోకర్ణస్వామి నశ్చరణ కమలయుగల ప్రణా
6. మద్విగతు కలికాల కలఙ్కానేక హావసఙ్క్షోభ జనితుస్తేజయు
7. సప్రతాపావనత సమస్త సామన్త చక్ర చూడా
8. మణి ప్రభామఞ్జరీపుఞ్జ రఞ్జితవరచరణోని

## 2 వ రేకు—1 వ పెడ

1. జనిస్త్రొ పద్ధారోపాజి తసకల కలిఙ్గాద్ధి రాజ్య
2. ప్రథిత తసిత కుముద కున్దేన్ద్వవదాత వినిర్గ
3. త యశోద్ధస్తా రాతికులాచలే నయవినయ దయాదా
4. న దాక్షిన్య ఔదార్య సత్యత్యాగాద్ది గుణసమ్పదా
5. ద్ధారభూతాత్ పరమ మాహేశ్వరో మాతాపితృపదానుధ్యా
6. తో గఙ్గామల కులేఙ్గవే మహారాజాధిరాజ పరమే
7. శ్వర పరమభట్టారక శ్రీఅనన్తవర్మ్మ దేవసూను యు
8. వరాజ శ్రీరాజేనవర్మ్మ కుశలీ కృష్టమట్టిమ్వ అ

## 2 వ రేకు—2 వ పెడ

1. న్త పాతిపొట్టలిగ్రమ నివాసి కుటుమ్బిన జనపదాన
2. వా జ్ఞాపయతిచాస్య విదితమస్తు వోభతాం గ్రామోయ శ్రీమ
3. త్కన్చిపొట్ట భట్టరికాయా బలిని వేద్యచరా నిమిత్తాయ
4. ప్రదతం అపరముపిడాపు పశ్చాల్యాయ కృశసజ్కర గామ
5. జాద్ధాట్ట పశ్చాల్య అనలిగ్రామం తస్యమా తరయా శ్రీలో
6. క మహాదేవి ప్రదతం భట్టరికయాం సవణాకరభిరా పరిహృత్య
7. చన్ద్రార్కణ ప్రతిష్ఠా మాతాపితరౌరాత్మనశ్చ పుణ్యాభివృధ
8. పాతలి గ్రామస్యసీమాలిజ్గాని భవన్తి పుర్వణ దిశాయానౌధ

## 3 వ రేకు—1 వ పెడ



1. నిబ్బిలావిల్వ వృక్ష దక్షిణేవగతణ నద్యాని శిలాపశ్చిమత భూజక
2 గతణ అమ్వ్రివృక్ష ఉత్తరేకాశిమ్బిగతణ చకౌరాజికాశ్చేతి వహు
3. భి వణసుద్ధాదతౌరాజభి పగరాదిభి యస్యయస్య
4 యదాభూమి తస్య తస్య తదాఫల స్వదతా పరదతౌమ్వా
5. యోహరేతి వసున్దరా సవిష్ఠాయోకృమి భూణత్వా పితృభి సహా
6. పచ్యత
7. మభూాయ ఫలసకవ పరదతేతి పార్థివా స్వదతా ఫలమానన్య పర
8. దానానుపాలన ఇతికమలదలమ్బు బిన్దులోల చపల శ్రీమను
9. చిస్య మనుస్యజీవితం పురుషమిద ముదాహిత బుద్ధ్వానహిపురాది

## 3 వ రేకు - 2 వ పెడ

1. నపరకీర్తిర్జయే విలేప్య గాఙ్గేయవజ్ర ప్రవర్ధమాన విజయ
2. రాజ్యసమ్వత్సర సతత్రయే త్రయోదశధిక 313 లిఖితమిద
3. మహాసన్ధి విగ్రహిక శ్రీసామిరాజేనా ఉత్కీర్ణం చాకుసాలిన శ్రీదామ చన్ద్రేణ ఇతి||

## 1 వ రేకు - 1 వ పెడ

1. నపరకీర్తిర్జయే విలేప్య గాఙ్గేయ వజ్ర ప్రవర్ధ (మా) నవిజయ
2. రాజసమ్వత్సరసతత్రయా

# తప్పులు దిద్ది సవరణచేసిన పాఠము

## 1 వ రేకు - 2 వ పెడ

1. ఓం|| స్వస్త్యమర పురానుకారిణ స్సర్వర్తుక సుఖరమణీ
2. యాద్విజయావ త్కలిఙ్గ నగరవాసకాన్మహేన్ద్రా చలామ
3. ల శిఖర ప్రతిష్ఠితస్య సచరాచరగురోః సకలభువ
4. న నిర్మాణైక సూత్రధారస్య శశాఙ్క చూడామణేర్భగవ
5. తో గోకర్ణస్వామినశ్చరణ కమలయుగల ప్రణా
6. మాద్విగత కలికాల కలఙ్కో నేకాహవ సఙ్క్షోభజనిత జయ
7. శబ్ద ప్రతాపావనత సమస్త సామన్త చక్ర చూడా
8. మణిప్రభామఞ్జరీ పుఞ్జరఞ్జిత వరచరణాని

## 2 వ రేకు - 1 వ పెడ

1. జనిత్రీంశద్భాగోపార్జిత సకల కలింగాధిరాజ్య
2. ప్రతాపతతి సితకుముదకున్దేన్ద్వవదాత వినిర్గ
3. త యశోంశువిస్తారాతి కులాచలే నయవినయ దయాదా
4. న దాక్షిణ్యౌదార్య సత్యత్యాగాది గుణసమ్పన్నా
5. ధార భూతో పరమ మాహేశ్వర మాతాపితృ పాదానుధ్యా
6. తో గాఙ్గామలకులతిలకో[1] మహారాజాధిరాజ పరమే
7. శ్వర పరమభట్టారక శ్రీ అనన్తవర్మదేవసూను యు
8. వరాజ శ్రీ రాజేన్ద్రవర్మా కుశలీ కృష్ణమట్టమ్బ అ

## 2 వ రేకు—2 వ పెడ

1. న్తః పాతిపాటలి గ్రామనివాసినః కుటుమ్బినః జనపదాన్స
2. మాజ్ఞాపయతి చాస్య విదితమస్తువో భవతాం ఇయం గ్రామేయ శ్రీమ
3. త్కృష్ణ పాటిభట్టరికాయాం బలి నివేద్య చరానిమిత్తాయ
4. ప్రదత్తం అపరమపిడావు[2] పఞ్చాల్యాయాకృశ సజ్కర గ్రామ
5. జాధాటపఞ్చాల్య అరలి గ్రామంతి స్వహాతరయా శ్రీలో
6. కమహాదేవి ప్రదత్తం భట్టరికాయాం సర్వ్వకరభరైః పరిహృత్య
7. మాచన్ద్రార్కకృ ప్రతిష్ఠామాతాపితరోరాత్మ నశ్చపుణ్యాభివృద్ధ
8. యే పాతిలి గ్రామస్యసీమాలిఙ్గానిభవన్తి పూర్వ్వదశాయాం నాన.

## 3 వ రేకు - 1 వ పెడ

1. నిమ్బిలా బిల్వవృక్షాః దక్షిణో నగర్త్తా నద్యానిశిలా పశ్చిమతః భూజక
2. గర్త్తా ఆమ్రవృక్షాః ఉత్తరేకా శామ్బిగర్త్తా చకారాజికాశ్చేతి బహు
3. భిర్వ్వ సుధా దత్తా రాజభిస్సగరాదిభిః యస్య యస్య
4. యధాభూమి స్తస్యతస్య తదాఫలం స్వదత్తాం పరదత్తాం వా
5. యోహరేతి వసున్ధరా స్వవిష్ఠాయా క్రిమిభూర్త్వా పితృభిస్సహ
6. పత్యతే
7. మాభూయ ఫలసఙ్కవః పరదత్తేతి పార్థివా స్వదత్తాః ఫలమానన్త్య పర
8. దానానుపాలనాః ఇతి కమలదళామ్బు బిన్దులోలచపల శ్రీమను
9. చిన్త్యమనుష్య జీవితం పురుషమిదముదాహితిహిత బుద్ధే నహి పురాది

## 3 వ రేకు - 2 వ పెడ

1. నపరకీ త్తర్ణయే విలేప్య గాఙ్గేయవంశే ప్రవర్ద్ధమానవిజయ
2. రాజ్యసంవత్సర శతత్రయే త్రియోదశాధిక 313 లిఖితమితి
3. మహాసన్ధి విగ్రహిక శ్రీసామిరాజేన ఉత్కీర్ణ్ణచాక్షుశాలి శ్రీదామచన్ద్రేన ఇతి.

## 1 వ రేకు - 1 వ పెడ

1. నపరకీ త్తర్ణయే విలేప్యగాఙ్గేయవంశే ప్రవర్ద్ధమాన విజయ
2. రాజ్య సంవత్సర శతత్రయో......

---

1 గఙ్గామల కులేజ్జవే అని మూలములో నున్నది. దీని కర్థము గాంగకులమునకు గోవు వంటివాడు. ఇక్కడ గవ శబ్దము శ్రేష్ఠవాచకముగా వాడబడినది. ఇట్టి వాడుక యుక్తము కాదేమో.

2 సవరించుటకు వీలు లేకున్నది.



# కలగూరగంప

## చైతన్య చరితామృతము రాజమహేంద్రవరము

తెలవని తలంపుగా రాజమహేంద్రవర చరిత్రకు సంబంధించిన కొన్ని యపూర్వ విషయములు "చైతన్య చరితామృతము" అను గ్రంథమున గోచరించి నా కాశ్చర్యము గలిగించినవి

శ్రీ చైతన్యస్వామి వంగదేశమున నుదయించిన మహాపురుషులలో నొక్కడు. బంగాళా దేశమందును ఒరిస్సాయందును అతనిని శ్రీ కృష్ణుని యపరావతారముగా గణించి పూజింతురు. పైని పేర్కొన్న చైతన్య చరితామృతము అతని జీవితమును గూర్చిన ప్రామాణిక గ్రంథములలో నొక్కటి. దీనియందలి "అంత్యలీల" అను ముఖ్యభాగమును కలకత్తా యూనివర్సిటీకి వైసు ఛాన్సలర్ పదవి నలంకరించిన సుప్రసిద్ధ చరిత్రకారులు శ్రీ జదునాథ్ సర్కారుగారు ఇంగ్లీషులోని కనువదించిరి. వీరు తమ చరిత్ర పరిశోధనమును పురస్కరించుకొని అప్పుడు వాడుకలో నున్న ఆయా ప్రదేశముల పేళ్ళను గూర్చి చరిత్రాంశములను గూర్చి పాదటీకలను (*Foot-notes*) వ్రాయుచు వచ్చిరి.

ఈ గ్రంథమున నాలుగైదుచోట్ల "విద్యానగరము" అను పురమునుగూర్చి కొన్ని విశేషములున్నవి. ఈ విద్యానగరము గోదావరీతీరమున నున్నదనియు ఒరిస్సా రాజుల పాలనమున నున్నదనియు నుండుటచేతను మరికొన్ని యితరాంశములను బురస్కరించుకొనియు ఈ నామము రాజమహేంద్రవరమునకే యన్వయించునని సర్కారుగారు నిర్ణయించిరి. అయినచో ఇది యీ పట్టణమునకు బిరుదనామము కావలయును. ఏలన రాజమహేంద్రమను నామము నిన్న నేడు వచ్చినది కాదు. పదకొండవ శతాబ్దము నాటిదగు నన్నయ భారత పీఠికలోను, 1330 లో నున్నటు శ్రీ వీరేశలింగముగారు నిర్ణయించిన విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలోను, 15 వ శతాబ్దాదినిగూడ నున్న శ్రీనాథుని గ్రంథములందును గానవచ్చుచునే యున్నది. ఇక చైతన్యస్వామియన్ననో 1486 మొదలు 1534 వరకు జీవించినవాడు. చరితామృతము అతడు జీవించియుండగా వ్రాసినది కాదు గాని అతని శిష్యులయొద్దనుండి విశేషముల నన్నిటిని సేకరించుకొన్న కృష్ణదాసు కవిరాజు అను మహాభక్తుడు స్వామి నిర్యాణమునకు సన్నిహిత కాలముననే రచించినది. 15 వ శతాబ్దారంభమున నున్న పేరు శతాబ్దాంతమునకే మారిపోయినదని నిశ్చయించుట సాహసము. కొన్ని శతాబ్దములుగా విద్యకు నిలయమగుటచే నా నగరమునకా బిరుదము వచ్చియుండవలెను. ఇప్పుడు విద్యానగరమనగా విద్యారణ్యుని యాదేశమున నిర్మించిన హంపీ విజయనగరమునకే రూఢిగ వాడుచున్నాము. కాని శ్రీ కృష్ణరాయనికి (1509 మొదలు 1531 వరకు రాజ్యము చేసెను) సమకాలికుడైన శ్రీ చైతన్యులను గూర్చిన గ్రంథములో నెక్కడ చూచినను రాజమహేంద్రవరమును గూర్చి విద్యానగరమనియే కానవచ్చుట వింతగ దోచకమానదు.

ఇంతేకాదు. శ్రీ చైతన్యస్వామి తన యిరువదినాలుగవయేట అనగా 1510 ప్రాంతమున సన్యసించి, సన్యసించిన కొంతకాలమునకే బయలుదేరి శ్రీకూర్మము మొదలుకొని సేతువువరకు దక్షిణదేశమున నున్న పుణ్యక్షేత్రముల నెన్నిటినో సేవించెను. 1512 లో నాతడు రాజమహేంద్రవరమునకు గూడ వచ్చెను. రాజమహేంద్రవరమునకు విద్యాపీఠముగనే ప్రసిద్ధియని యెరుగుదుము గాని పుణ్యక్షేత్రముగ ప్రసిద్ధియనుట యొక క్రొత్తవిషయము. అందును శ్రీ చైతన్యుని యంతటి యవతార పురుషునికి సేవ్యమగుటమరింత వింత. దాని నాతడు సామాన్య క్షేత్రముగ గూడ జూడక విశేష భక్తితో గణించినట్లు గనవచ్చుచున్నది. గోదావరిని జూచి యమునానదిగా భావించియు తత్తీరదేశమును బృందావనముగా భావించియు నృత్య సంకీర్తనముల నాతడు మైమరచెనట.

అతనికిని అతని ముఖ్య శిష్యుడగు రామానందరాయలకును సమావేశ మీ నగరసమీపముననే నడచినది. రామానందరాయలు ఒరిస్సా రాజులకు ప్రతినిధిగ రాజమహేంద్రవరమును రాజధానిగ జేసికొని ఆ ప్రాంతములనెల్ల బాలించుచుండెను. చైతన్యులు వచ్చిన సమయమున కాతడు కొవ్వూరులో నుండుటచే చైతన్యులుకూడ ఒకనాటి యుదయమున నదిని దాటి కొవ్వూరులో నాతనిని గలసికొనిరి. ఆరాత్రి వారిరువురును ఏకాంతముగ గూర్చుండి భక్తిసిద్ధాంతమునకు సంబంధించిన రహస్యముల నెన్నిటినో ముచ్చటించుకొనిరి. వారి సంవాదమంతయు విపులముగ చరితామృతములో నున్నది. గౌడీయమతమున

కిది పరమ ప్రామాణిక మగుటచే దీని నెంతో భక్తితో వారారాధింతురు.

ఇదిగాక అప్పటి రాజమహేంద్రవర ప్రజాజీవిత మెటులుండెనో చిత్రింపజాలిన యమూల్యమైన కథయొకటి యీ గ్రంథమున గానవచ్చుచున్నది. వంగదేశమునుండి మున్ముందుగ జగన్నాథ క్షేత్రము వచ్చి యచ్చటనుండి స్వామి దక్షిణయాత్రకు బయలుదేరెను. జగన్నాథము రాకపూర్వమే కటకములో సాక్షి గోపాలవిగ్రహమును స్వామి దర్శించి యారాధించెను. ఇప్పుడీ సాక్షిగోపాల విగ్రహము కటకమునకు నలువదియెనిమిది మైళ్ళ దూరమున నున్న "సాక్షి గోపాలము" అను ప్రదేశమున నున్నది. అప్పుడు కటకముననే యుండెను. ఇది కటకమున కెట్లు వచ్చినదియు సాక్షిగోపాలుడను పేరు స్వామి కెట్లు కలిగినదియు శ్రీ చైతన్యులకు నిత్యానందస్వామి యను ముఖ్యశిష్యుడు వివరించెను.

ఆరోజులలో అనగా చైతన్యులకు పూర్వమే విద్యానగరమునుండి (రాజమహేంద్రవరమునుండి) ఇద్దరు విప్రులు—ఒకడు యువకుడు మరియొకడు వృద్ధుడు — తీర్థయాత్రలకై బయలుదేరిరట. వారిరువురికి నగరనివాసము తప్ప వేరు బంధుత్వ మేదియు లేదు. వృద్ధుడు కడు ధనికుడు. యువకుడు నిరుపేద. వారు పెక్కు క్షేత్రములను సేవించుకొనినపిమ్మట బృందావనము చేరుకొనిరి. వృద్ధునకు యువకుడు ఆయా క్షేత్రములలో మిక్కిలి భక్తితో సపర్యలు చేయుచుండెను. బృందావనమునందలి గోపాలస్వామియాలయమున వారిద్దరు గోష్ఠినుండగా యువకుని శుశ్రూషకు మెచ్చుకొని వృద్ధుడు తాము స్వగ్రామమునకు బోగానే తనపిల్ల నాతనికిచ్చెదనని వాగ్దానము చేసెనట. "స్వామీ! మీమాటలు విన్న నెవరైన నవ్వెదరు. నాకును మీకును ధనాదివిషయములలో నున్న తారతమ్య మేమి? మీరు నాకు పిల్లనిచ్చుటేమి? నన్నేల వృథాగా ఆశ పెట్టెదరు?" అని యువకుడు నమ్మకుండెనట. వృద్ధుడు మరల మరల వాగ్దానము చేయజొచ్చెను. "అట్లైనచో నీ గోపాలస్వామిసన్నిధిని ప్రమాణము చేయు"డని యువకుడు వృద్ధుని గోరెను. అతడాప్రకారము ప్రమాణము చేసెను.

ఇరువురును స్వగ్రామము వచ్చినతర్వాత కొంతకాలమూరకుండి తనమాట చెల్లించవలసినదని యువకుడు వృద్ధుని గోరెను. వృద్ధుని పెద్దకుమారుడాతనిని త్రోసికొని ముందునకువచ్చి "మానాన్న నీకెన్నడును మాట యీయలేదు. పొ"మ్మని యా యువకుని సాగనంపెనట. అంత నాత డూరిలో తగవరులయొద్ద మొరపెట్టుకొనగా వారు నీకు సాక్ష్య మేమున్నదని ప్రశ్నించిరట. "గోపాలస్వామియాలయములో ఘోర ప్రమాణము చేసెను. గోపాలుడే నాసాక్షి" అని నిశ్చలమనస్కుడై యాతడు బదులు పల్కెనట. "అట్లైన నీ సాక్షినిపోయి తెచ్చుకొ"మ్మని వారు తీర్పుచెప్పి ఆమాటయే మరచి యూరకుండిరి. వృద్ధునికిమాత్రము తన పెద్దకొడుకు వర్తనము నచ్చలేదు. గోపాలుడెట్లయిన నా యువకునికి దోడ్పడి తన్నసత్యమునుండి రక్షించితీరునని విశ్వసించుచుండెనట.

మిగుల ధన్యాత్ముడగుటచే నా యువకుడు నిరుత్సాహుడు గాక తిన్నగ బృందావనమునకుబోయి "వారు పిల్లనిచ్చెదనని యీయకున్నను నాకంత పట్టింపు లేదు. నామాట మాత్రము దబ్బర కాకూడదు." అని స్వామిని బ్రతిమాలుకొనజొచ్చెను "వెర్రివాడా రాతి విగ్రహ మెప్పటికైనను కదలగలదా?" అని స్వామి యాక్షేపించినను వినిపించుకొనక నతడు పనిగ బ్రతిమాల జొచ్చెనట. అతని నిర్బంధమునకు లొంగి యా రాతి విగ్రహము కదలివచ్చి సాక్ష్యమిచ్చుటయు వైభవముతో నాతనికి పిల్లనిచ్చి పెండ్లి చేయుటయు కూడ జరిగెనట. అప్పటినుండియు గోపాలునికి సాక్షిగోపాలుడని పేరు వచ్చెను. సాక్షిగోపాలుడు మరల బృందావనమునకు బోక విద్యానగరముననే నిల్చిపోయెను. ఆ వృద్ధుడును యువకుడునుకూడ నాతనిని సేవించి తరించిరి. తరువాత కొంతకాలమునకు ఓఢ్ర రాజగు పురుషోత్తమదేవుడు విద్యానగరమును జయించి తాను గోపాలభక్తుడగుటచే గోపాలుని ప్రార్థించి యాతని యనుమతిమీద నా విగ్రహమును కటకమునకు గొనిపోయెనట.

ఈ కథలోని సత్యాసత్యముల మాట యెట్లున్నను రాజమహేంద్రనగరవాసులు భక్తి ప్రపత్తులతో గూడిన సజ్జనులని ఇతర రాష్ట్రములలో ప్రసిద్ధి యున్నదనుటకిది నిదర్శనము. ఈ భక్తి ప్రపత్తులను గూర్చి యితర ప్రాంతీయులు కథలు గల్పించి చెప్పుకొనిరన్నను అదికూడ దాని ప్రతిష్ఠను స్థాపించుటకు తోడ్పడుట లేదా?

"తీర్థీ కుర్వంతి తీర్థాని" యనినట్లు తన పాదరజముచే నీ నగరమును పవిత్రము చేయుటచే శ్రీ చైతన్యులు రాజమహేంద్రవరమునకు విరుగని తరుగని యశస్సంపద ననుగ్రహించిన వారైరి. వారి చారిత్రమునకును రాజమహేంద్రమునకును అవినాభావసంబంధ మేర్పడెను.

—శ్రీ నండూరి బంగారయ్య.

# గ్రంథ విమర్శనము

## అనుభవామృతము

మహాలింగ రంగడని, రంగావధూతుడని ప్రసిద్ధుడైన రంగనాథకవి రచించిన కన్నడ గ్రంథానికి యిది అనువాదం: అనువాదకులు శ్రీ కరణం అశ్వత్థరావుగారు. సామాన్య ప్రజానీకానికి సహితం బోధపడటానికి అవకాశంగా రచింపబడిన అద్వైత గ్రంథం. ఇది సంస్కృతిభాషలోకి కూడా అనువాదం జరిగిందంటే ఈ గ్రంథప్రాశస్త్య మెట్టిదో ఊహించవచ్చు; ఈ మహాగ్రంథాన్ని తెలుగులోకి అందించటంలో శ్రీ అశ్వత్థరావుగారు ఆంధ్ర సారస్వతానికి మరొక మహోపకారం కూడా చేశారు. కన్నడ సాహిత్యంలోవున్న 'భామినీ షట్పది' అనే ఛందస్సును కూడా అనువాదంలోకి సేకరించుకొని వచ్చారు. గురుజాడ అప్పారావుగారి 'ముత్యాలసరం' ఈ షట్పదీవృత్తంలోని అర్థభాగమే. అశ్వత్థరావుగారు తెనుగులో ఈ వృత్తాన్ని అత్యంతప్రతిభావంతంగా చాలనంత చేయగలిగారు. అవృష్యా ఈ గ్రంథం ముముక్షువులకేకాక సాహిత్యారాధకులకు కూడా పరిశీలనార్హ మవుతున్నది.

ఉదాహరణకు:

"సుందరుండగు నెవనిగన్నను
డెదమున సుందరి భ్రమించును
సుందరిన్ గని యట్లె పురుషుడు
సుడివడును మమతల్
గ్రందుకొన నన్యోన్యవీక్షణ
మందు నురువడి మోహవిభ్రమ
మొందఁబొందిక జేయుమాయ
దురూహ్య మెవ్వరికిన్"

"స్త్రీపురుషులకు మృదుసరస స
ల్లాపముల, సమరసము చేకుఱు,
నాపివప సంయోగమేర్పడు;
నటు వియోగంబున్
దోపగా నవ్వారు కడు సం
తాపభరమున బొక్కి పడుదురు;
బాపురే మాయావిలాసము
బలుక సాధ్యంబె?"

ప్రాప్తిస్థానం: కరణం అశ్వత్థరావుగారు: కలుగోడు, రాయదుర్గం తాలూకా, బళ్లారిజిల్లా వెల 8-0-0.

---

## ఆంధ్ర మహాభాగవతము: షష్ఠస్కంధము

పోతనామాత్యప్రణీతము: సంపాదకులు, ప్రకాశకులు: శ్రీ రెంటాల శివరామయ్యగారు. చిగురుపాడు, అచ్చంపేట పోస్టు, గుంటూరు జిల్లా, వెల 2-0-0.

నేటికి ముద్రితమై వున్న తెనుగు భాగవత గ్రంథములోని పంచమ, షష్ఠ, ఏకాదశ, ద్వాదశ స్కంధాలు గంగయ సింగయ నారయలు రచించినట్లు ఆశ్వాసాంత గద్యాదికములు తెలుపుతున్నాయి. పోతన రచించిన భాగవతములో ఈ భాగములు ఖిలమై పోగా పైవారు పూరించారో లేక ఈ భాగాలను పోతన అసలు వ్రాయనే లేదో నిర్ధారణగా తెలియదు. పై భాగములను పైన పేర్కొనబడినవారే కాక యింకా పలువురు రచించారు. భాగవతానికి సంబంధించినంతవరకు, ఏకవివ్రాసిన భాగానికైనా లేఖకులు పోతనగద్యను సంధించే సావకాశంకూడా లేకపోలేదు.

ఈ పరిస్థితిలో శ్రీ శివరామయ్యగారు పోతనప్రణీతముగా లభించిన ఈ గ్రంథాన్ని ప్రచురించటం ముదావహం. వాఙ్మయపరిశోధకులు దీనిని పరిశీ

లించి పోతనరచన యగునో కాదో తెలిసికోనవచ్చు. ఇది పోతన రచనయైన సంతోషమే; లేదా ప్రతిభావంతుడైన మరొక ప్రాచీన మహాకవి రచన గానైనా నిది మనకు పూజనీయమే.

## విశ్వగీతి

రచన: శ్రీ సి. నారాయణరెడ్డి; ప్రాప్తిస్థానం: ఆంధ్ర బుక్ హౌస్, సుల్తాన్ బజార్, హైదరాబాదు; వెల 0–6–0.

"గేయం రాయాలి నేను" అంటూ ఇతఃపూర్వం నారాయణ రెడ్డిగారు ఒక గేయం వ్రాశారు. దాన్ని తిలకించిన ఒక పెద్దమనిషి "ఇదేమిటయ్యా? రాయాలి రాయాలనకపోతే ఆ రాసేదేమిటో రాయరాదా?" అని అన్నారట. ఆమాటను పురస్కరించుకొని తన గీతం ఎలాటిదో అభివర్ణించుతూ మరో గీతాన్ని వ్రాశారు రెడ్డిగారు. అదే ఈ 'విశ్వగీతి'. కావ్యం మొదటినుంచి తుదివరకూ కవి తన గీతంయొక్క ఉత్కృష్టతను అభివర్ణించి అక్కడితో విరమించుతారు. ఇంతే దీని ప్రయోజనం.

పూర్వం భావకవులు తమ ప్రేయసిని గురించి అభివర్ణించినట్లు ఇప్పటి నవీనులు కొందరు తమ గీతాన్ని గురించి అభివర్ణించుకున్నారు. తొలుదొల్త 'నాగీతం' అంటూ మొదలెట్టింది శ్రీ బెల్లపుకొండ రామదాసు. అనంతరం ఈ సంప్రదాయం వెర్రిజడలు వేసింది.

'నాలో పలికినగీతం
మృత్యువర్తకీ కరాళ
నృత్యంలో తెగిన కింకి
ణీ గణగళ సంగీతం'

నృత్యంలో తెగిన కింకిణీగణానికి 'మోత' తప్ప సంగీత మెలా వుంటుంది. అయినా పది కాలాల పాటు సుఖంగా బ్రతుకదలచిన జాతికి లేనిపోని అనుకరణాలకు పోయి ఈ 'యమమహిషఘంటికా నాదాలను' వినిపించటం దేనికి? రచనలో సార్థకతకంటే అనుప్రాసాదికాల మోతే బహుళం.

'నాలో విరిసిన గీతం
సంధ్యారాగ స్నాతం
నాలో మెరిసిన గీతం
సప్తవర్ణ సంకేతం
నాలో ఎగిసిన గీతం
ఫాలాక్ష నిటలాగ్ని
జ్వాలామాలాపూతం'

ఇత్యాదయః.

ప్రాచీనుల రచనను దేన్ని తీసుకొన్నా దానికి ఒక పుష్టివున్నట్టు మనకు కనుపించుతుంది. దీనికి కారణమేమిటంటే వారికి యేదో ఒక లక్ష్యముంటూ వుంది. అందుచేత పాఠకుణ్ణి ఏదో ఒక మార్గాన ఒక అడుగు ముందుకు తీసుకుపోగలిగేవారు. ఇటీవల వస్తున్న కావ్యాల ధోరణి ఆశాజనకంగా లేదు. గలగల మాటల జిలుగు తెరలను తొలగించి చూస్తే కనుపించేది వట్టి శూన్యం. పరమనిర్వేదంవినా, ఏ లక్ష్యమూ లేని ఇలాంటి నిరాశావాదధోరణులు జాతికి బల తేజాలను యివ్వలేకపోవటమే గాక, ఉన్న ఆత్మవిశ్వాసాన్ని హత్యచేస్తయ్.

ఇది ఇలా వుండగా, రచయితలో కనుపించే వల్లమాలిన స్వాతిశయం చూస్తే నవ్వువస్తుంది.

'కాళిదాసు కల్పించిన
నీలాషాఢ పయోదం
నన్నయ నడిచిన నవ ప్ర
సన్న కథాకావ్య పథం
శ్రీనాథుని కవితాధా
రాగిరంధ్ర ధ్యానం
పోతన పలికించిన నవ
నీత కావ్య నిక్వాణం
నా గీతంలో చోరబడి
రాగధార పూరించెను
నా గీతంలో అలజడి
రేగించెను మ్రోగించెను'

అంటూగా రచయిత: చివరికి యింతా చేసి 'మోత' క్రింద తయారు కావటం హాస్యాస్పదం. అవును మరి, 'నవనీతానికి' సహితం 'నిర్వాణం' పుటక్కొస్తే యేమౌతుంది! అయినా మనచేత నయిన దేదో మనం వ్రాసుకు నేదానికి యిన్ని గొప్పలకు పోవటం దేనికి?

## రాగోదయం

ఖండకావ్యసంపుటి; రచన: శ్రీ బోయి భీమన్న: ప్రచురణ: దేశికవితామండలి విజయవాడ 2; వెల తెలియదు. భావకవుల ధోరణిలో సాగిన భావగీతాలు:

మచ్చుకు:

"నీ వాలు చూపులో
ఏ వాలు కలుగునో
ఒకే నిరంకుశు నన్ను
ఒకని గంతిను నన్ను
చూపులో నేపట్టి
ఆపి వేశావు!'
ఊపి వేశావు!!"—

## ఆంధ్రదర్శిని

సంపాదకవర్గం: ఎస్. వి. నరసయ్య, కె. యస్. రెడ్డి, జి. రాధాకృష్ణమూర్తి, ఎ. కె. ఆర్. బి. కోటేశ్వరరావు; ప్రచురణ: విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ-2. (1215 పుటలు); వెల 7 రూపాయలు:

ఆంధ్రరాష్ట్రం అవతరించిన అనంతరం ప్రకటింపబడిన మొట్టమొదటి ఆంధ్ర డైరెక్టరీ. ఆంధ్రరాష్ట్రంలోని 11 జిల్లాలకు సంబంధించిన భోగట్టామాత్రమే గాక, తెలంగాణా జిల్లాల సమాచారం కూడా చేర్చబడ్డది. ఇంతేగాక, ఆంధ్రుల చరిత్ర, భాష, రాష్ట్రోద్యమం, వ్యవసాయం, విద్య, సినిమా పరిశ్రమ, నాటకరంగం, మొదలైన వాటికి సంబంధించిన ప్రాచీనాధునాతన పరిస్థితులను వివరించుతూన్న ప్రత్యేక వ్యాసాలను కూడా సంపుటీకరించారు. అందుచేత యావదాంధ్రకు సంబంధించిన సమగ్రమైన భోగట్టాగా దీన్ని మనం అనుకోవచ్చు. తెగించి ఇట్టి మహాప్రయత్నానికి ఉద్యమించి కృతకృత్యులైన విశాలాంధ్ర ప్రచురణాలయంవారు అభినందనీయులు. ఆంధ్ర ప్రజలు ఈ ప్రచురణకు తగినంత ప్రోత్సాహం ఇవ్వగలరని విశ్వసించుచున్నాం.



Printed & published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7. Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad.






ధరలంతయు ఎక్కువగానున్న ఈ రోజులలో ఎక్కడక్కడ మిగల్చగలనో అక్కడక్కడ మిగల్చడానికి చూస్తుంటాను. మొన్న మా ఆయన ఈలా అన్నారు: "నేను ఈవాళ ఇంటి సామానులను కొనుక్కొని వస్తాను." నేను సరే అన్నాను. ఆయన బజారునుండి ఒక 10 పౌనుల డాల్డా వనస్పతి డబ్బాను కొనుక్కొని వచ్చుటను చూడగానే నాకు కోపము వచ్చింది. నేను డబ్బు ఎక్కువ ఖర్చుకాకుండనుండేటందుకై మూతలు తెరువబడిన డబ్బాలోనుండు క్రొవ్వుపదార్థమును కొనుక్కొని వచ్చేదాన్ని. మా ఆయన ఒకేసారి 10 పౌనుల డాల్డా వనస్పతి డబ్బాను తెచ్చారు.

అయితే ఆయన చేసింది సరియే. ఆయన ఈలా అన్నారు: "మనకు ప్రపంచములో అన్నిటికంటే ముఖ్యమైన దేమిటంటే మన పిల్లల ఆరోగ్యమును జాగ్రత్తతో కాపాడుటయే. మూతలు తెరువబడిన డబ్బాలలో అమ్మబడివచో మిక్కిలి ఖరీదైనటువంటియు. ఉన్నతమైనటువంటియునైన క్రొవ్వుపదార్థములుకూడ కల్తీ జేయబడవచ్చును. మరియు అవి మలినముతోగూడిన చేతులతో ముట్టుకొనబడుటవలననో లేక ఈగలు వలననో చెడిపోయి యుండును. ఈ ప్రమాదములు రాకుండా నుండుటకై సురక్షితమైన మార్గమేదంటే సీలుచేయబడిన డబ్బాలోనుండు క్రొవ్వుపదార్థమును కొనుటయే."

ఎన్నో క్రొవ్వుపదార్థములున్నాయి. డాల్డా వనస్పతిని మాత్రమే కొనడానికి కారణమేమని నేను అడుగగా దానికి ఆయనవద్ద జవాబు సిద్ధముగా నుండినది.

"డాల్డా వనస్పతిలో వాడబడు పదార్థములన్నియు పరీక్షచేయబడి అత్యుత్తమమైనవిగా నుండును. డాల్డా వనస్పతిలో ఇప్పుడు విటమినులు ఏ. డి కూడయున్నవి. అది 10 పౌనులు. 5 పౌనులు. 2 పౌనులు మరియు 1 పౌను డబ్బాలలో అమ్మబడును. ఈ డబ్బాలు గాలికూడ చొరుటకు వీలులేకుండ సీలు చేయబడియుండును. మరియు అది ఎల్లప్పుడు శుద్ధముగాను, క్రొత్తగాను నుండును. అది అన్నివిధ వంటలకు దివ్యమైనది."

"మనము భుజించేవాటినంతటిని జాగ్రత్తతో ఎన్నుకొవాలిగదా" అని ఆయన ముగించారు. ఎంత నిజమో! అప్పటినుండి సీలుచేయబడిన డబ్బాలోనుండు డాల్డా వనస్పతిని మాత్రమే నేను కొనుచున్నాను. మీరుకూడ అలాగునే చేయండి!

మీ ప్రతిదిన ఆహారములో క్రొవ్వుపదార్థముండాలా?
ఉచిత సలహాకు ఈవేళే క్రింది అడ్రసుకు వ్రాయండి:

ది డాల్డా అడ్వైసరీ సర్వీస్
పోస్టుబాక్సు నంబరు 353,
బొంబాయి 1

# డాల్డా వనస్పతి

వంటకు దివ్యమైనది—ఖర్చు తక్కువ




చెట్టుతోనున్న డబ్బాకై చూడండి

HVM. 211-X52 TL

## దినదినమునకు ఇంక స్వచ్ఛమైనటువంటియు, ఇంక మనోహరమైనటువంటియునైన చర్మము






రెక్సోనాతో ఈ అద్భుతమైన మార్పును మీరు తెచ్చుకొంటారు



రెక్సోనాయొక్క కేడిల్‌తోగూడుకొన్న నురగను మీ చర్మముమీద మెల్లగా రుద్ది తరువాత కడిగివేయండి. మీ చర్మము దినదినమునకు ఇంక మృదువుగాను. ఇంక మెత్తగాను అగుటను మీరు చూస్తారు. మరియు మీరు క్రొత్త ఆకర్షతను తెచ్చుకొంటారు.



# రెక్సోనా

## ఇది ఒక్కటే కేడిల్* తో గూడిన సబ్బు




* చర్మమును పోషించేటటువంటియు, చర్మమును మెత్తగాచేయునటువంటియునైన నూనెల ఒక ప్రత్యేక మిశ్రమమునకు రిజిస్టర్డ్ పేరు.

RP. 118-50 TL

రెక్సోనా ప్రొప్రయిటరీ లిమిటెడ్‌వారి తరపున ఇండియాలో తయారుచేయబడినది.

Bharathi, 7th May 1954. Regd. No. 1856